# చతుర

The Largest Circulated Telugu Monthly



అక్టోబర్ 1987 * రూ.2-5

## హోల్‌సేల్ రేట్లకే రిటైల్‌గా అమ్మే ఏకైక సంస్థ!




# చందన బ్రదర్స్

(A:C)

**లేడీస్ & జెంట్స్ క్లాత్ షోరూమ్**

జగదాంబ సెంటర్

**విశాఖపట్నం**

ఒ పాప కన్నీటిగాథ



# చందమామ రావే

"చందమామ రావే జాబిల్లి రావే
కొండెక్కిరావే కోటిపూలు తేవే బండెక్కి
రావే బంతిపూలు తేవే..."

అంటూ లాలిపాట పాడుతూ, జోలపాట పాడుతూ అన్నంపెడుతుంది అమ్మ. గోరంత ముద్దలతో కొండంత ఆప్యాయతను కొసరికొసరి రుచిచూపిస్తుంది తల్లి. ముద్దముద్దకు తల్లిప్రేమ రుచిచూసే అదృష్టం అందరు పిల్లలకూ వుంటుంది... అనుకొంటే తప్పేమరి! నాగరికత మరీ బలిసిన ఈరోజుల్లో కన్న తల్లిదండ్రులే అయినాసరే, వారికి తమ బిడ్డల్ని చూసుకొనేంత వీలు, సమయం ఎందరికి వుంటున్నాయో చెప్పండి! ఆప్యాయంగా ఒడిలోకి తీసుకొని స్తన్యమివ్వాల్సిన తల్లికి ఆక్షణంలో తన అందాలెక్కడ కరిగి జారిపోతాయోనన్న ఆలోచన తలెత్తుతున్నరోజులివి! ఇటు తల్లీ, అటు తండ్రీ ఎవరి సమస్యలలో వారై బతుకుతున్న ఈరోజుల్లో తమ కన్నబిడ్డల గురించి ఆలోచించేతీరిక ఎంతమందికి వుంటోంది! —ఎవరి గురించో ఎందుకు?... రజనీకాంతరావు సంగతే తీసుకోండి. ఆయనో షిప్పింగ్ కంపెనీ ప్రొప్రయిటర్. లంకంత కొంప. ఓడంత కారు. లక్షలాది ఆస్తి. రూపాయల గలగలలు వినాలనే తపనలో నిరంతరం ఆయనకు పని జాస్తి. జీవితంలో కాలంతో పరుగుతప్ప నిలబడి ఆలోచించుకొనే వీల్లేనంతటి 'బిజినెస్'మాగ్నెట్ ఆయన. బిడ్డను ప్రసవిస్తూ భార్య చనిపోతే, ఆ పసిబిడ్డ సంరక్షణకోసం బీదింటి పిల్ల శోభను పెళ్లాడతాడు. ఆమె భర్తకు తగిన ఇల్లాలే! భర్త లండన్, పారిస్, అమెరికాలకు వెడుతుంటే, ఈమె



క్లబ్బులకు, షికార్లకు వెడుతుంటుంది. రజనీకాంతరావు తనకు అప్పగించిన సవతికూతురు రూప బాధ్యతను ఆమె తన తండ్రి మూర్తికి అప్పగించింది. కాలనాగుకు తలనే విషంగానీ ఈ మూర్తికి నిలువెల్ల విషం. రూప బతికి వుంటే తన కుమార్తె శోభ సంతానానికి ఆస్తి పూర్తిగా రాదన్నభావంతో రూప అడ్డుతొలగించుకోవాలని నిర్ణయించుకొన్న దుష్టుడు వీడు. అటు అభిమానాన్నీ ఆప్యాయతల్నీ అందుకోలేక ఇటు మూర్తి కసాయిచర్యలు భరించలేక ఒంటరిగా బతికే ఆ రూపకు ఒకేఒక నేస్తం- నల్లపిల్లి. కష్టంలో సుఖంలో సంతోషంలో విషాదంలో తోడై నిలిచే మూగజీవి అది. ఓసారి గ్లాసు పాలలో విషంపోసి రూపకు ఇవ్వబోతాడు ఆ వృద్ధజంబూకం. అది పసిగట్టిందా పిల్లి. దాంతో రూప ప్రమాదంలోంచి బయటపడింది. మర్నాటికి మంచం మీదపడతాడు ఆ ముసలిమూర్తి. ఇంకోసారి రూపను కొండల మీంచి కిందకు దొర్లిస్తాడా బండరాతి మనిషి. అదృష్టవశాత్తూ ఆ సమయంలో అక్కడ రాణితో డ్యూయెట్లు పాడుకొంటూ వున్న రాంబాబు రక్షిస్తాడు రూపను.

అన్నట్లు రాంబాబు గురించి మీకింతవరకు చెప్పనే లేదుగదా! రాంబాబు ఒక్కడేకాదు, అతనికో దోస్తీకూడా వున్నాడు- సూరిబాబు. ఇద్దరు దొరబాబుల్లాటి దొంగలు. చిల్లర జేబు దొంగతనాలుచేసి కడుపు పోషించుకుంటున్న 'కష్టజీవులు'. పోలీసువేషంలో ఇలాంటి దొంగల్నికూడా బుట్టలోవేసి తన పబ్బంగడుపుకొంటూ వుంటుంది రాణి ముగ్గురికి ముగ్గురూ తోడయ్యారు.

చిన్నదొంగతనాలతో విసిగిపోయిన వాళ్లకు ఏదైనా ఓ పెద్దపనిచేసి లక్షలు సంపాదించాలని, ఆ తర్వాత నేరాలకు స్వస్తిచెప్పాలని అనిపిస్తుంది. కానీ పుట్టినప్పటినుంచి జేబు దొంగతనాలే తప్ప తక్కినదేమీ ఎరుగని వాళ్లకు చివరకు ఓ ఉపాయం ఆలోచిస్తారు. ఓ పెద్దింటి పసిపిల్లను కిడ్నాప్‌చేసి తీసుకొస్తే, ఆ బిడ్డను దక్కించుకోవాలనే కాంక్షతో ఆ తల్లిదండ్రులు ఎంతైనా ఇస్తారని వారు ఆశిస్తారు.

అంతే! ఆలస్యం చెయ్యక వారాపథకాన్ని ఆచరణలో పెడతారు. ఏకంగా రూపను ఎత్తుకొచ్చేస్తారు. మర్నాడు రజనీకాంతరావు ఇంటికి ఫోన్‌చేస్తే, ఫోనెత్తాడు మూర్తి. పాపను ఎలాగైనా వదిలించుకోవాలన్న ఆ రాక్షసుడికి ఈ కిడ్నాపింగ్ కాగలకార్యం గంధర్వులే చేసినట్లయింది. పాపను విడిపించుకోవటానికి ముప్పయ్‌లక్షలు కాదుగదా, ముప్పయి రూపాయలు కూడా ఇవ్వనంటాడు. పైగా ఆ పాపను చంపేస్తే తానే పదివేలు ఎదురిస్తానంటాడు. ఇది విన్న మన జంటదొంగలకు మతిపోయింది. కిడ్నాప్‌చేసితెచ్చిన పాపను ఏంచేయాలో తెలీక వాళ్లు విదేశాలనుంచి రజనీకాంతరావు రాకకోసం ఎదురుచూస్తుంటారు.

లక్షలు ఖరీదుచేసే ఆ భవంతిలో లభ్యంకాని ఆదరాభిమానాలు, ఆప్యాయతలూ

ఆ మురికివాడలో ఆ పేదగుడిసెల్లో ఆ మంచి మనసులమధ్య లభ్యం అవుతుంటే రూపకు తనకు కావాల్సిందేమిటో అర్థంఅవుతుంది. డబ్బులేకున్నా అక్కడ ఒకరికొకరున్నారన్న సత్యం రూపకు స్పష్టమవుతుంది. కేకులు, చాక్లెట్లలో లభ్యంకాని ఆప్యాయత చద్దెన్నంలో దొరికితే ఆబగా జుర్రుకొంటుంది. ప్రాణంలేని ఖరీదైన బొమ్మలతో ఆడుకునే బదులు చిరుగు బతుకుల చిన్నారులతో కలిసిపాడుకొంటుంది. అందుకే రాంబాబు, సూరిబాబులు మళ్లీ తీసుకెళ్లి తనను ఆ బంగారుపంజరంలో వదిలేస్తే, లేచి, ఆ పాప పరుగున మమతల ప్రపంచంలోకి వచ్చేస్తుంది. డబ్బుకోసం కిడ్నాప్ చేసిన ఆ ఇద్దరు పాకెట్‌మార్‌ల గుండెలకూ



రూప ఓ అందాల లాకెట్ అవుతుంది. వారి జీవితాల్లోకి కొత్తవెలుగు తెస్తుంది.

ఇలాంటి సమయంలోనే ఇంకో గజదొంగల ముఠా రూపనెత్తుకుపోతుంది. దాంతో జేబు దొంగలే అయినా రాంబాబు, సూరిబాబు గుండెల్లో మమకారపు ఉప్పెనలు చెలరేగుతాయి. రూపకోసం, రూప నెత్తుకుపోయిన ఆ దొంగల జాడకోసం వాడవాడలా గాలిస్తారు.

వాళ్లకు అపుడు రూప జాడ తెలియజేస్తుంది నల్లపిల్లి. మూగజంతువే అయినా ప్రేమను పంచిఇచ్చిన ఆ పాపను ఆ రాక్షసుల బారి నుంచి రక్షించి తన రుణం తీర్చుకుంటుంది.



**ఇలా పరస్పరం అనుబంధాలతో బంధించుకొన్న ఆ నలుగురి మధ్యా జరిగే అందాల మలుపుల బంధాల కథే 'చంద మామ రావే'!** అంతేకాదు, ఇది దొంగలైన వారిద్దరి మనసులనూ దోచుకొన్న ఇద్దరు అందాల భామల సరదా ప్రేమ కథ కూడానూ!

రాంబాబుకు జంట రాణి సూరిబాబుకు జంట కనకం. పోలియోతో బాధపడుతున్న తమ్ముడి కోసం రాణి పోలీసు వేషం వేస్తే, జీవనోపాధి కోసం భూత వైద్యుడి వేషం వేస్తాడు కనకం తండ్రి పోతరాజు. నిత్యజీవితరంగంలో వేషా లు వేసి, మోసాలుచేసి బతికే వీరికి ధీటైనవా డే షావుకారు కూడానూ. దొంగలు తెచ్చిన దొంగ సొమ్ముల్ని కొనటం ఆ షావుకారుకు అలవాటు. ఆ దొంగ సొమ్ముల్ని ఒంటినిండా అలంక రించుకొని, ఇంటినిండా తిరగటం ఆ షావుకా రు భార్యకు అలవాటు. ఇక రూపాయి పెట్టుబ డితో లాటరీలో లక్షలు గడించాలని, వాటితో సినిమా తీయాలనే పిచ్చివున్నవాడు లాటరీ లక్ష్మణరావు. అడుక్కొంటూ తిరుగుతూ, ఆ డబ్బుతో లాటరీ టిక్కెట్లు కొని, ప్రైజులు కూడా కొట్టి, ఆటోల్లోంచి అడుక్కోవటం మొదలుపె ట్టిన బిచ్చగాడు.... **ఇలా మనకు అనునిత్యమూ తారసపడే అనేకానేక తమాషా మనస్తత్వాల పాత్రల మేలు కలయికే 'చందమామరావే'!**

ఈ మనస్తత్వాలన్నిటినీ సున్నితమైన హాస్య సంఘటనలతో, మనసుల్ని ద్రవింపజేసే సన్ని వేశాలతో మాలగా కూర్చిన నవ్వుల పువ్వుల కదంబం, మనసుకు పట్టే సుగంధం 'చంద మామ రావే'!

కన్నబిడ్డలకు అందివ్వాల్సింది లక్షలుగా వనీ, వారు కోరుకునేది కన్నవారి మమతానురా గాలేనన్న జీవితసత్యానికి దర్పణం 'చందమా మరావే'! ఒకేసారి లక్షల డబ్బు సంపాదించా లనే కోరికలతో ఎందరో సోమరులు దారులు తప్పి తెలిసో తెలియకో చేసే నేరాల గురించిన సజీవ చిత్రణమే 'చందమామ రావే'! దొంగ తనం కూడదనీ, శ్రమజీవనంలోనే మనిషి బతుకుకొక అర్థంవుందనీ ఆ 'దొంగబాబా య్'లకు సున్నితంగా ఓ పాప నేర్పిన జీవిత గుణపాఠానికి సుమధుర చిత్రీకరణం 'చంద మామరావే'! మాటలు నేర్చిన మనుమలకన్నా మూగజీవులే నయమన్న నిజానికి ప్రాణంపో సిన చిత్రం 'చందమామరావే'!





పెద్దలకు, పిన్నలకు, కన్నతల్లిదండ్రులకు, కన్నబిడ్డలకూ అందరికీ వినోదాల వెన్నెలలు పంచే చిత్రం ఉషాకిరణ్ మూవీస్‌వారి 'చంద మామరావే'!

బేబి సుజిత, నూతన్‌ప్రసాద్, చంద్రమోహన్, కల్పన, పద్మిని, విద్యాసాగర్, రాజ్యలక్ష్మి, వంకాయల, మల్లికార్జునరావు, మాడా, యం.యస్.ప్రకాశ్, కృష్ణవేణి, తాతినేని రాజేశ్వరి, చిట్టిబాబు ప్రభృతులు ఈ చిత్రంలో పాత్రలకు జీవంపోశారు.

'చందమామ రావే' చిత్రానికి కాశీ విశ్వనాథ్ కథ మాటలు సమకూర్చితే, వేటూరి గీత రచనచేశారు. సత్యం సంగీత రచన. నవకాంత్ ఛాయాగ్రహణాన్ని నిర్వహించితే, కళాదర్శకత్వాన్ని భాస్కరరాజు వహించారు. గౌతంరాజు కూర్పు.

అట్లూరి రామారావు ఎగ్జిక్యూటివ్ ప్రొడ్యూసర్, రామోజీరావు నిర్మాత.
స్క్రీన్‌ప్లే, దర్శకత్వం మౌళి.
విడుదల: మయూరి.


మౌళి


కాశీవిశ్వనాథ్


నవకాంత్


వేటూరి సుందరరామమూర్తి


సత్యం,


గౌతంరాజు


శివ సుబ్రహ్మణ్యం


భాస్కరరాజు


యస్.పి. బాలసుబ్రహ్మణ్యం


యస్. జానకి


అట్లూరి రామారావు


చందమామ రావే
రామోజీరావు
మౌళి
కాశీవిశ్వనాథ్..సత్యం..నవకాంత్..గౌతంరాజు..భాస్కరరాజు..అట్లూరి రామారావు.




# అందాన్ని అందించడం ప్రకృతి సహజం. అందచందాల్ని అందించడం కేమియో లక్షణం.

కొబ్బరి నూనెలోని మృదువైన నవనీతం మీ శరీర శోభను ఇనుమడింప చేస్తుంది.

రోజంతా మీ శరీరాన్ని పూల పరిమళంలో తేలియాడిస్తుంది.

"న్యూ కేమియో బ్యూటీ సోప్" మీముందు.

అందాల సంరక్షణలో ఒక కొత్త అనుభవాన్ని అందిస్తుంది.




**కేమియో**
బ్యూటీ సోప్

మీ శరీర సౌందర్య పరిరక్షణలో ఓ కొత్త మలుపు ఇస్తుంది కేమియో



జయలక్ష్మీ వారి ఉత్పాదన

ACIL/025/86-T



# చతుర సమీక్ష

ఈ శీర్షిక ద్వారా ప్రతి నెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని పాఠకులకు కల్పిస్తోంది 'చతుర'. పాఠకులు 'చతుర' నవలపై ఏ నెలకానెల తమ అభిప్రాయం వెల్లడిస్తూ, ఆ నవల ఎందువల్ల తమను ఆకట్టుకుందో, లేదా ఎందువల్ల ఆ నవల తమకు నచ్చలేదో వివరిస్తూ, రచన బాగోగుల గురించి రాయాలి. పాఠకులు గమనించవలసిన కొన్ని ముఖ్యాంశాలు:

1. మీ **"చతుర సమీక్ష"** అరఠావుకి మించకుండా కాగితానికి ఒక వైపునే రాయాలి.
2. ఏనెల నవల సమీక్షలు ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవర్‌పై **చతుర సమీక్ష కు** అని పేర్కొని, ఎడిటర్ 'చతుర', ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడా, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్టుచేయాలి.

మాకు అందిన సమీక్షలలో ఉత్తమమైనవిగా ఎంపికచేసి ప్రచురించినవాటిలో తొలి మూడింటికి రు. 100/-, రు. 75/-, రు. 50/- చొప్పున; మరో మూడింటికి రు. 25/- చొప్పున నగదు బహుమతులు పంపగలం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాశక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

## కూపన్

**అక్టోబర్ 'చతుర' నవల: దైవప్రతినిధులు**

సమీక్షకుని పేరు: ..............................................

చిరునామా: ..............................................

..............................................

..............................................

..............................................

## 'ప్రమదావని'పై 'చతుర' సమీక్షలు!

'చతుర' నవలల సిరీస్‌లో ప్రత్యేక నవలగా ఎన్నికై ఆగస్టు సంచికలో ప్రచురితమైన 'ప్రమదావని'పై మాకు అందిన 'చతుర సమీక్ష'లలో ఉత్తమంగా వున్న ఆరింటిని ఈ సంచికలో ప్రచురిస్తున్నాము. ఈ పోటీలో పాల్గొన్న పాఠకులందరికీ మా కృతజ్ఞతలు. బహుమతులు పొందినవారికి మా అభినందనలు!

### ఊహాలోకాలు

(ప్రథమ బహుమతి రు. 100/- పొందిన సమీక్ష)

"ప్రమదావని" నవల హాస్యభరితంగా ఉన్నప్పటికీ, అందులో సామాజిక సమస్యలు ప్రస్ఫుటంగా గోచరిస్తున్నాయి. కాని రచయిత సమస్యలకు ఊహాలోకాలను తయారుచేశారే తప్ప, పరిష్కారమార్గాన్ని గురించి వారికి స్పష్టమైన అవగాహనలేదనే అనిపిస్తోంది.

ప్రస్తుతం మనంవున్న సమాజానికి పూర్తి విరుద్ధమైన స్త్రీ ఆధిక్యత కల్గిన సమాజాన్ని వారు ఊహించారు! అసలు మన గతచరిత్రలో స్త్రీద్వారానే గుర్తింపబడిన మాతృస్వామ్య వ్యవస్థ వుండేది. అది కాలక్రమేణా పురుషాధిక్యత గల ఈ సమాజంగా మారింది. తిరిగి 'ప్రమదావని'లోలాగావుండాలని హాస్యంగానైనా రచన చేయడం సరైనదికాదు, అలాంటి సమాజం ఏర్పాటుచేయడం సాధ్యమూకాదు. చరిత్ర వెనకకు తిరగదు. కాకపోతే స్త్రీ ఎందులోనూ పురుషుడితో తీసిపోదనే విషయాన్ని చాలా స్పష్టంగా వాళ్ల సమాజంలో చూపిస్తూ రచనసాగించారు. అది పాఠకులలో సామాజిక స్పృహని కల్గిస్తుంది. స్త్రీ పురుషులలోనున్న తేడాలను విశ్లేషించుకోడానికి పాఠకునికి మంచి అవకాశాన్ని రచయిత కలిగించారు.

రచయిత ఊహించిన సమతావని కాకపోయినా ఆ సమాజానికి దారితీసే మార్గంలో ప్రస్తుతం సోషలిస్టు దేశాలు పయనిస్తున్నాయి. ఆ సోషలిస్టు దేశాల ఆర్థిక పరిస్థితులు బలపడేకొలదీ క్రమానుగతంగా అవి సమతావనిలోకే అడుగుపెడతాయి. అత్యున్నత చైతన్యం కలిగిన సమాజంగా అవి రూపొందుతాయి.

అయితే, ఏ సోషలిస్టు దేశం కూడా రచయిత ఊహించిన మార్గంలో మార్పులు రాలేదు. విప్లవాలద్వారా అవి మార్పులను సాధించుకున్నాయి. కష్టజీవులు ఐక్యమై పోరాడి వాళ్ల రాజ్యాలను నిర్మించుకున్నారు. వారు తమ స్త్రీలను గౌరవించుకున్నారు.

రచయిత సమతావనిని సక్రమంగానే ఊహించగలిగారుగానీ, దానికి వెళ్లే మార్గాన్ని స్పష్టంచేయలేకపోయారు. సామాజిక స్పృహ మాత్రమే కలిగి, రాజకీయ ప్రాపంచిక స్పృహ లేక ఆ పొరపాటుచేశారనిపిస్తున్నది. ఫలితంగా సాహిత్యంయొక్క చరమ లక్ష్యాన్ని సాధించడంలో కృతకృత్యులు కాలేకపోయారు. అయినా రచనలో సంభాషణలు, శైలి చక్కగా వున్నాయి. రచన సాఫీగా సాగింది. ఎక్కడా బోర్ అనిపించలేదు. తొలి నవలే ఇలా వుందంటే ఈ రచయితనుండి మరిన్ని మంచి నవలలు ఆశించవచ్చు.

— **అవనిగడ్డ పద్మావతి**, విజయవాడ.

### మరో ప్రపంచం

(ద్వితీయ బహుమతి రు. 75/- పొందిన సమీక్ష)

"ఈ విశాల ప్రపంచంలో ఆడదాని జీవితం చీరలు, నగలు, సినిమాలు, అమ్మలక్కల కబుర్లువంటి అల్పమైనవాటికే పరిమితమై అదే స్వర్గమనుకోవడం ఎంత హీనం" అంటూ నవలను ప్రారంభించారు. నేటి సమాజంలో ఒక నగటు ఆడదాని జీవితాన్ని హృదయవిదా

రకంగా వర్ణించి, ఆ నగటు మొగవాడి అహంకారానికి చావుదెబ్బ కొట్టేటట్లు 'ప్రమదావని' ని మన సమాజ వ్యవస్థకు దర్పణంలాగా వ్యతిరేకార్థంలోనైనా అద్భుతంగా చిత్రీకరించారు. ముగించబోయే ముందు అన్నికాలాలకు, అన్ని సమాజాలకు ఆదర్శవంతమైన 'సమతావని'ని సమస్యా పరిష్కారంగా సూచించారు. ఈ నవల నన్ను ఎంతగానో కదిలించింది.

ఈనాటి సమాజంలో భర్త కోపాన్ని అతను చేసే అవమానాల్ని సహిస్తూ, యాంత్రికంగా అతని కోర్కెలు తీరుస్తూ, వండక్కో, వబ్బానికో ముఖాన్నకొట్టే చీరనో, నగనో చూసి మురిసిపోతూ జీవితాన్ని వెళ్ళబుచ్చే జీవచ్ఛవాలలో ఒక్కరికైనా ఈ నవల ద్వారా కనువిప్పుకలిగితే చాలుననిపిస్తుంది.

బట్టలను మార్చినంత తేలిగ్గా స్త్రీలను మార్చి స్త్రీజాతి మీద చులకన భావంతో పెరిగిన ఆనంద్‌లాంటి హీనుల్లో ఒక్కరయినా అడది ప్రకృతికి
ప్రతిరూపమనే సత్యాన్ని తెలుసుకోగలిగితే 'సమతావని' రచయిత ఊహాసౌధాల్లోనే మిగిలిపోక వాస్తవంలోనూ సుసాధ్యమౌతుంది.

"పరిపూర్ణమైన స్వేచ్ఛ, సమానత్వాలున్న మమతానురాగాలే తప్ప ఈర్ష్య, అసూయ లుండవు"- అనే వాక్యం ఆణిముత్యం. నిజమే, నేటి సమాజంలో జరిగే అవకతవకలకు, అన్యాయాలకు, అక్రమాలకు కారణభూతమైన స్వార్థం, అహంకారం, ఈర్ష్య, అసూయలు సమూలంగా నిర్మూలించి "సమతావని"లాటి "మరో ప్రపంచం" మనం సృష్టించుకోవాలి. — డాక్టర్ వై. సుజాత, గుంటూరు.

## సజీవ సమస్య

(తృతీయబహుమతి రు.50/- పొందిన సమీక్ష)

వస్తు వైవిధ్యం, సామాజిక అవగాహన మిళితమైన రచనలు పాఠకులకు అందించడం సాంప్రదాయంగా పెట్టుకున్న "చతుర" అందించిన ఆ కోవకే చెందిన మరొక నవల "ప్రమదావని".

మన వ్యవస్థలోని పురుషాధిక్యతకు ప్రతీక ఈ నవలలోని ఆనంద్. నగటు మగవాడికి వున్న లక్షణాలన్నీ యీ పాత్రకు ఆపాదించారు రచయిత. అణగదొక్కబడిన 'స్త్రీజాతికి ప్రతిరూపం పార్వతి. చండిక రచయిత ఆశించిన వ్యవస్థలోని స్త్రీమూర్తికి ప్రతిబింబం. ఈ పాత్రల ఆలంబనగా రచయిత అల్లిన కథలో వాస్తవికత పాలునువిస్మరిస్తే, నిస్సందేహంగా మంచి రచన ఇది. కాని స్త్రీల పట్ల పురుషులెంత నిర్దాక్షిణ్యంగా, అమానుషంగా ప్రవర్తిస్తున్నారో ప్రమదావనిలో స్త్రీ పాత్రలు పురుషుల ఎడల అలా ప్రవర్తిస్తాయి. చెప్పదలచుకున్న పాయింట్‌ను ఇలా ప్రజంట్ చేయడం ఈ నవల్లో ప్రత్యేకతా? స్త్రీ ఆధిక్యత ప్రబలివున్న ప్రమదావనినుండి బయట పడాలని ఆనంద్ మనసు ఎంత తీవ్రంగా ప్రయత్నిస్తున్నదో చదువుతుంటే, ఈనాటి మన వ్యవస్థ లోని స్త్రీ ఆ విధంగానే ఆశిస్తున్నది, అభిలషిస్తున్నది అనిపించకమానదు. కాకుంటే ఆ భావాలను కనీసం వ్యక్తపరిచే స్వాతంత్య్రంకాని, ప్రతిఘటించే అవకాశం కాని స్త్రీకి లభించకపోవటం దురదృష్టకరం.

చివరగా రచయిత ఈ సమస్యకు పరిష్కారంగా ఎలాంటి ముగింపును సూచించలేకపోవటం విడ్డూరంగా వుంది. ఇది పరిష్కారం లభించని సమస్యగా రచయిత తలపోస్తున్నారా? లేక స్త్రీ పురుషులకు సమాన హక్కులు, స్వాతంత్య్రము కలిగిన 'సమతావని' ని రచయిత ప్రబోధిస్తున్నారా అనేది అర్థంకాదు. 'సమతావని' స్థాయికి మన వ్యవస్థ ఎదగగలదా? అనేది జవాబు దొరకని ప్రశ్న. ఏదియేమైనా ఒక సజీవ సమస్యను యథాతథంగా ఎత్తి చూపిన రచనగా 'ప్రమదావని'ని ప్రశంసించక తప్పదు.

—ఇ.టి.రామారావు, శ్రీహరికోట.

## వ్యవస్థలోపం

(రు 25/- బహుమతిపొందిన సమీక్ష)

"ప్రమదావని" పైకి హాస్యంగా కనిపించినా ఆలోచనలు రేకెత్తించేదిగా వుంది. మనిషి స్వభావం పెంపకంమీద, పరిసరాలమీద ఎలా ఆధారపడుతుందో చక్కగా తెలియజేశారు. చిన్నతనంలోనే ఒదిగి వుండమని చెప్పడం, అలంకరణ, ఆభరణాలమీది మోజు స్త్రీలను భావదాస్యానికి అలవాటు చేస్తున్నాయి.

స్త్రీని తరతరాలుగా ఆభరణాల మోజులో వుంచి "నీవు బలహీనురాలివి, మా రక్షణలో వుండాలి" అని పరోక్షంగా సూచిస్తూ వచ్చారు. ఒక పురుషునికి జన్మనివ్వగల స్త్రీ పురుషుడి చేత లోకువగా చూడబడటం ఏమిటి? భార్యగా స్త్రీని లోకువగా చూసి హింసించగల పురుషుడు తన చెల్లెలో, కూతురో, అయిన స్త్రీ మరో పురుషుని చేతిలో బాధలు పడుతుంటే నిస్సహాయతను ప్రదర్శించడం ఈ వ్యవస్థ లోపంకాదా?

ఈ స్థితికి చాలావరకు స్త్రీల అజ్ఞానమే కారణం. స్త్రీని ఉన్నతంగా చిత్రీకరించి స్త్రీ జాతిని భావ దాస్యం నుండి మేలుకోమని ప్రబోధించే రచయిత్రులను గురించి సాటి స్త్రీలే నీచంగా మాట్లాడటం చాలాసార్లు విని షాక్ తిన్నాను. ఇంతకంటే అజ్ఞానం ఇంకేమయినా వుందా?

అయితే ఈ నవలకు ప్రేరణ అయిన కందుకూరి వీరేశలింగం గారి "సత్యరాజా పూర్వదేశ యాత్రలు" ను రచయిత పి.యస్.వి. ప్రసాద్‌గారు పేర్కొని వుంటే బాగుండేది.

—డాక్టర్ డి.సీతాదేవి, నిడమనూరు.

## సామాజిక ప్రయోజనం

(రు 25/- బహుమతిపొందిన సమీక్ష)

ఫాంటసీ నవలలు తెలుగు సాహిత్యానికి కొత్త ఏమీకావు. అయితే ఇంతవరకు తెలుగు సాహిత్యంలో వెలువడ్డ ఫాంటసీ నవలలు కేవలం పాఠకులను కాస్సేపు ఊహాప్రపంచంలో తేలియాడించి తమాషా చేశాయి గానీ ఆలోచింపచేయలేదు. ఈ తమాషా ప్రక్రియను వీరేశలింగంగారి రోజుల్లోనేకాదు, ఈనాడుకూడా సామాజిక ప్రయోజనానికి ఎంత సున్నితంగా, నూటిగా ఉపయోగించుకోవచ్చో రచయిత శ్రీ ప్రసాద్ ఈ నవలద్వారా తెలియజెప్పారు.

నవలను మూడు భాగాలుగా విడదీసుకుంటే మొదటిభాగంలో పురుషాధిక్యత అడుగడుగునా కన్పిస్తూ స్త్రీని అణిచేస్తున్న సమాజం కన్పిస్తుంది. ఈ సమాజం గురించి అందరికీ తెలిసిందేకాబట్టి రచయిత కేవలం అయిదు పేజీల్లో క్లుప్తీకరించి మనను 'ప్రమదావని'లోకి తీసుకెళ్ళిపోయారు. రెండవభాగమైన 'ప్రమదావని'లో స్త్రీ ఆధిక్యత ఎలా వుంటుందన్నది అద్దంలోలా చూపించారు. చిన్నపిల్లల కథల దగ్గరనుంచి సినిమాలదాకా, వంటింటి దగ్గరనుంచి దేవాలయందాకా, భాషలోనూ, అధికారంలోనూ భావనలోనూ అడుగడుగునా స్త్రీ ఆధిక్యత, పురుషుల నిర్వీర్యత చూపించారు. పురుషుడు స్త్రీస్థానంలో వుంటే ఎలావుంటుందన్నది అత్యంత సహజరీతిలో మలచటం అనన్యసామాన్యం అని చెప్పచ్చు. ఇక్కడే ఆగిపోలేదు రచయిత. సమాజంలో ఎవరు ఎక్కువ తక్కువ అయినా ముప్పే అని ఆలోచించి చేసిన మరో సృష్టి "సమతావని". మూడోభాగమైన ఈ "సమతావని"లో రచయిత ఏదైతే ఉండాలని, ఏదైతే బాగుంటుందని కోరుకుంటున్నారో ఆ భావప్రపంచం మన కళ్ళముంచు ఉంచారు.

సస్పెన్సు, సెక్సు, హింసలతో నిండిపోతున్న ఈనాటి సీరియల్‌నవల్ల బాణీలో ఈ నవల పడకపోవటం పాఠకుల అదృష్టం! లేకుంటే 'ప్రమదావని'నిండా సామూహిక మానభంగాలు, కిడ్నాప్‌లు, చోటుచేసుకునేవి. 'చతుర'ను అలంకరించిన ఈ నవల నిజంగా పాఠకుల ఆలోచనాభావవిహంగాలను ఎగరేసే వినీలాకాశం అనడంలో సందేహంలేదు.

—వి.యస్.యన్.మూర్తి, టెక్కలి.

## మగవారికి ఆత్మపరిశీలన

(రు 25/- బహుమతిపొందిన సమీక్ష)

సంచలనాత్మక నవల 'ప్రమదావని' రచయిత ఒక నూతన విషయాన్ని పాఠకుల హృదయానికి హత్తుకొనేలా చెప్పారు. నవల చదువుతున్నంతసేపు పాఠకులు ఒక వినూత్న లోకంలో జీవిస్తున్న అనుభూతిని కలగజేయడంలో రచయిత కృతకృత్యులయ్యారు. పురుషాధిక్య సమాజంలో అసహజమనిపించే విషయాన్ని రచయిత తన పటుత్వమైన కథనంతో సజీవంగా చిత్రించారు.

ఆనంద్‌లాంటి రాక్షస ప్రవృత్తిగలవారిని ఏరి 'ప్రమదావని'లో ప్రవేశపెడితే, ఆ శిక్షతో

మిగతా పురుష ప్రపంచం ఆడవారిపట్ల తమ ప్రవర్తనను తప్పక మార్చుకుంటుంది. పురుషాధిక్య సమాజంలో తమ భార్యలను పీడించి, హింసించి చేయించిన పనులే స్త్రీ ఆధిక్యసమాజంలో తాము చేయాల్సిన స్థితివచ్చేసరికి మగవాడు ఎలా ఫీల్అవుతాడనేదానికి 'ప్రమదావని'లో ఆనంద్ ప్రవర్తన ఒక నిదర్శనం. తాను పార్వతికి చేసిన అన్యాయాలకు తగిన శిక్షే ఇది అని అనుకోకుండా, అక్కడినుండి తప్పించుకొని 'ప్రమదావని'ని సమూలంగా నాశనంచేయాలనే ఆనంద్ ఆలోచనలు మగవాని తరతరాల అహానికి ప్రతీకలు.

నవలలో అక్కడక్కడగల సునిశిత విమర్శ, ఈ సమాజ లక్షణాలు నరనరాన జీర్ణించుకొన్న పురుష ప్రపంచానికి ముల్లులా గుచ్చుకున్నా, అవి కాదనలేని వాస్తవాలే! ఆ వాస్తవాలే సున్నితమైన హాస్యాన్ని సృష్టించి ఉల్లాసం కలిగించాయి. నవలలో ఉపయోగించిన నూతన పదాలు మానవి, అబలుడు లాంటివి అర్థవంతంగా ఉన్నాయి.

ఇంత పకడ్బందీగా ఉన్న ఈ నవలలో ఎక్కడో ఏదో లోపంవున్నట్లు అన్పిస్తుంది. ఇంత పురుషాధిక్య సమాజంలోగూడా ప్రతిభవున్న స్త్రీలు ఉన్నతస్థానాన్ని అలంకరించారు, రాజ్యాలేలారు, పూజింపబడ్డారు.

నవల చివర్లో దర్శనమిచ్చే 'సమతావని'కొంతవరకు బాగున్నా అది యాంత్రికమైన జీవన విధానం. అలాంటి సమాజమే అమల్లో వున్న కొన్ని దేశాలలో మార్పులు వస్తున్నాయని ఈమధ్యనే చదువుతున్నామే, మరి అలాంటి సమాజం ఎంతవరకు విజయవంతమౌతుందో చెప్పడం కష్టం.

మొత్తంమీద 'ప్రమదావ'ని చదివింతర్వాత హృదయముండి, ఆలోచించే ఏ మగవానిలోనైనా ఆత్మపరిశీలన కలిగి మార్పువస్తుందని నిస్సంశయంగా చెప్పవచ్చు. ఈ మార్పే ఆడవారి మనుగడను సుఖమయం చేస్తే నవలయొక్క ఉద్దేశం నెరవేరినట్లే. సరికొత్త విషయాలతో ప్రయోగాత్మక నవలలు ప్రచురించే 'చతుర' తన విశిష్టతను మరొక్కసారి నిరూపించుకుంది.

— మ్యాక మధుసూదన్, సింగూర్ ప్రాజెక్ట్.

# అప్పు

మూడవ బహుమతి
రు. 50/- పొందిన మినీ కథ

రాజారావు, మూర్తి రోడ్డుమీద నడుస్తున్నారు. ఇద్దరూ మంచి స్నేహితులు. ఒకే ఆఫీసులో వేర్వేరు సెక్షన్లలో ఉద్యోగులు... కలిసి సినిమాలకి, షికార్లకీ తిరుగుతూంటారు.

సాయంకాలం... రోడ్లన్నీ రద్దీగా ఉన్నాయి. అంత రద్దీలోనూ తననెవరో పిలిచినట్టయి రాజారావు పక్కకు తిరిగి చూశాడు.

ఎదురుగా దూరంగా ఏడుకొండలు...! విష్ చేస్తూ రాజారావు దగ్గరగా వచ్చాడతను. ఏడుకొండలు అదే వూళ్ళో వాళ్ళ ఆఫీసులోనే రాజారావు సెక్షన్లో అతని కొలీగ్. పైగా రాజారావూ వాళ్ళ వీధిలోనే ఉంటున్నాడు కూడా.

"సార్! ఆ యాభైరూపాయలూ తమరివ్వనే లేదు!" అంటూ ఏడుకొండలు రాజారావుని నిలదీస్తున్నట్టుగా అడిగాడు.

"ఇస్తానులెండి!" రాజారావు నవ్వుతూనే అన్నాడు.

"త్వరగా ఇవ్వండిసార్! చాలా అవసరం" ఏడుకొండలు నిష్ఠూరంగా అని వెనక్కి తిరిగి వెళ్ళిపోయాడు.

"నీకు ఏభైరూపాయలు అప్పు ఏమిట్రా? నువ్వే మాకు అప్పులివ్వగల వాడివే?" మూర్తి రాజారావుని అడిగాడు.

రాజారావు మాట్లాడలేదు. చిరునవ్వే సమాధానం.

మరోసారి మిత్రులిద్దరూ బజారులో కూరగాయలు కొంటూవుంటే ఏడుకొండలు మళ్ళీ తారసపడ్డాడు.

"ఏంసార్! ఆ యాభైరూపాయలు..." రాజారావుని అడిగాడు కాస్త నిష్ఠూరంగానే.

"అలాగే ఇస్తానులే!" రాజారావు కాస్తకటువుగానే అన్నాడు.

మరోవారం తరువాత, మిత్రులిద్దరూ టిక్కెట్లు తీసుకుని సినిమాహాల్లోకి వెడుతూంటే అక్కడ వరండాలో కనిపించాడు ఏడుకొండలు.






"ఏం౿ సార్ కులాసా! మర్చిపోయినట్లున్నారు... ఆ యాభైరూపాయలు" పాతపాటే పాడాడు.

ఈసారి రాజారావు జవాబుసరిగ్గా చెప్పనేలేదు. తల వంకించి నిర్లక్ష్యంగా ముందుకు నడిచాడు. స్నేహితులిద్దరూ హాలులోకి వెళ్ళిపోయారు.

"ఏమిత్రా! వాడంతగా అడుగుతూవుంటే సమాధానం కూడా చెప్పవేం? ఆ యాభై ఏదో వాడి మొహాన వేయకూడదూ? అసలు... వాడి దగ్గర అప్పు ఎందుకు తీసుకున్నావ్‌రా?" మూర్తి కోపంగా అడిగాడు హాల్లో కూర్చున్న తరువాత.

రాజారావుకు మండుకొచ్చింది– "వాడిదగ్గర తీసుకోవడమా? ఏదో ఆపదొచ్చిందని...

అర్జంటుగా వందరూపాయలు అప్పుకావాలంటూ ఒకరోజు వచ్చిపడ్డాడు. నాదగ్గర ఓ యాభైరూపాయలుంటే ఇచ్చి, సరే సర్దుకో మిగితావి వీలయితే తర్వాత చూద్దామని ఇచ్చాను. మూణ్ణెల్లయింది. ఆ డబ్బులివ్వలేదు సరికదా ఆ మిగతా యాభై ఇవ్వమంటూ కనిపించినపుడల్లా కొరుక్కుతినేస్తున్నాడు..."

–శ్రీకంఠ స్ఫూర్తి

# యాత్రానుభవాలు

**మూడవ బహుమతి**

**రు. 50/- పొందిన మినీ కథ**

సుబ్బారావుకి 'స్వదబ్బా' అంటే ఎంతో ఇష్టం అతనికి పూర్తి వ్యతిరేకం అతని భార్య సుందరి. పెళ్ళిచూపులరోజునే సుబ్బారావు విషయం పూర్తిగా గ్రహించింది సుందరి. ప్రతి దానికి డబ్బాకొట్టుకునే భర్తని కంట్రోల్‌చేసే ఉపాయం గురించి తీవ్రంగా ఆలోచించింది సుందరి. ఎంత ఆలోచించినా ఏమీ తోచలేదు గానీ, ఈలోగా అమెరికాలో ఉన్న ఆమె అన్న గారి దగ్గర్నుంచి రెండు రిటర్న్ టిక్కెట్లు వచ్చాయి, అమెరికా చూసిపొమ్మంటూ.

ఆరోజునుంచి ప్రారంభించేడు సుబ్బారావు తనకు తెల్సున్నవాళ్ళింటికీ, తెలియనివాళ్ళింటికీ, తెలిసీతెలియనివాళ్ళింటికీ వెళ్ళి– "అమెరికా వెళ్తున్నాను, మీకేం తెమ్మంటారు" అంటూ అడిగి, ఓ పెద్దలిస్టు తయారు చేసుకున్నాడు. సుబ్బారావు - సుందరిలకి వీడ్కోలు చెప్పడానికి ఎయిర్‌పోర్ట్‌కి ఓ రెండువేల మంది దాకా వచ్చారు. వాళ్ళందరూ సుబ్బారావుకి ఏదో ఒకటి తెమ్మని చెప్పినవాళ్ళే. అమెరికా వెళ్ళేటప్పుడు సుబ్బారావు లగేజి రెండు సూట్‌కేసులయితే, తిరిగి వచ్చేటపుడు రెం

లారీల లగేజితో దిగాడు. ఇండియా తిరిగొచ్చిన వెంటనే- సుందరి- సుబ్బారావులకు 'అభినందనసభ' ఏర్పాటు చేశారా ఊరివాళ్లంతా కలసి.

"మీకు నోరు అసలే ఆగదు. మీకు తెలీకుండానే రెచ్చిపోతుంటారు. పోనీ ఓ పనిచేద్దాం– మీరు మాట్లాడేటపుడు మరీ శ్రుతి మించిపోతున్నారని నాకనిపిస్తే మీ కాలు తొక్కుతాను – మీరు వెంటనే తగ్గిపోండి... సరేనా?" హెచ్చరించింది సుందరి.

"ఓకే! అలాగే కానీ... కాలు మరీగట్టిగా తొక్కెయ్యకేం!" అన్నాడు సుబ్బారావు.

* * *

అభినందనసభ ప్రారంభమైంది. ఒకరిద్దరు మాట్లాడాక సుబ్బారావుని తమ అమెరికా అనుభవాల్ని వివరించమన్నారు. "నామీద ఎంతో అభిమానంతో ఈ సభను ఏర్పాటుచేసిన మీకందరికీ నా థాంక్స్! అమెరికాలో మనవాళ్లు మమ్మల్ని ఎంతో శ్రద్ధగా చూస్కున్నారు. విమానంలో మాకిచ్చిన బన్, జామ్ చాలా రుచిగా ఉన్నాయి. కాఫీలో ఇంకొంచెం సుగర్ వేసుంటే ఇంకా బావుండేది. ఇహపోతే... మేం అమెరికాలో దిగీదిగగానే మమ్మల్ని ఓ బ్రహ్మాండమైన లాడ్జికి తీకువెళ్ళారు. ఆ లాడ్జి పొడవు ఇరవై కిలోమీటర్లుంటుంది..."

ఆశ్చర్యంగా వింటున్నారంతా! సుందరికి మాత్రం తెలుగు సిన్మా డ్యూయెట్‌లో హీరోయిన్‌లాగ ఫీలింగ్ కలుగుతోంది.

"...ఇహపోతే వెడల్పు ఎంతలేదన్నా ఓ నలభై కిలోమీటర్లుంటుంది" కొనసాగించేడు సుబ్బారావు...

ఉలిక్కిపడింది సుందరి. ఇహ ఆగలేకపోయింది- సుబ్బారావు కాలు గట్టిగా తొక్కింది నడన్‌గా. ఆ వెంటనే ఆగిపోయి అరక్షణం ఆలోచించాడు సుబ్బారావు.

"ఆ మహాభవనం ఎత్తు... ఓ అరంగుళం ఉంటుంది..."

అంతే!! హాలు దద్దరిల్లిపోయింది.

– 'ఉమా' యమ్మార్వి





# చిట్కా

### మూడవ బహుమతి
### రు. 50/- పొందిన మినీ కథ

మాధవరావు అప్పుడే బస్టాండులోకి ప్రవేశించాడు. కుడి భుజానికి వేలాడుతోన్న సంచిలోనూ, రెండు చేతుల్లోవున్న ప్లాస్టిక్ బుట్టల్లోనూ నిండుగా సరుకుల్తో భారంగా అడుగులు వేస్తూ నడుస్తున్నాడు. తను వెళ్లాల్సిన బస్సు అప్పటికే స్టాండులో వుండటంతో సగం బరువు దించుకున్నట్టు అనిపించిందతనికి. బస్సులోకి ప్రవేశించాలనే ప్రయత్నంలో వుండగానే– "ఏరా మాధవా నిన్ను పల్లెటూరికి బదిలీ చేశారని విన్నాను నిజమేనా?" అంటూ పలుకరించాడు శంకర్ నవ్వుతూ.

చాలా కాలం తర్వాత కనబడ్డ మిత్రుణ్ణి చూసి మొహం వికసించింది మాధవరావుకి.- "అవునురా!... కులాసాయేనా... నీదే హాయిలే... టౌన్‌లో ఉద్యోగం– ఏ ఊరికీ ట్రాన్స్‌ఫర్ వుండదు" అన్నాడు.

"ఒకే ఊళ్లో వుండటం కూడా ఎంతబోరో నీకర్థం కాదులే... సరేకానీ, ఆ హెుస్నూరులో అప్పుడే ఫ్యామిలీ పెట్టేశావా?" అన్నాడు శంకర్ మాధవరావు చేతిలోని ప్లాస్టిక్ బుట్టల్ని చూస్తూ.

"లేదురా!" అన్నాడు మాధవరావు నిరుత్సాహంగా.

"మరి, ఈ సరుకులన్నీ...!!!" విస్మయంగా అడిగాడు శంకర్.

"వుండు, వస్తా..." అంటూనే బస్సెక్కి ఓ కార్నర్ సీటులో, సంచినీ, ప్లాస్టిక్ బుట్టల్ని సర్దేసి వచ్చేశాడు మాధవరావు.

ఆతర్వాత తన విషయాలన్నీ చెప్పడం మొదలుపెట్టాడు.

తనకు ట్రాన్స్‌ఫర్ అయిన ఊరు ఆ జిల్లాలో ఓ మారుమూల గ్రామం. తను పనిచేస్తోన్న హైస్కూల్లోని టీచర్లంతా ఆ ఊళ్లోనే కాపురం వుంటున్నారు. ఎప్పుడైనా తను టౌనుకు వెళ్తాను అంటే చాలు... ప్రతి టీచరూ తమ అవసరాలకు సరిపడా సరుకులు తెప్పించుకుంటారు. తను ఎంత రహస్యంగా బయల్దేరినా హైస్కూలంతా పాక్కిపోతుంది. ఒక్కో




టీచరు ఓ బారెడు లిస్టుని చేతిలో వుంచి ఎంచక్కా వెళ్లిపోతారు. ఒక్కోసారి బకెట్లు, బిందెలూ, చేటలూ, జల్లెడలూ కూడా ఆ లిస్టుల్లో చోటుచేసుకుంటాయి!"

మాధవరావు పరిస్థితికి జాలేసింది శంకర్‌కి. సహజంగానే మాధవరావు సున్నితమైన మనిషని శంకర్‌కి తెలుసు.

"పరోపకారార్థం ఇదం శరీరం కదా... మంచిపనేచేస్తున్నావోయ్!" అన్నాడు శంకర్ మరేమనలేక.

"నీకు అలాగే అనిపిస్తుందిలేవోయ్! అసలు కష్టం మరొకటుంది... పొరపాటున ఒక టీచరు ఇచ్చిన బారెడు లిస్టులోని ఏ ఒక్క వస్తువునైనా తీసుకుపోవడం మరిచానే అనుకో... ఇక ఆ టీచరుకి సంజాయిషి ఇచ్చుకోవడం కంటే ఘోరమైన శిక్ష మరొకటి వుండదు. ఒరే శంకర్! ఏదైనా మంచి చిట్కా చెప్పరా నీకు పుణ్యముంటుంది. నాకి బాధ తప్పించరా!" అంటూ శంకర్‌ని ప్రాధేయపడ్డాడు మాధవరావు.

"బస్సులో మీ హనుమ్నూరుకు వెళ్లాల్సిన ప్రయాణికులు ఎవరయినా వున్నారా?" ప్రశ్నించాడు శంకర్.

"ఊహూ: ఎవరూ లేరు"

"మరికనేం పదా హొటల్‌కి"

"బస్సు వెళ్లిపోతుందేమోరా!"

"నీమొహం మరో అరగంటకిగానీకదల్దులే ఇది. నాకు ఈ బస్సు ఏం కొత్తకాదు లే. అలాగా కాఫీతాగి వచ్చేయమూ!" అంటూ భుజంమీద చేతులువేసి హొటల్ వేపు లాక్కెళ్లాడు శంకర్.

హొటల్లో టిఫిన్లు తిని కాఫీ తాగినంత సేపూ న్కూలు విశేషాలు చెబుతునే వున్నాడు మాధవరావు.

కాఫీలు తాగేశాక– "ఏదీ చిట్కా చెప్పనే లేదు కదోయ్!" అన్నాడు మాధవరావు.

"చెబుతానుండవోయ్!" అనేసి సిగరెట్ అంటించుకుని మిత్రులిద్దరూ హొటల్ లోంచి బయటికి వచ్చేశారు. రెండడుగులు వేశాక మాధవరావు ఓసారి బస్టాండునంతా కలయచూసి గావుకేకపెట్టాడు" ఒరేయ్ శంకర్... బస్ వెళ్లిపోయిందిరా! ఎలా?"

"ఎందుకలా కేకలు పెడ్తావు?" అన్నాడు శంకర్ వినుగ్గా.

"కొంప ముంచావుకదరా... కాఫీ కాఫీ అంటూ నా ప్రాణాలు తీశావు. ఇపుడెలా బస్సెళ్లిపోయింది" అంటూ ఏడుపు మొహం పెట్టాడు మాధవరావు.

"నేను చెప్పదలుచుకున్న చిట్కా ఇదే" హాయిగా చేతులూపుకుంటూ వెళ్లి ఇప్పుడేం జరిగిందో అదే చెప్పేసెయ్ అక్కడి కెళ్లాక... అంతే మరోసారి నీకెవరయినా సరుకులు తెమ్మని చెబితే ఒట్టు" అన్నాడు శంకర్ చిద్విలాసంగా.

—చిలుకూరి దేవపుత్ర.

కవరుపేజీ ఫొటోగ్రాఫర్: సురేష్‌చంద్రబదావత్

# చతుర

సంపుటి: 10 అక్టోబర్ '87 సంచిక: 9

## ఈ నెల ప్రత్యేక నవల

భక్తులు 'దేవి' దర్శనం కోసం బారులుతీరి నిలబడి వున్నారు. తమ రోగాలను 'దేవి' కేవలం తన హస్తస్పర్శతోనో, విభూదితోనో మటుమాయం చేస్తుందని వారి ప్రగాఢ విశ్వాసం.

నడుం వంగిపోయిన ఓ మధ్యవయస్కుడు "తల్లీ... చిన్నప్పటినుండీ గూనితో బాధపడుతున్నాను. ఎవరూ ఈ రోగాన్ని కుదర్చలేకపోయారు. నువ్వే దిక్కు తల్లీ!" అంటూ 'దేవి' కాళ్ల మీద పడిపోయాడు.

దేవి అతన్ని దగ్గరగా పిలిచింది. అరచేతితో వెన్నుపూస మీద రాస్తూ "నెమ్మదిగా పైకి లేవండి" అంది. అంతే! అందరూ చూస్తుండగానే అతడు లేచి నిలబడి నిటారుగా నడవగలిగాడు!

ఎవరా దైవప్రతినిధిగా ప్రసిద్ధురాలైన దేవి? ఏ వైద్యులూ బాగుచెయ్యలేని రోగాలను కేవలం చేతి స్పర్శతోనో, విభూదితోనో ఎలా బాగుచేయగలుగుతోంది? 'దైవ ప్రతినిధులు' లోని యువ బృందం నమ్ముతున్నట్టుగా ఈ బాబాలు, దేవిలు, దేవుని ప్రతినిధులూ, కేవలం ప్రజల అమాయకత్వాన్ని, అజ్ఞానాన్ని ఆసరా చేసుకొని వారిని దోచుకుతింటున్న వారేనా?... లేక భక్తులు నమ్ముతున్నట్టుగా వారికి దైవదత్తమైన అద్భుత శక్తులున్నాయా?... అని చర్చించే యం.రమేష్ రచన 'దైవ ప్రతినిధులు' 'చతుర' నవలల పోటీలో ప్రత్యేక బహుమతి పొందిన నవల.

కాకినాడలో బి.టెక్ ఆఖరి సంవత్సరం చదువుతున్న శ్రీ యం.రమేష్ తొలి రచన 'దైవప్రతినిధులు.' అమాయకత్వంతో కొంత, అజ్ఞానంతో కొంత, బూటకపు బాబాలు, యోగుల మాయ లోపడిపోతున్న ప్రజల్లో మార్పు రావాలని మనసారా కోరుకొంటున్న ఈ యువరచయిత, తాను సాధించాల్సి వున్నది అనంతంగా, సాధించినది అల్పంగా వున్న ఈ దశలో తన ఫొటో ప్రచురించడం ఇష్టం లేదంటున్నారు.

కొరుమబ్బులు ఆకాశాన్ని కమ్ముకొని చీకటిని నలువైపులా వ్యాపింపచేస్తున్నాయి. పట్టుచీర కందని పదహారేళ్ళమ్మాయి నడుస్తోంది. ఆ పట్టుచీర ఆమెని బరువుగా చుట్టబెట్టుకొని ఉంది.

ఆమె కాటుక కళ్ళల్లో, అమాయకత్వంతో కూడిన భక్తి

నుదుట సింధూరం, చేతిలో పళ్ళెం, పక్కన నడిపిస్తున్న ముత్తైదువులు.

దేవునికి తనని తాను అర్పించుకుంటున్న కన్య ఆమె.

తలదించుకొని నడుస్తున్న ఆమె తాను అదృష్టవంతురాలిననే తలపోస్తోంది. చరిత్ర సృష్టించిన భక్తులజాబితాలోకి వెళ్ళబోతున్న తనఅదృష్టాన్ని తలచుకొని ఆనందిస్తోంది.

పదహారువేల ఎనిమిది మందిని పెళ్ళాడిన కృష్ణుడు అమాయకంగా వేణువు పట్టుకొని నిల్చొన్నాడు.

భక్తిపారవశ్యంతో నడుస్తున్న ఆమెలో తడబాటు.

ముత్తైదువలు ఆమెని గదిలో ఉంచి తలుపులేసిబయటనిలబడ్డారు.

భక్తి తలపులతో, బరువెక్కిన హృదయంతో ఒంటరిగా ఆమె.

బయట జనాలలో భక్తి ఏరులై ప్రవహిస్తోంది. "హరేరామ... హరేకృష్ణ" అంటూ భజనచేస్తున్నారు.

ఆమె కళ్ళు నెమ్మదిగా మూసుకోనారంభించాయి. పెదవులు శ్రీ కృష్ణుని నామస్మరణ చేస్తున్నాయి.

భక్తిలోపడి పరిసరాలని గమనించలేకపోయిందామె. ఆమె వచ్చిన ద్వారంకాక ఇంకో ద్వారం తెరుచుకొని ఇద్దరు వ్యక్తులు ఆగదిలోకి అడుగుపెట్టారు.

నెమ్మదిగా ఆమె దగ్గరగా వచ్చి నోరుమూసి పైకిలేపారు.

ఆమె కళ్ళనుంచి భక్తిదూరమై భయం ప్రవేశించింది. అరవడానికి ప్రయత్నించి విఫలమైంది. కాళ్ళుచేతులు కొట్టుకుంటు తన అనమ్మతిని తెలియజేయప్రయత్నించింది. ఆమె శరీరంలో ఏఒక్కభాగంకూడా కదలకుండా అతిజాగ్రత్తగా బిగించి పట్టుకొని వెళుతున్నారు వారు. వెళ్ళేముందు ఏదో కింధవ దేసి మరీ వెళ్ళారు. దానినుంచి పొగలు లేచి గదిని ఆక్రమించుకోనారంభించాయి.

అంతవరకు బయటధ్యానంలో మునిగివున్న దేవి కళ్ళు తెరిచింది. ఆమె ఆజ్ఞకోసమే వేచిచూస్తున్నారు భక్తులు.

"వెళ్ళండి... వెళ్ళి తలుపులు తెరవండి. దేవుడు ఆమెని తనలో ఐక్యంచేసుకున్నాడు" అంది దేవి.

భక్తులు పరిగెత్తుకెళ్ళి తలుపులు తెరిచారు. అంతవరకు ఆ గదిమాత్రమే ఏలుతున్న పొగ వాళ్ళమీదుగా ప్రవహించి మిగతా గదుల వైపు వ్యాపించసాగింది. ఆమె గదిలో కనిపించకపోవడంతో ఆశ్చర్యపోయారందరూ. ఆ పొగవాళ్ళని అదేరకమైన మత్తుకి గురిచేస్తోంది.

"హరేరామ... హరేకృష్ణ" ఎవరో అరిచారు. అంతే! ఒక్కసారిగా ఆ గది ఆ అరుపులతో నిండిపోయింది.

దేవునిలో ఐక్యంఅయిపోయిందనుకుంటున్న ఆ అమ్మాయి తల్లిదండ్రులు భక్తితో దేవిపాదాలదగ్గర కూర్చున్నారు. భక్తులలో వాళ్ళని ప్రత్యేక గౌరవంతో చూస్తున్నారు.

"దేవీ... అమ్మాయి దేవునిలో ఎలా ఐక్యం అయిపోతుంది?"

"శక్తిగా మారి దేవుని చేరుకుంటుంది. ఆ భగవానుడే కోరి ఆమెని తన అక్కునచేర్చుకున్నాడు"

ఈలోగా దేవిదగ్గరకి తిరిగి వచ్చారు ఆ గదిలోకి వెళ్ళినవాళ్ళు. దేవి పెదవులపై చిరునవ్వు. వాళ్ళందరు వచ్చి ఆమె ముందు నిలబడగానే దేవి ఉపన్యసించనారంభించింది. దేవుడే ఆమె నాలుకమీద ఉండి మాట్లాడుతున్నాడా అనిపిస్తోంది భక్తులకి.

"భక్తులారా... మీలో చాలామందికి దేవుడు ఆమెని తనలో ఎలా ఐక్యంచేసుకున్నాడనే అనుమానం కలుగుతున్నట్లు నాకనిపిస్తున్నది. దేవుడు ఆమె ఆత్మని తనలో ఐక్యంచేసుకుంటే

మరి ఆమె శరీరం? ఆమె లోపలకి వెళ్ళినదగ్గ ర్నుంచి జరిగిందంతా నా కళ్ళముందు మెదులుతోంది. ఆమె లోపలికి వెళ్ళిన మరుక్షణం కనులు మూసుకొని దేవుడినే మదిలో నిలుపుకొని దేవుని నామస్మరణే చేయనారంభించింది. ఆమె శరీరంలోని ఒక్కొక్క భాగమే శక్తిగా రూపాంతరం చెంది దేవుని హృదయంలో జ్వాలగా ప్రకాశించనారంభించింది. క్షణక్షణానికి ఆ జ్వాల ప్రకాశవంతం అవుతోంది. భక్తిపారవశ్యంలో మునిగిపోయిన ఆమె తనలోకలుగుతున్న మార్పులని గమనించలేకపోయింది. క్షణక్షణానికి ఆమె శరీరం క్షీణించి కృష్ణుని హృదయంలో జ్వాలగా మారి ప్రకాశవంతంగా వెలుగొందసాగింది. ఆమె శరీరం పూర్తిగా జ్వాలయైపోయింది. జ్వాల విడిచిన మహావాయువు ఆగదిని ఆక్రమించుకుంది. ఆ గదిలోకి ప్రవేశించిన మీ శరీరాలని స్పృశించి మత్తులోకి, దేవుని స్మరణలోకి మిమ్మల్ని నెట్టివేసింది ఆ పొగ. కృష్ణుని హృదయజ్వాలనుంచి వెలువడిన ఆ వాయుస్పర్శతో మీ శరీరాలు పవిత్రమైపోయాయి. మీజీవితం ధన్యమైపోయింది. భక్తిమార్గంలో ముక్తిని పొందాలన్న మీ కోరిక తీర్చాలన్నదే నాప్రయత్నం. మీరు చేసిన పాపాలను పటాపంచలు చేయాలన్నదే నాసంకల్పం. మీ అందరికోసమే నేను ఇలా బతికి ఉన్నాను. దేవుని ప్రతినిధిగా మీ అందరికీ సుఖసంతోషాలను పంచిపెట్టాలన్నదే నా తాపత్రయం. కృష్ణుడు ఈ ఆత్మని తనలో చేర్చుకునేవరకు మీ సేవచేసుకొని మిమ్మల్ని పాపవిముక్తుల్ని చేస్తాను. జై శ్రీకృష్ణభగవాన్... శ్రీకృష్ణభగవాన్ నమోనమః''

ఒక్కసారిగా ఆమెముందు సాష్టాంగపడ్డారందరూ. వాళ్ళందరినీ దీవించి తన గదిలోకి వెళ్ళిపోయింది దేవి.

భక్తజనులు ఆమె నామస్మరణే చేస్తూ, ఆమె గొప్పతనాన్ని స్తుతిస్తూ ఇంటిదారి పట్టారు.

ఆ మంచం అందంగా అలంకరించబడి వుంది. మంచంపైన మల్లెపూలు, మంచంచుట్టూ మల్లెదండలు, మంచంపక్కన పళ్ళెంలో పళ్ళు, పాలు, మిఠాయి.

మంచంపైన పడుకుని ఉన్నవ్యక్తి ఆత్రంగా తలుపు వైపు చూస్తున్నాడు. అది అతని అరవయ్యవ శోభనం. శ్రీకృష్ణుని గుడిలో విగ్రహప్రతిష్ఠాపన చేయడానికై వచ్చిన గొప్పవాడు ఆయన. పదవివున్నంతలోనే చేసుకోగలిగినన్ని శోభనాలు చేసుకోవాలని ఆయన కోరిక. తనతో శోభనం జరుపుకోబోయే అమ్మాయి కన్య అని నమ్మకస్తుల సర్టిఫికెట్ ఉంటేనే ఆయన శోభనం గదిలో అడుగుపెడతాడు. ఆయనతో పని జరిపించుకోవాలంటే కన్యతో సిద్ధంగా ఉంటేచాలు పని అయిపోయినట్టే. ఇపుడూ అంతే. ఆయనతో తమకి కావలసిన పని జరిపించేసుకున్నారు. సంతకాలు పెట్టించుకోగానే శోభనం గదిలోకి పంపేశారు.

రానున్న అమ్మాయికోసం తలుపులవైపు ఆసక్తిగా చూస్తున్నాడాయన.

అంతకు వారంరోజులక్రితమే ఈ వ్యవహారం సెటిలయింది.

అచ్యుతరామయ్యని పిలిపించింది దేవి ఒభక్తుని ద్వారా. దేవి పిలుస్తుందనగానే పరిగెత్తుకొని వచ్చారాయన. అచ్యుతరామయ్య కూడా ఆమె భక్తులలో ఒకరు. అందరిని పంపించేసి ఆయననొక్కరినే గదిలో ఉండమంది దేవి. కనులు మూసుకొని ధ్యానముద్రలోపడింది. ఆమె ఎదురుగా నమ్రంగా కూర్చొని ఉన్నాడు అచ్యుతరామయ్య.

పావుగంటవరకు కళ్ళు తెరవలేదు దేవి. ఆమె కళ్లు తెరవగానే రెండు చేతులని ముకుళించి తన భక్తిని తెలియచేశాడు.

''నువ్వు అదృష్టవంతుడివి అచ్యుతరామయ్యా, దేవుని కృప నీపై పడింది'' అంది దేవి.

''కృతజ్ఞుణ్ణి తల్లీ'' అన్నారాయన.

ఆ కృప ఎటువంటిదో అర్థంకాలేదాయనకి. దేవే చెపుతుందికదా అని మౌనం వహించారు.

''నీ కూతురి పేరు లలిత కదూ''

''అవును తల్లీ''

''నీకు కృష్ణుడిపై పూర్తి నమ్మకముందికదూ''

''ఉంది తల్లీ. ఆయనే నా సమస్యల్ని తీరుస్తాడని నమ్ముకునివున్నాను తల్లీ''

# రచయితలకు సూచనలు

ప్రచురించే ప్రతి నవలకు రు. 2000/- పారితోషికం అందజేస్తున్న 'చతుర'లో ప్రతిభావంతులైన రచయితలకు నెలనెలా నవలల పోటీయే. వైవిధ్యపూరిత ఇతివృత్తాలతో, ఆసక్తికర రచనా సంవిధానంతో పాఠకులను ఆకట్టుకోగల నవలలకు వేదిక 'చతుర'.



- ★ "చతుర'లో నవలకు వేసే చిత్రాలు, చతుర కథలు, చతుర ప్రపంచ్ఛం వంటి శీర్షికలుకాక కేవలం నవల మాత్రమే అచ్చులో 100 పేజీలు ఉంటుంది. "చతుర"లో అచ్చులో ఒక పేజీలో సుమారుగా 300 పదాలు వస్తున్నాయి. నవలనుబట్టి పేజీల సంఖ్య పెంచటంగాని, తగ్గించటంగాని ఉండదుగనుక నవలలన్నీ సరిగా ఈ సైజుకు సరిపడేలా, మొత్తంమీద 30 వేల పదాలకు తక్కువగాకుండా ఉండాలి. వ్రాతపతిలో హిరి వారి దస్తూరినిబట్టి,ఒక పేజీకి ఎన్ని పదాలు వస్తున్నాయనేదానినిబట్టి మొత్తం నవల పేజీలకు ప్లాన్‌వేసుకోవటం అవసరం.
- ★ ఈ ప్రకారం "చతుర" కొరకై ప్రత్యేకంగా రాసిన నవలలు మాత్రమే పరిశీలనార్హాలవుతాయి.
- ★ నవలను ప్రచురించే సమయంలో అవసరాన్ని బట్టి కొంత కుదించవలసి వచ్చేపక్షంలో, అందుకు అభ్యంతరంలేనివారే తమ నవలలను పంపించాలి.
- ★ ప్రచురణకై ఎన్నికగాని నవలలు తిప్పి పంపేందుకై నవలతోపాటే తగుపోస్టేజీని జతపరచాలి. వ్రాత ప్రతులు పోస్టులోగానీ, ఇతరత్రాగాని పోయిన సందర్భాల్లో మా బాధ్యత ఉండదు.
- ★ సాధారణంగా నవలలు మాకు అందిన 4 వారాలలోగా ప్రచురణార్హంగా భావిస్తే ఆ విషయం తెలియపర్చటమో, లేనిపక్షంలో తిప్పి పంపటమో జరుగుతుంది.
- ★ పారితోషికం ఏ నెలలో ప్రచురిస్తే ఆ నెల మొదటివారంలోనే పంపబడుతుంది.

ఎడిటర్

**చతుర**

'ఈనాడు' కాంపౌండ్, హైదరాబాద్-500 482.

"వచ్చేవారం శ్రీకృష్ణుని గుడి తెరుస్తున్నాం తెలుసుకదా"

"తెలుసు తల్లీ"

"దేవునికి నైవేద్యం పెట్టాలి అచ్యుతరామయ్యా"

"ఆహా" అన్నాడు, ఈ నైవేద్య భారం ఎక్కడ తనమీద పడుతుందోనని భయపడుతూ. ఇంట్లో ఇప్పటికే డబ్బు సమస్యగా వుంది తనకి నైవేద్యంపని అప్పగిస్తే...

ఉసూరుమని నిట్టూర్చాడు, దేవుడికి నైవేద్యం పెట్టలేని బతుకయిపోయిందే అన్న భావంతో.

"నీకు తెలుసుకదా ప్రతిరోజూ రాత్రి దేవునితో నేను మాట్లాడతాను. నిన్న రాత్రి కూడా మాట్లాడాను"

ఆయన మొహంలోని భావాలని గమనించడానికి ఆగింది దేవి.

ఆయన మౌనంగా వింటున్నారు. ఆ భారం తనదేనేమోనని పిస్తున్నదాయనకు.

"దేవుడు తన నైవేద్య భారం నీమీద పెట్టాడు" అని ఆగింది దేవి.

ఊహించిందే కావడంతో మొహంలో తేడా ఏమీ కనిపించలేదు.

"ఏమిటి మాట్లాడటంలేదు. నీకిష్టంలేదా" అంది దేవి.

"ఎంతమాట తల్లీ, దేవుడు స్వయంగా నాపేరు సూచించాడంటే నా జన్మ ధన్యమైపోయినట్లే"

"నువ్విప్పుడు చాలా కష్టాలలో వున్నావని కూడా చెప్పాడు దేవుడు. మరి ఈ భారం అతనిమీద వేయడం ఎలా? అని అడిగాను"

దేవుడు తనగురించి, తన కుటుంబ పరిస్థితి గురించి దేవితో మాట్లాడటం ఆయనకి చాలా వింతగా వుంది. తనలో అంత భక్తి వుందా? తనకు అంత విలువ వుందా?

"అచ్యుతరామయ్య - నాకివ్వాల్సిన నైవేద్యం నాకు ప్రియమైనది మాత్రమే కాదు ఆయనకి భారం కానిదికూడా అన్నాడు, దేవుడు"

"నాకు భారం కానిదా ఏమిటి తల్లీ అది?"

"నీ కూతురు గొప్ప కృష్ణభక్తురాలా"

"ఎందుకు తల్లీ అలా అడుగుతున్నారు"

"నువ్వివ్వాల్సిన నైవేద్యం ఆమే"

"తల్లీ" ఆయన కళ్లల్లో ఆశ్చర్యం. "ఏమిటి మీరంటున్నది"

"నీ కూతురు శ్రీకృష్ణుని భక్తురాలు, మీరా అంతటి గొప్పది. ఆయననే దైవంగా, సమస్త ప్రపంచంగా భావిస్తూ బతుకుతోంది. ఎన్ని బాధలనైనా ఓర్పుతో సహిస్తూంది. ఏరోజూ ఆయనని స్మరించకుండా ఏపనీ చేయదాపిల్ల. ఇంత చిన్నవయసులోనే కృష్ణ సాయుజ్యం పొందుతోందంటే ఎంత గొప్ప భక్తురాలో నువ్వే ఊహించుకో. పదిహేను సంవత్సరాలనుంచి ఆయన సేవలోనే జీవితం గడుపుతున్న నాకే ఇంతవరకూ ప్రాప్తించని మహదవకాశం ఆమెని వరించింది. ఆయనే తనంతట తానుగా నిర్ణయించుకున్న వ్యక్తి నీ కూతురు. నీ కూతురుని తనలో ఐక్యం చేసుకోవాలనుకుంటున్నాడు శ్రీకృష్ణుడు. ఆ పవిత్ర కార్యాన్ని నాచేతులమీదుగా జరిపించమన్నాడు. నీ కష్టాలన్నీ ఈదెబ్బతో పటాపంచలైపోతాయి" అంది దేవి.

"ఏమిటి తల్లీ మీరంటున్నది? నాకేం అర్థంకావడంలేదు" అన్నారాయన.

"నీ కూతురిని దేవునికి అర్పించడానికి నీకేమైనా అభ్యంతరముందా"

"అర్పించడం అంటే? అది ఎలా సాధ్యం తల్లీ?"

"ఎలా సాధ్యమో మనకనవసరం. ఆయన కావాలనుకున్నాడు. అసాధ్యమైనా సాధ్యమయ్యేలా ఆయనే చేసుకుంటాడు. మానవమాత్రులం... ఆయన లీలలు మనకేం తెలుస్తాయి. ప్రేక్షకుల్లా చూడటమే"

"అదికాదు తల్లీ..."

"ఇప్పుడే నీ నిర్ణయం చెప్పనక్కరలేదు అచ్యుతరామయ్యా, మీ ఇంట్లో అందరితో చర్చించి అప్పుడే చెప్పు. దేవుడు కోరుకున్న కార్యం దేవుడే పూర్తిచేసుకుంటాడు. నావంతు కర్తవ్యాన్ని నేను పూర్తిచేశాను"

"అర్పించుకోవడం అంటే చనిపోవడమా

తల్లీ''

ఆయనవైపోసారి వింతగా చూసింది దేవి "ఈ తుచ్ఛమైన శరీరంపై కోరికతో అశాశ్వతమైన భవబంధాలు తెంచుకోలేక అలా అడుగుతున్నావ్'' అంది జాలిగా.

"ఎంతైనా రక్తం పంచుకుపుట్టిన బిడ్డగదా''

"మనమంతా ఆ దేవుని రక్తం పంచుకు పుట్టినవాళ్లమే. ఆయనని చేరుకోవలసినవాళ్లమే. కాస్త ముందు, వెనుక. ఎంతో తపస్సుచేసిన ఋషులు సైతం పొందలేనిది ముక్తి. కృష్ణ సాయుజ్యం''

ఆయన అక్కడే అలాగే నిలుచుండిపోయారు. అనేక అనుమానాలు ఆయన మనస్సుని తొలచివేస్తున్నాయి.

"వెళ్ళిరా. నీ మనస్సుని, ఈ ప్రజలని, ఈ దేశాన్ని ఈ ప్రపంచాన్ని సృష్టించింది పరిపాలిస్తున్నది ఆయనే. ఆయన చెప్పినట్టు వింటుంది నీ మనసు. ఆయన తనకి కావలసిన నిర్ణయాన్ని నీ నోటివెంట వినిపిస్తాడు. వెళ్ళిరా అచ్యుతరామయ్యా! నువ్వు నిమిత్తమాత్రుడివి. జరిపించేది ఆయనే. జరిగేవి అన్నీ ఆయనకిష్టమే. కష్టపెట్టినా, సుఖపెట్టినా ఆయనే'' అంది దేవి. అన్నవెంటనే కళ్ళు మూసుకుని ధ్యానంలోకి వెళ్ళిపోయింది.

ఏవో అడుగుదామనుకున్న ఆయన ఏమీ అడగలేక అక్కడినుంచి బయటికి వచ్చేయబోయారు.

"ఆగు అచ్యుతరామయ్యా... నీ నిర్ణయం తెలిపేంతవరకూ నువ్వెవరికి చెప్పకూడదీ విషయం! వెళ్ళిరా'' అంది దేవి కళ్ళు మూసుకునే.

ఆయన అక్కడి నుంచి నరాసరి ఇంటికి వచ్చారు. ఇల్లు చాలా ప్రశాంతంగా వుండటంచూసి ఆశ్చర్యపోయారు ఆయన. ఎప్పుడూ ఏవేవో గొడవలతో హెూరెత్తే ఇంటిలో ఎదురయిన ప్రశాంతతకు ఆశ్చర్యపోయారు. దేవి చెప్పిన మాటలు గుర్తొచ్చాయి. అంతా ఆ కృష్ణలీల అనుకున్నాడు. తనకి మంచిరోజులు ప్రారంభమయ్యాయనిపించింది.

లోపలకి వెళ్లారు. భార్య ,కూతురు, కోడలు దగ్గరదగ్గరగా కూర్చొని మాట్లాడుకుంటున్నారు. అది ఆయనని మరింత ఆశ్చర్యపరిచింది.

"రండి రండి మీకో శుభవార్త. నువ్వు పంచదార తీసుకురావే'' అంది భార్య.

"ఏమిటే ఏమిటా శుభవార్త'' ఆయనకి తనకి మంచిరోజులు నిజంగానే వచ్చాయనిపించింది మళ్ళీ. 'అంతా కృష్ణలీల' అనుకున్నాడు.

లలిత పంచదార తీసుకొచ్చింది. అది ఆయన నోటిలోపోసి "కోడలుపిల్ల గర్భవతి అండీ మీరు తాత కాబోతున్నారు'' అంది.

ఆయన చాలా ఆనందించారు. ఆ సంఘటనతో దేవునిపట్ల నమ్మకం మరింత బలపడింది.

"రజని ఇంకా రాలేదా''

"రాలేదండీ'' ఆవిడ అంటూండగానే వచ్చేశాడు రజని.

"నాన్నా శుభవార్త'' ఆనందంగా అన్నాడు లోపలికి రాగానే.

"ఏంటిరా''

కృష్ణుడు ఆయన కళ్లముందే మెదులుతున్నాడు. తన కష్టాలు గట్టెక్కిపోయాయన్నమాటే.

"నాకు ఆర్.కె. ఇండస్ట్రీస్‌లో జాబ్ వచ్చింది నాన్నా''

"ఉద్యోగమా'' తల్లి, తండ్రి, చెల్లి, భార్య అందరూ ఒకేసారి అన్నారు.

"అవును నాన్నా... నా స్నేహితుడు ఆర్.కె.గారి దగ్గరకి తీసుకువెళ్లాడు. ఆయన నా పరిస్థితి అర్థంచేసుకొని తన ఇండస్ట్రీలో ఉద్యోగం ఇచ్చారు''

"ఈరోజు చాలా మంచిరోజురా మనకి. శుభవార్తలు ఒకదానిమీద ఒకటి వచ్చిపడుతున్నాయ్''

"ఇంకేంటి నాన్నా శుభవార్తలు అంటున్నారు''

"నీ భార్యని అడగరా ఆ శుభవార్త ఏంటో'' అంది తల్లి.

భార్యవైపు చూశాడు రజని. సిగ్గుతో తన గదిలోకి వెళ్ళిపోయింది ఆమె.

"ఏంటమ్మా''

"వెళ్ళి అడగరా" అంది తల్లి.

గదిలోకి వెళ్ళాడు రజని.

ఆ రెండో శుభవార్త అచ్యుతరామయ్య నిర్ణయానికి బలాన్నిచ్చింది.

★ ★ ★

ఆ రాత్రి.... చాలా ఆనందంగావుంది లలితకి.

అన్నయ్యకి ఉద్యోగం రావడం ఆమెకి చాలా సంతోషాన్ని కలిగించింది. అన్నయ్యకి ఉద్యోగం రావాలని ఆమె దేవుడికి మొక్కుకోని రోజు లేదు. ప్రతి [illegible]గం దేవుని గుడిచుట్టూ నూట పదహారుసార్లు ప్రదక్షిణ చేస్తుంది.

తల్లి, వదిన పోట్లాడుకున్న ప్రతిరోజూ ఆమెలో వైరాగ్యం ప్రవేశించేది. ఛీ... ఈ బతుకు బతకడంకంటే చనిపోవడమే మంచిదనుకునేది. మళ్ళీ అంతలోనే తను చనిపోతే మాత్రం ఈ సమస్య పరిష్కారం అవుతుందా అని ఆలోచించేది. ఆ సమస్య పరిష్కారానికి తన సర్వస్వం ఇవ్వడానికి కూడా సిద్ధంగా వుంది.

ఇది తన కోరిక తీరినరోజు. పూజలు ఫలించినరోజు. ఆనందం ఆమె కళ్ళని మూత పడనివ్వడంలేదు. అందమైన రేపటిజీవితం కళ్ళముందు మెదులుతోంది. ఆ కళ్ళముందు మెదులుతున్న జీవితంలో తల్లి-- వదిన సఖ్యంగా, ఒకళ్ళకొకళ్ళు ప్రాణంగా మెలుగుతున్నారు. ఆర్థిక పరిస్థితి చాలా బాగుంది. 'అమ్మా పుస్తకం కొనుక్కోవాలి, డబ్బు లివ్వు' అని తనిహ బాధగా అడగనక్కర్లేదు.

దాహంగా అనిపించి మంచినీళ్ళకోసం మంచందిగి వంట గదివైపు వెళ్ళింది. కూజా లోనుంచి మంచినీళ్ళు తీసుకుని తాగుతుండగా పక్కగది నుంచి తల్లిదండ్రుల మాటలు వినబడ్డాయి.

"దేవాలయం వచ్చేవారం తెరుస్తున్నారా?" తల్లి అడుగుతోంది.

"అవును... ఆరోజు దేవుడికి నైవేద్యం మనమే పెట్టాలి." శ్రీకృష్ణుడు దేవి కలలో కనబడి నైవేద్యం మనచేత పెట్టించమని చెప్పాడట"

"నిజమా!" ఆవిడ ఎంత ఆశ్చర్యపోయిందో కూడా వినిపిస్తోంది.

"అంతేకాదు మన పరిస్థితి గురించి, మన కష్టాల గురించి కూడా చెప్పాడట దేవుడు. మన ఆర్థికపరిస్థితి మెరుగవుతుందని, కష్టాలన్నీ తీరిపోతాయనీ కూడా చెప్పాడట దేవుడు"

"ఎన్నాళ్ళకి దేవుడికి మనమీద దయ కలిగిందండీ... ఎంత అదృష్టవంతులమో"

"ఆయనకి ఎన్ని కోట్లమంది భక్తులో! వాళ్ళందరిని వదిలేసి మనల్ని నైవేద్యం పెట్టమన్నాడంటే మనం ఎంత అదృష్టవంతులమో"

"అవునండీ"

చూశావా... "దేవి పిలిస్తే అలావెళ్ళి ఆ విషయం తెలుసుకొచ్చానో లేదో ఎని[illegible]లు! మనక [illegible] అన్నాడు. వాడి పుట్టుకభారం కాకుండా అబ్బాయికి వున్న వూళ్ళోనే వుద్యోగం వచ్చేలా చేశాడు దేవుడు"

"దేవుడంటే ఏమనుకున్నారు మరి"

"మనమ్మాయి లలిత కూడా చాలా అదృష్టవంతురాలు" అన్నారాయన.

వంట గదిదాటి వెళ్ళబోతున్న లలిత ఆ మాటలు వినడంతో ఆగిపోయింది.

"ఏంటండీ?"

"అది కృష్ణభక్తురాలు... మీరా అంతటి గొప్పది"

"మీరా ఎవరండి?"

"గొప్ప భక్తురాలు. కృష్ణుడినే దైవంగా, ప్రపంచంగా, తన సర్వస్వంగా భావించి బతికిన గొప్ప భక్తురాలు. మనమ్మాయి కూడా అంతటిదే"

"మనమ్మాయా"

"అవును... ఎన్నో ఏళ్ళు తపస్సుచేసిన ఋషులకి సాధ్యంకాని కృష్ణ సాయుజ్యం, మనమ్మాయికి సాధ్యంకాబోతోంది"

"ఏమిటీ?"

"పదిహేను సంవత్సరాలనుంచి కృష్ణుడే సర్వస్వంగా భావిస్తూ మానవసేవ చేస్తున్న దేవికి కూడా రాని ఛాన్సు మనమ్మాయికి వచ్చింది"

"ఏంటండీ మీరంటున్నది?"

"మనం నైవేద్యంగా పెట్టాల్సింది ఏమిటో తెలుసా?"

"ఏమిటీ?"

"మనమ్మాయిని శ్రీకృష్ణునికి అర్పించడమే"

"అర్పించడమా?"

"అవునే పిచ్చి మొహమా! అది దేవుడి కోసమే పుట్టింది, ఆయనకే అర్పించబడుతుంది"

"మీరేం మాట్లాడుతున్నారో అసలు నాకు అర్థంకావడంలేదు. కాస్త అర్థం అయ్యేలా చెప్పండి"

"అర్థం కాకపోవడానికేముందే. దేవాలయం తెరిచేరోజున దేవుడికి అమ్మాయిని నైవేద్యంగా అర్పిస్తాం"

"అంటే ఇంక అది అక్కడే దేవుడి దగ్గరే వుండిపోతుందా?"

"ఏం జరిగినా మనకనవసరం. దాన్ని దేవుడికి అర్పించేస్తాం... ఇంక దేవుడిదే దాని భారం"

"అర్పిస్తే అదేమవుతుందండి"

"ఏదో ఒకటి అవుతుంది. మనం దేవిని, దేవుడిని ప్రశ్నించేంతటి వాళ్ళమా?"

"మనం ఎంతటివాళ్ళమైనా అమ్మాయిని అలా అర్పించడం నాకిష్టంలేదు"

"ఎందుకు ఇష్టంలేదు" తన నిర్ణయం తనకే బాధగావున్నా భక్తి దాన్ని మరిపిస్తోంది. అందులోనూ దాని ఫలితాన్ని ఇప్పటికే చవిచూసిన ఆయన తన నిర్ణయాన్ని మార్చుకోదలచలేదు.

"అమ్మాయికి పెళ్ళిచేసి అత్తవారింటికి పంపుతాననక ఇదేంటండీ..."

"మామూలు అమ్మాయయితే అలాగే పంపేవాళ్ళం. దేవుడికోసం పుట్టింది ఇది"

"ఏమోనండీ, నాకిష్టంలేదు"

"నీకిష్టం లేకపోతే ఇప్పుడు కలిగిన ఆనందాలన్నీ వెనక్కివెళ్ళిపోతాయి. దేవుడిని కాదన్నందుకు ఇంతకుముందంత ప్రశాంతంగా కూడా బతకలేము"

ఆవిడ మాట్లాడకుండా అటువైపు తిరిగిపోయింది. ఆవిడకి ఆయన నిర్ణయం సమంజసంగా అనిపించడంలేదు. కూతురు ఏమయిపోతుందోనని బాధకలగడంతో మాట్లాడకుండా వుండిపోయింది.

ఆయన ఆవిడని ఒప్పించడానికి ప్రయత్నించారు కాని ఆమె మాట్లాడకుండా వుండిపోయింది. ఆయనకి ఇంట్లోవాళ్ళ ఇష్టంలేకుండా తన నిర్ణయాన్ని అమలుపరచడం అలవాటులేదు.

వాళ్ళ మాటలువిన్న లలిత మౌనంగా అక్కడినుంచి తన గదివైపు వెళ్ళింది. మంచంమీద పడుకొని తండ్రి చెబుతున్నదే ఆలోచిస్తున్నది.

"ఇది సాధ్యమా!" అనేది మొట్టమొదట ఆమె మదిలో మెదిలిన ప్రశ్న.

అసాధ్యం అనే అనిపించింది. కానీ ఆలోచిస్తున్నకొద్దీ ఆ మాటలను పదేపదే తలచుకుంటున్నకొద్దీ తండ్రి చెప్పిందీ, జరిగినవి గుర్తుతెచ్చుకుంటున్న కొద్దీ "ఎందుకు సాధ్యంకాదు?" అనిపించడం మొదలయింది.

తాను పెళ్ళిచేసుకోకూడదని ఎప్పుడో నిర్ణయించుకుంది. పరిపక్వం చెందని మనసు కలిగిన ప్రతి అమ్మాయి అలాగే ఆలోచిస్తుందని ఆమెకి తెలీదు.

తనకి దేవునిమీద భక్తి ఎక్కువ అనిపిస్తోంది. ఆమెకి అంతకుముందు జరిగిన కొన్ని సంఘటనలని దానికి వుదాహరణగా తీసుకొని ఆ భావాన్ని మరింత బలపరుచుకొంది.

తను దేవుని కొరకే పుట్టింది. అందుకే తనకి ఈ తుచ్ఛశరీరంపై ఏనాడూ కోరికలేదు. తనకి దేనిమీదా ఇచ్ఛలేదు. పెళ్ళి చేసుకోకూడదనుకున్నది అందుకేనేమో?

నిజంగా తనెంత అదృష్టవంతురాలు.

ఎవరు ఒప్పుకున్నా, ఒప్పుకోకపోయినా తను దేవునికి అర్పించబడింది. తన సర్వస్వం దేవుడే.

తల్లిని ఒప్పుకునేలా చేయడానికి ఓ వుపాయం కూడా తట్టింది.

ఆ తలపులతో రాత్రికెప్పటికో నిద్రపట్టిందా

మెకు.

పొద్దున లేవగానే తల దగ్గరున్న కృష్ణుని పటానికి నమస్కరించి లేచింది. స్నానంచేసి దేవుడి గదిలోకి వెళ్ళింది. తల్లి ఎంత పిలుస్తున్నా పలకకుండా రెండు చేతులను జోడించి దేవుని పటాలముందు అలా కూర్చుని అదోరకమైన అనుభూతికి లోనైపోయింది. ఇది అని చెప్పలేని వింత అనుభూతి. అంతవరకు అనుభవానికి రాని కొత్త అనుభూతి. ఆమె మాటలలో దివ్యానుభూతి.

తల్లివచ్చి "ఏంటే... అంతసేపు అలా వుండిపోయావు. లే... ఇంకా చాలా పనులున్నాయి" అంది.

అప్పుడే పొందిన అనుభూతిలోంచి లేవాలనిపించడంలేదు. అయినా తప్పనిసరై లేచింది.

అందరు కలిసి టిఫిన్ తింటున్నారు. తల్లి ఎవరికి ఏంకావాలో చూస్తోంది.

"అమ్మా... రాత్రి కృష్ణుడు కలలో కనిపించాడే" అంది లలిత.

ఇడ్లీ తుంచుకొని నోట్లో పెట్టుకోబోతున్న అచ్యుతరామయ్యగారు ఆగిపోయారు. కొడుక్కి నెయ్యి వేస్తున్న ఆవిడ కూడా వేయడం ఆపేశారు. మిగతా ఇద్దరికి ఆ మాటలు అర్థంకాలేదు. అచ్యుతరామయ్యగారు, ఆవిడ మాత్రం ఒకేసారి "ఏంటమ్మా?" అన్నారు.

"రాత్రి కృష్ణుడు కలలో కనిపించాడు" అంది లలిత మళ్ళీ.

"మీ క్లాసులో కృష్ణుడు అని ఎవరూ లేరుకదే" పరిహాసం ఆడాడు రజని.

"నోర్మూయ్‌రా... కళ్ళుపోతాయ్" అంది తల్లి.

చాలా సీరియస్‌గా ఆవిడ అనడంతో నోర్మూసుకొని వూరుకొన్నాడు రజని.

"ఏమన్నాడే?" అడిగారావిడ.

"ఏమన్నాడో అర్థం కాలేదుకాని రెండు చేతులుచాచి రమ్మన్నట్టుగా పిలిచాడు. అలా చాలాసార్లు అనిపించిందే" అంది లలిత.

అచ్యుతరామయ్యగారు భార్యవైపు చూశారు. ఆవిడ అయోమయంగా ఆయన వైపు చూసింది. ఇంట్లో అందరికీ చెప్పాల్సిన సమయం వచ్చిందని అర్థమైంది ఆయనకి.

దేవి తనతో చెప్పిన విషయం, రాత్రి తనకి, భార్యకి మధ్య జరిగిన సంభాషణ చెప్పారు. విషయం తెలిసిన ఇద్దరు మౌనంగా విన్నారు. మిగతా ఇద్దరు ఆశ్చర్యంగా విన్నారు. అంతా చెప్పాక కొడుకుతో– "ఏంచెయ్యాలో నాకేం అర్థం కావడం లేదురా" అన్నారు.

రజనికి కూడా ఏం చెప్పాలో తెలీలేదు. అతను మౌనంగా వుండిపోయాడు. లలితవైపు చూసి – "ఏమంటావమ్మా" అన్నారు.

"మీరు చెప్పిందంతా విన్న తరువాత మీ నిర్ణయమే మంచిదనిపిస్తోంది. నాకెప్పటినుంచో కృష్ణుడు కలలో కనబడుతున్నాడు" అని వెళ్ళిపోయింది లలిత.

నువ్వేమంటావమ్మ అన్నట్టు కోడలివైపు చూసారు.

"నేనేం చెప్పగలనండీ. పెద్దవారు మీ ఇష్టం. ఇదే అదృష్టం నాకు దక్కితే వదులుకోను" అంది.

భార్యవైపు చూసారాయన. ఆవిడకి ఏమనాలో తెలియడం లేదు. ఒక వైపు దేవుడు, ఇంకోవైపు కూతురు.

ఏ నిర్ణయం తీసుకోలేక "మీఇష్టం" అన్నారావిడ.

"అయితే నేనీరోజే తల్లిదగ్గరకెళుతున్నాను" అన్నారు.

"మీరు వెళ్ళేటప్పుడు నాకు చెప్పండి... నేను వస్తాను" అన్నాడు రజని.

"అలాగే. సాయంత్రం ఇంటికొచ్చి వెళతాను. నువ్వు రడీగా వుండు. ఎక్కడికి వెళుతున్నావ్"

"ఈరోజు వచ్చి జాయిన్ అవమన్నారు"

"వెళ్ళిరా"

టిఫిన్ చేసాక "వెళ్ళొస్తాను నాన్న" అని తండ్రికి, "వెళ్ళొస్తానమ్మా" అని తల్లికి కళ్ళతోటే భార్యకి చెప్పి వెళ్ళిపోయాడు రజని.

★ ★ ★

దేవి దగ్గరికి రజనిని తీసుకొని వెళ్ళారు అచ్యుతరామయ్యగారు.

ఆయన వెళ్ళేసరికి ఆవిడ ధ్యానంలో ఉంది. పగలంతా ఆవిడ ధ్యానంలోనే వుంటుంది. రాత్రి దేవుడితో మాట్లాడుతుంది. ఎప్పుడో అవసరమైతే తప్పించి కళ్ళు తెరవదు. ధ్యానం విడవదు. భక్తులు ఆవిడని మౌనంగా దర్శించుకొని వెళ్ళిపోతారు.

సోమవారం మాత్రం ఎవరైనా దర్శించుకోవచ్చు. తమ బాధలు చెప్పుకొని స్వాంతన పొందవచ్చు. ఆవిడ ఇచ్చే విభూదితో తమ బాధలని తీర్చుకోవచ్చు.

దేవి మీది నమ్మకమే సగం రోగాన్ని తగ్గిస్తుంది.

రజని తండ్రితో ఆవిడ పాదాలదగ్గర కూర్చున్నాడు.

దేవికళ్ళు తెరిచింది. "వచ్చావా అచ్యుతరామయ్యా ఇతను నీకొడుకు కదూ" అనడిగింది.

"అవునుతల్లీ" అని రజనిని పొడిచి రెండు చేతులెత్తి నమస్కరించాడు. రజనికూడా చేతులెత్తి నమస్కరించాడు.

"దీర్ఘాయుష్మాన్ భవ" అని దీవించి మళ్ళీ కళ్ళు మూసుకుంది దేవి.

ఎలా మొదలుపెట్టాలో తెలియక మౌనంగా ఉండిపోయారు అచ్యుతరామయ్యగారు.

కొద్దిసేపటికి కళ్ళు తెరిచి -- "నీ కొడుక్కి ఉద్యోగం దొరికింది కదా" అంది దేవి.

"అవును తల్లీ... మీకెలా తెలిసింది"

"మూర్ఖుడా నేను ధ్యానంలోకి వెళ్ళేది ఎందుకనుకున్నావు? భూత వర్తమాన భవిష్యత్ కాలాలలో జరిగే వాటి గురించి కృష్ణుడు స్వయంగా నాతో చర్చిస్తాడు. నీకొడుక్కి ఉద్యోగం రావడానికి కారణం ఆ దేవుడే. రామదాసుని రక్షించడానికి సుల్తాన్‌కి కలలో కనిపించి చెప్పినట్టు ఆ కృష్ణుడు నీ ఆర్థిక పరిస్థితి బాగుపరచడానికే స్వయంగా ఆ కంపెనీ యజమానికలలో కనిపించి చెప్పాడు. దేవుడు తన భక్తులని ఎప్పుడు కష్టాలకు లోనుకానివ్వడు"

"క్షమించు తల్లీ. అపరాధం చేసాను" అన్నాడు అచ్యుతరామయ్య.

"ఎందుకొచ్చావ్"

రాత్రి అమ్మాయికి కలలో కృష్ణుడు కనబడి రెండు చేతులు చాచి తనదగ్గరకి రమ్మన్నట్టు పిలిచాడట తల్లీ"

"దేవుడు తనకి కావలసినవి తానే తెప్పించుకుంటాడు. ఆయన జరపాలనుకున్నది జరుపుకుంటాడు"

"నా కోడలు గర్భవతి తల్లీ"

"నీకింక మంచిరోజులొచ్చాయి. హాయిగా జీవించు దేవుని కృపనీపై ఉంది"

"అమ్మాయి విషయం..." అని ఆపేసాడు.

"నేను చెప్పాల్సింది చెప్పాను. నిర్ణయించుకోవాల్సింది నువ్వు. నిర్ణయించేది ఆయన" అని పైకిచూపెట్టింది దేవి.

"అర్పించడం అంటే ఆయన సేవకి నియమించడమా?" అడిగాడు రజని.

"నాకు తెలీదు నాయనా దేవుడే చెపుతాడు సమయం వచ్చినపుడు. నాకు ఆయన తెలిపింది నేను మీకు చెప్పాను. మీరింతకీ ఏం నిర్ణయించుకున్నారు"

"అమ్మాయి కూడా ఒప్పుకొంది తల్లీ"

"ఆమెకిష్టం లేకపోతే కృష్ణుడెలా కోరుకుంటాడు. ఆమె కృష్ణుడిని అమితంగా కోరుకుంటుంది కాబట్టే ఆమె అంతట ఆమె తనని ఆయనకి అర్పించుకోవాలనుకుంటున్నది. ఆయనలో ఐక్యం అయిపోవాలని ఎంత ప్రయత్నిస్తున్నా నాకు విముక్తి ప్రసాదించని ఆయన నీకూతురినే కోరుకున్నాడూ అంటే ఆమె నిజంగా చాలా అదృష్టవంతురాలు"

"మేము ఏం చెయ్యాలో చెపితే..." అన్నారాయన.

"ఇంకా ఏమి ఆజ్ఞ రాలేదు. వచ్చిన వెంటనే కబురు చేస్తాను" అంది ఆమె. అలాగే తల్లీ మేము వెళతాం"

"మంచిది" అంది దేవి.

రెండురోజుల తరువాత ఏంచెయ్యాలో చెప్పింది.

ఆరోజు వచ్చింది. దేవి చెప్పిన ప్రకారం అన్నీ జరుగుతున్నాయి. లలితని అందంగా పెళ్లికూతుర్లా తయారుచేసారు.

దేవి గదికి కొద్దిగా ముందుకెళి తే భూగృహ





విశిష్ట సుగంధం
మైమరపించే తాజాదనం

క్రొత్త
ప్రేమ్
మీకోసమే




ఇప్పుడు అనువైన ఆకారంలో క్రొత్త పరిమళంతో వస్తోంది

Imageads 2418 Tel

నికి దారి ఉందని చాలా కొద్దిమందికే తెలుసు. అందులో శ్రీకృష్ణుని పెద్ద విగ్రహం వుంది. ఆ విషయం తెలిసిన ఆ కొద్ది మందీ దేవి ముందుకూర్చున్నారు. వాళ్లందరికీ ఆ విషయం చెప్పింది దేవి. దేవి చెప్పిన ప్రకారం ఐదుగురు ముత్తైదువలని తీసుకొచ్చారు. వాళ్ళుకూడా ఆమె భక్తులే. వాళ్ళకి విషయం వివరించబడింది.

లలిత తల్లితండ్రులకి భక్తుల మధ్య వున్నత స్థానం ఇవ్వబడింది. ఆ ఇద్దరూ దేవికి దగ్గరగా కూర్చున్నారు.

అక్కడకి కొద్ది దూరంలో కొత్తగా కట్టిన దేవాలయంలో విగ్రహ ప్రతిష్టాపన జరుగుతోంది. అక్కడి నుంచి "హరేరామ హరేకృష్ణ" అంటూ భక్తులు ఉద్రేకంగా భజన చేయటం వినిపిస్తోంది. మంత్రిగారు పురోహితులు చెప్పింది చెప్పినట్లుగా చేస్తున్నారు. కరెక్టుగా అదే ముహూర్తానికి ఇక్కడ లలితని కృష్ణుని గదిలోకి పంపాలని నిర్ణయించబడింది.

ముత్తైదువులు లలితని తమతో ఆ గది దగ్గరకి నడిపిస్తున్నారు. దేవి ధ్యానంలోకి వెళ్ళిపోయింది. ఆమె ముందు కూర్చున్న వాళ్ళు మాట పలుకు లేకుండా కూర్చున్నారు. ఏం జరుగుతుందో అక్కడున్న ఎవరికి తెలీదు. అందరు చాలా ఆసక్తిగా చూస్తున్నారు.

అచ్యుతరామయ్యగారూ, భార్యా ఏం జరుగుతుందోనని బాధగా చూస్తున్నారు. పదహారేళ్ళు పెంచిన అమ్మాయిని అలా అర్పించెయ్యడంవలన వచ్చిన భారంతో కృంగిపోయి వున్నారు. కనుకొనలలో నిలిచిన నీటిని బయటికి రానివ్వకుండా అతి కష్టంమీద ఆపుకుంటున్నారు. రజని, అతని భార్యకూడా అక్కడేవున్నారు. అతడికీతతంగం అంతా వింతగా వుంది. ఏంజరుగుతుందోనని చూస్తున్నాడు. అర్పించడం అంటే ఏమిటో తెలుసుకోవాలని ఉత్సాహంగా వుంది అక్కడివాళ్ళందరికీ.

★ ★ ★

నాయకుడుగారు విగ్రహప్రతిష్టాపన అవగానే దేవిదగ్గరికి వచ్చారు. ఏకాంతంగావున్న ఆవిడముందు కూర్చున్నారాయన.

"సౌకర్యాలన్నీ బాగానే వున్నాయి కదా" కుశల ప్రశ్న వేసింది దేవి.

"బాగానే వున్నాయి తల్లీ. దేవుని విగ్రహాన్ని ప్రతిష్టించే మహద్భాగ్యాన్ని నాకు కలగచేసినందుకు చాలా కృతజ్ఞుణ్ణి" అన్నారాయన. ఎప్పుడు ఊడిపోతాయో తెలియని ఈ పదవులని చిరకాలం నిలుపుకోవాలని ఆయన కోరిక.

"ఇందులో నాదేముంది. దేవుడు ఎలా చెపితే అలా జరుగుతుంది. మాట్లాడేది నేనయినా మాట్లాడించేది పైవాడు. జరిపించేది నేనైతే జరగాల్సింది చెప్పేవాడు ఆయన. ఆయన కోరిక ప్రకారమే మిమ్మల్ని పిలిపించడం జరిగింది"

"ధన్యుణ్ణి తల్లీ"

"దేవుడికి మీరెంతో, బయట వున్న భక్తులూ అంతే. మనమంతా ఆయన భక్తులమే. ఆయన భక్తులకోరికలు తీర్చడానికి ఆయన భక్తులమైన మనం మన బాధ్యతనెరవేర్చాలి. దైవ ప్రతినిధిగా నేను ఆ భగవంతుని భక్తుల కోరికలను నాకు సాధ్యమైనంతవరకు తీరుస్తున్నాను. ఆయన ప్రియ భక్తునిగా మీరుకూడా మీకు చాతనైనంతలో ఈ భక్తుల కోరికలు తీర్చాలి."

"తప్పకుండా తల్లీ. మీరు దైవప్రతినిధి అయితే ప్రజల కొరకు జీవితం అర్పించిన ప్రజాప్రతినిధిని నేను. తప్పకుండా వాళ్ళకోరికలు తీరుస్తాను"

"నేను మాట్లాడుతున్నది ప్రజల గురించి కాదు. శ్రీకృష్ణుని భక్తుల గురించి"

"అర్థమైంది తల్లీ"

"ఆ భగవంతుడు నీకు సర్వసౌఖ్యములను ఇచ్చుగాక"

"ఉంటాను తల్లీ"

"మంచిది. నేను చెప్పింది మరచిపోకు"

"అలాగే తల్లీ" అని బయటికి వచ్చారు. బయట వున్న జనాన్ని చూసారు. ఆ పట్టణ జనాభా అంతా అక్కడే వున్నారా అనిపించింది. తరువాత నెలలో జరిగే ఎన్నికలు జ్ఞాపకం వచ్చాయి. అసలు జిల్లాలో ఎలా పర్యటించాలి అని ఆలోచిస్తుండగా "దేవుని విగ్రహాన్ని ప్రతిష్టింపచెయ్యడానికి మీరు రావాలని" అడగడంతో అదో మంచి అవకాశంగా




భావించి వచ్చేసాడు.

దేవికున్న అంతమంది భక్తులని చూడగానే ఆయనకో ఆలోచనవచ్చింది.

ఎలక్షన్లో గెలవాలంటే స్వయంప్రతిభగాని, సానుభూతికాని, దేవుడుకాని ఈ మూడింటిలో ఏదివున్నా అవకాశం ఎక్కువ. అలాగే వీటి బలాలుకూడా ఒకదానినుంచి ఇంకొకదానికి పెరుగుతూపోతాయి. స్వయంప్రతిభకంటే సింపతి బలమైనది. సింపతికంటే ఆయన వెనుక దేవుడున్నాడు అన్నది ఇంకా బలమైనది.

ఇప్పుడు తాను దేవి సహాయం తీసుకుంటే ఇక్కడ తమ పార్టీ తప్పకుండా నెగ్గుతుంది, తన పరపతికూడా పెరుగుతుంది.

తన విడిదికివచ్చి కూర్చున్న ఆయన దగ్గరికి వచ్చాడు శ్రీధర్.

"మీరా రండి" అన్నారాయన.

"మీతో చిన్నపని పడిందండి" అన్నాడు శ్రీధర్.

అప్పుడు ఆయన శ్రీధర్ ఏ పనిచెప్పినా చెయ్యడానికి సిద్ధంగా ఉన్నాడు.

"చెప్పండి.... నాకు చేతనైనది అయితే తప్పకుండా చేస్తాను"

"రాజ్‌కుమారిగారి పొలాలు ఇంకొకళ్లకి ధారాదత్తం చేయకుండా మీరు అడ్డుపడాలి"

"అయ్యో కష్టం. అది మంత్రిగారి అధీనంలో ఉంది"

"మంత్రిగారు మీ మాట కాదంటారా"

"కాదనరనుకోండి. కాని...."

శ్రీధర్ మొహంలో ఆశాభంగం, "మిమ్మల్నే నమ్ముకున్నాము. మీరో సంతకంపెట్టిస్తే మిగతావి ఆయన చూసుకుంటారు. మీ ఏరియా కాబట్టి మీరు చిన్న రికమండేషన్ లెటర్‌మీద సంతకం చేయండి.... మిగతావి మేము చూసుకుంటాము"

"మీ పని మీరు చూసుకుంటారు. నా పరువుకాస్తా ఊడిపోతుంది"

"మీరే అలాగంటే ఎలాగండి మనందరం శ్రీకృష్ణుని భక్తులం. ఒకరికొకళ్లం సహాయం చేసుకోకపోతే ఎలా? ఏమైనా కావాలంటే చెప్పండి.... సిద్ధంగా ఉంది"

"ఛ...మీ దగ్గర డబ్బు తీసుకుంటానా?"

"మీ అరవయ్యో శోభనానికి అన్నీ సిద్ధంచేశాం"

"అరవయ్యో శోభనానికా!" ఆయన కళ్ళు ఆశ్చర్యంతో పైకిలేచాయి. పెదవులు ఆనందంతో విచ్చుకున్నాయి. "ఆ సంగతి మీకెలాతెలుసు?"

ఆయన పెదవులపై నవ్వుని, ఆశ్చర్యాన్ని చూడగానే "ఇదిగోండి సర్టిఫికెట్. అమ్మాయి కన్యే అని సర్టిఫికెట్" అన్నాడు.

సర్టిఫికెట్ తీసుకొని "ఏమిటో... ముందరికాళ్లకి బంధం వేస్తున్నావు. సరేగానీ నువ్వు నాకో సహాయం చేస్తే నేనీ సహాయం చేసేస్తాను"

"చెప్పండి.... నిముషాలమీద చేసేస్తాను"

"రేపటి ఎన్నికలలో మీ హెల్ప్‌కావాలి"

"తప్పకుండా"

"మీ పేరు, దేవునిపేరు, దేవి పేరుకూడా వాడుకుంటాం"

"బ్రహ్మాండంగా వాడుకోండి. ఇప్పటికైనా ఒప్పుకొంటారా?"

"ఆ రికమండేషన్ లెటరివ్వండి" అని తీసుకుని చదివి సంతకంపెట్టి "నామీద నమ్మకం మీకు కలగాలని సైన్‌చేశానుగాని నేను రేపే వెళ్ళి మంత్రిగారితో మాట్లాడి మీ ప్రోబ్లమ్ సాల్వ్ చేస్తాను"

"థాంక్సు సర్"

"మీరు నాకు చెయ్యాల్సిన హెల్ప్ మరిచిపోకూడదు"

"మరిచిపోను. శోభనానికి సిద్ధంగా ఉండండి" అని వెళ్ళిపోయాడు శ్రీధర్.

అప్పటికే లలితని ఒక గదిలో బంధించి ఉంచారు. రాత్రి అయ్యేవరకు మెలకువ రాదు ఆమెకి.

మంత్రివర్యులు గదిలో పట్టుపరుపుమీద ఆనందంగా పవళించి తలుపులవైపు చూస్తున్నారు.

తలుపులు తెరుచుకున్నాయి. లలితని తీసుకొచ్చి ఆ గదిలో వదిలి తలుపులేసి వెళ్ళిపోయారు.

శోభనంగదిలా ఉన్న ఆ గదిని తదేకంగా చూస్తోంది లలిత. ఎదురుగా యాభైఏళ్ల వయస్కుడు కుర్రవాడై చెలరేగిపోవాలని ఉవ్విళ్ళూరుతున్నాడు. మత్తెక్కించే వాతావరణం. సెగలు పొగలను జల్లుతున్న శరీరం, కళ్లల్లో కోరిక.

గదిని చూసి నోట మాటరాక నిలబడిపోయింది.

ఆయన మంచందిగాడు. భయం భయంగా చూస్తున్న ఆమె దగ్గరకి వచ్చాడు.

ఆమె విస్తుపోయి అతడినే చూస్తోంది. అతడి ఫోటోను చాలాసార్లు పేపర్లో చూసింది.

"కంచే చేను మేస్తుందా" అని ఆలోచిస్తోంది.

కంచె అడ్డు ఉండగా ఇంకొకటి ఎలా వచ్చేయగలదు, కంచే మేస్తుంది అని అర్థంకావటంలేదు.

తనకి అర్పించబడిన అమ్మాయిపై చేయివేస్తుంటే శ్రీకృష్ణభగవానుడు ఊరుకుంటాడా? "మనసా వాచా నిన్నే నమ్ముకున్నాను, నన్ను




రక్షించు'' అని మూగగా రోదిస్తోంది లలిత.

కానీ లలితకన్నా దేవుడికన్నా బలవంతుడాయన. తన అరవయ్యో శోభనం విజయవంతంగా పూర్తిచేసుకొని లేచారాయన, మరో అరగంట తర్వాత.




ఆ రోజు సోమవారం

దేవిభక్తులు ఆమెని దర్శించుకోడానికి ఆమె గదిముందు క్యూలో నిలబడి ఉన్నారు. ప్రతిసోమవారం నలుగురు మనుషులని నియమిస్తాడు శ్రీధర్. వాళ్ళు ఒక్కోరోగంతో గూనితోనో, పెరాలిసిస్‌తోనో, ఫుగర్‌తోనో వస్తారు. అక్కడికొచ్చిన ప్రజలందరిముందు ఆ రోగాలు వాళ్ళందరు చూస్తుండగా దేవి స్పర్శతోను ఆమె ఇచ్చిన విభూదితోను తగ్గిపోతుంటాయి. ఎక్కడెక్కడినుంచో వచ్చిన వాళ్ళందరూ ఆ మహిమలని చూడగానే దేవి చేయి తగిలితే ఎటువంటి రోగమైనా ఇట్టే మాయమైపోతుందని తమతమ ఊళ్ళల్లో చెపుతుంటారు. ఎవరికైనా పొరపాటున తమ రోగమే తగ్గితే స్వయంగా అనుభవించింది కథలుకథలుగా చెపుతారు. ఆ విధంగా సోమవారం వచ్చే ఆవిడ భక్తజన సంఘం సంఖ్య పెరిగిపోతుంది.

సోమవారం భక్తులు తమ రోగాలని తగ్గించుకోవాలని వచ్చి క్యూలలో నిలబడ్డారు.

ఆరోజు తెల్లవారుజామునే బయలుదేరారు వీరయ్య, రంగమ్మ. వాళ్ళిద్దరికి పెళ్ళి అయి అయిదు సంవత్సరాలయింది. ఇంతవరకు పిల్లలు పుట్టలేదు. ఊళ్ళో దేవిగురించి, ఆవిడ మహిమలు గురించి విని విని చివరికి ఆ రోజు భార్యని తీసుకొని బయలుదేరాడు వీరయ్య.

ఇద్దరూ లైనులో నిలబడ్డారు. సోమవారం ఆ ఛాయలకు అసలురాని శ్రీధర్ ఆరోజు వచ్చాడు. పల్లెటూరివాడిలా కనబడుతున్న వీరయ్యవెంటవున్న రంగమ్మని చూశాడు.

అమాయకమైన పల్లెటూరిపిల్ల అవడంతో ఆమె శరీరాన్నంతటిని తడిమాయి శ్రీధర్ కళ్ళు ఆసక్తిగా. ఆ అమాయక జంటని చూడగానే తెలిసిపోతుంది వాళ్ళెందుకు వచ్చారో. అయినా ఎందుకేనా మంచిదని ఒక వ్యక్తిని పిలిచి - ''వాళ్ళెందుకు వచ్చారో'' కనుక్కురమ్మని పంపాడు. వాడు వెళ్ళి కనుక్కునివచ్చి చెప్పాడు. శ్రీధర్ ఊహించింది నిజమే.

శ్రీధర్ దేవి దగ్గరికి వెళ్ళాడు. అతడు దేవి దగ్గరికి వెళ్ళేదే చాలా తక్కువ. చెప్పదలుచుకున్నది చెప్పి వెంటనే బయటికి వచ్చేసాడు. తన గదిలోకి వెళ్ళేముందు ఇంకోసారి రంగమ్మ శరీరాన్ని చూపులతో తడిమి మరీ లోపలకి వెళ్ళిపోయాడు. వాళ్ళిద్దరూ అమాయకంగా తమవంతు కోసం చూస్తున్నారు. వాళ్ళిద్దరూ ఎంతో ఆతృతగా ఎదురు చూస్తున్న శుభసమయం వచ్చింది. వాళ్ళవైపు చూసింది దేవి.

''వీరయ్యా, రంగమ్మా మీకు పిల్లలుకావాలి. అదేగా మీ కోరిక'' అనడిగింది.

తమ పేర్లు ఆవిడకి ఎలా తెలిసాయో అర్థంకాక మొహాలు చూసుకున్నారు. ఆవిడకున్న మహిమలలో అదీ ఒకటన్నమాట. ''అవును తల్లీ'' అని ఇద్దరు సాష్టాంగ నమస్కారం చేసారు.

''లేవండి, లేవండి... మీకోరిక తప్పక తీరుస్తాను. ఇద్దరూ ఆ పక్కన నిలబడండి. తరువాత చెపుతాను మీరేం చెయ్యాలో'' అంది.

వాళ్ళిద్దరూ తప్పుకొని పక్కన నిలబడ్డారు. వాళ్ల తరువాత నిలబడిన వ్యక్తి లోపలకి వచ్చి ఆవిడ కాళ్ల ముందు సాష్టాంగం పడిపోయాడు.

''శ్రీనివాసులూ లేవవయ్యా నీకు ఫుగర్ తగ్గిపోయిందని చెప్పడానికొచ్చావ్. నీభార్య రక్తపోటు తగ్గించుకోడానికి ఇక్కడికి తీసుకురావాలనుకుంటున్నావు. అంతేగా.... దానికి నా అనుమతి కావాలా వెళ్ళి తీసుకురా'' అంది.

''తల్లీ... నువ్వు నిజంగా జగన్మాతవి. మా

బాధలన్ని కడుపులో పెట్టుకొని రక్షించేమాతవి. నీపేరు తలచుకుంటేనే జబ్బులు మటుమాయమైపోతాయి. ఇప్పుడేవెళ్ళి తీసుకొస్తాను తల్లీ'' అని వెళ్ళిపోయాడతను.

వీరయ్య వైపు తిరిగి - ''పిచ్చిభక్తుడు ఇదంతా నేనే చేసాననుకుంటున్నాడు. అంతా ఆ దేవుని లీల. చేయించేవాడు భగవంతుడు. చేసేదాన్ని మాత్రమే నేను. మీకు భగవంతుడికి మధ్యవారధిలాంటిదాన్ని'' అంది.

వీరయ్యకి ఆమె అన్నది అర్థంకాలేదు. రెండు చేతులు జోడించి నిలబడ్డాడు. రంగమ్మ కూడా అంతే. పెద్ద కళ్ళని ఇంకా పెద్దవి చేసి ఆశ్చర్యంగా చూస్తోంది. భక్తులు వరుసగా తమ బాధలని చెప్పుకొని వాటి విముక్తి కోసం మార్గాలని తెలుసుకొని వెళ్ళిపోతున్నారు. ఆమె చేతి స్పర్శతోనే తమ బాధలుతీరిపోయినట్టుగా భావిస్తున్నారు వారు.

వంగి నడుస్తూ వచ్చాడొక మధ్యవయస్కుడు. లోపలికి వచ్చి ''మిమ్మల్నే నమ్ముకున్నాను తల్లీ. చిన్నప్పటి నుంచి గూనితో బాధపడుతున్నాను. ఎంతమంది డాక్టర్ల దగ్గరికి వెళ్ళినా నారోగాన్ని కుదర్చలేకపోయారు. నీపేరు విని నారోగాన్ని నువ్వే తగ్గించగలవని వచ్చాను. నువ్వే కాపాడాలి తల్లీ'' అన్నాడు. కాళ్ళమీద పడిపోతూ.

''కంగారుపడకండి ఆచారిగారూ మీ నుదుటన మీ రోగం నయమవ్వాలని రాసి ఉంటే నా ప్రయత్నం నేను చేసి మీ రోగాన్ని పోగొడతాను. ఆ దేవుని సంకల్పం అయితే ఎలాంటి రోగాలైనా ఇట్టే మాయమైపోతాయి. మీ తరపున నేను దేవునితో మాట్లాడతాను'' అని కళ్ళు మూసుకుంది. కొన్ని క్షణాల తరువాత కళ్ళు తెరిచి ''ఇటురండి ఆచారిగారు'' అంది.

ఆమె దగ్గరగా వచ్చాడు. వెనక్కి తిరగమనడంతో వెనక్కి తిరిగాడు. నెమ్మదిగా వెన్నుపూస మీద రాస్తూ నెమ్మదిగా ''సరిగా నిలబడండి. అంతాసర్దుకుంటుంది. నెమ్మదిగా పైకిలేవండి. చాలా నెమ్మదిగా అంది అలా రాస్తూనే.

వీరయ్య కళ్ళు పెద్దవి చేసుకొని చూస్తుండగానే ఆ ఆచారి నడుం బాగయిపోయింది. వీరయ్య కళ్ళ ముందు వంగివంగి నడిచివచ్చిన వ్యక్తి కొన్ని క్షణాల తరువాత అతడి కళ్ళ ముందు నుంచే దర్జాగా, ఠీవీగా నడుచుకుంటూ వెళ్ళిపోయాడు. వెళ్ళిపోయే ముందు దేవిని మరీమరీ పొగిడేసి వెళ్ళిపోయాడు.

ఆవిడ మహిమలని కనులనిండుగా చూసి ధన్యులమైపోయాము అనుకున్నారు ఆ పల్లెటూరి దంపతులు.

అందరూ అయిపోయేసరికి సాయంత్రం అయింది.

''ఇప్పుడు వివరంగా చెప్పు వీరయ్యా!'' అంది దేవి.

''మాకు పెళ్లై అయిదేళ్లు అయింది తల్లీ! ఇంతవరకు పిల్లలు పుట్టలా. మీరు కలగజేసుకొని ఎలాగైనా రంగికి పిల్లలుపుట్టేలా సెయ్యాలి'' అన్నాడు.

''అర్థమైంది. భగవంతునితో మాట్లాడి చెపుతానుండు ఏం చెయ్యాలో'' అని కళ్ళు మూసుకుంది.

వీరయ్య భార్యతో నెమ్మదిగా, ''మన విషయం భగవంతునితో మాట్లాడు తుంది దేవి. ఇందాక సూసావుగా వాళ్ళందరిరోగాలు ఎలా మాయం సేసిందో! అలాగే మనకి పిల్లలు పుట్టేలాసేత్తాదే'' అన్నాడు.

''నిజంగా మనకి పిల్లలు పుడతారంటావా మావా''?

''నోర్ముయ్యేహె... అందుకే మా అయ్యంటుండేవాడు అనుమానంముందు పుట్టి ఆడోళ్ళు తరువాత పుట్టారు అని. ఆ పక్కన తల్లి దేవునితో మాట్లాడతా వుంటె మళ్ళీ అనుమానమెందుకే'' అన్నాడు.

కళ్ళు తెరచింది దేవి. ఎదర ఉన్న విభూదిని కదిపింది. ఒక కాగితం బయటపడింది. ఆవిడ చేస్తున్నది ఆశ్చర్యంగా చూస్తున్నారిద్దరూ. తెల్లని కాగితంమీద నల్లని అక్షరాలు.

''ఇదిగో తీసుకో. ఇప్పటికి నువ్వు చెయ్యాల్సింది ఇందులో ఉంది. చదువుకొని ఆ పని పూర్తిచెయ్యి. మిగతాది తరువాత చెబుతాను'' అని తన గదిలోకి వెళ్ళిపోయింది.

కాగితం తీసుకొని అటు ఇటు తిప్పాడు వీరయ్య.

''ఏముంది మావా అందులో''? అడిగింది

రంగమ్మ.

"నాకేం తెలుసే... బయట ఎవరినన్న అడు గుదాంరా. నేనేమన్నా సదువుకున్నానా? సిన్న ప్పుడే కమతంలో పెట్టేశాడుగా మా అయ్య" అన్నాడు.

"పద బేగా. మళ్ళా అందరు ఎళ్ళిపోతా రేమో" అంది.

వాళ్ళిద్దరు బయటకి వచ్చారు. వాళ్ళ దగ్గర కి ఒక వ్యక్తి వచ్చి "మిమ్మల్ని శ్రీధర్‌బాబు రమ్మంటున్నారు" అన్నాడు.

"శ్రీధర్‌బాబా... ఆయనెవరు"?

"దేవి ముఖ్యశిష్యుడు. మా అందరికి పెద్ద. ఇక్కడి వ్యవహారాలన్ని చూసుకునే వ్యక్తి"

"పద... వస్తున్నాం" అన్నాడు వీరయ్య.

శ్రీధర్ రూమ్‌కెళ్ళారు ఇద్దరూ. వాళ్ళు లోప లికి రాగానే "ఏంటి... ఇద్దరూ అక్కడ తచ్చా డుతున్నారు?" అనడిగాడు.

"నాపేరు వీరయ్యండి. ఇది నా పెళ్ళాం



రంగమ్మండి. మాకు పెళ్లై అయిదు సంవత్సరాలయిందండి. కాని పిల్లలు లేరండి''

''అవన్నీ ఎవరడిగారయ్యా నిన్ను? అక్కడెందుకున్నావ్ అని అడుగుతున్నాను''

''తల్లిచ్చిందండి ఈ కాగితం. ఎవరిచేతనైనా నదివించుకుందామని''.

''నీకు చదవడం రాదా''.

''నేనసలు సదువుకోలేదండి''.

''ఏదిటివ్వు'' అని దేవి ఇచ్చిన కాగితాన్ని తీసుకున్నాడు. పెద్దగా చదవడం మొదలుపెట్టాడు.

''శుభ్రంగా తలకు స్నానం చేసి పట్టుచీర కట్టుకొని దేవుని గుడిలో మూడురోజులు వస్తుతో కటికనేలమీద ఒంటరిగా పడుకుంటే మూడో రోజు రాత్రి ఆ భగవంతుడే స్వయంగా నీ గర్భంలో పిండాన్ని ప్రవేశపెడతాడు''

''బాబూ... దీనికి పట్టుచీర లేదండి'' అన్నాడు వీరయ్య.

''ఈ కార్యక్రమం చెయ్యాలంటే పదివేలవుతుంది. ఇంక నువ్వు పట్టుచీర కొనుక్కోఅక్కర లేదు. ఎక్కడో హొటల్‌లో అద్దెకు రూమ్ తీసుకోనక్కరలేదు. అన్నీ ఇక్కడే మేమే స్వయంగా మీకందిస్తాం. కాకపోతే పూజకి, పట్టుచీరకి అన్నిటికి కలిపి పదివేలవుతుంది'' అన్నాడు శ్రీధర్.

''పది వేలే'' కళ్ళు తేలేసేసి అన్నాడు వీరయ్య.

''అవును... అక్షరాలా పదివేలే''

రంగమ్మ వంక చూశాడు వీరయ్య. ఆమె కళ్ళల్లో ఆశ, తల్లి కావాలన్న కోరికని చూసి ''అలాగే తెస్తామండి. డబ్బులు తీసుకొని వస్తామండి'' అన్నాడు వీరయ్య.

''మళ్ళీ ఆవిడెందుకు నీతోపాటు. రేపే పూజా కార్యక్రమం ప్రారంభిస్తాం. నువ్వెళ్ళి డబ్బు తీసుకొని వచ్చెయ్'' అన్నాడు శ్రీధర్.

''అలాగేనండి'' అని, ''ఇప్పుడు మా ఊరికి బస్సు లేదండి. ఎక్కడుండాలో సెపితే...'' అని ఆగిపోయాడు.

''రండి... మీ గది చూపెడతాను'' అని తీసుకెళ్ళి అక్కడికి కాస్త దూరంలో ఉన్న అయిదు గదులలో ఒక గదితలుపు తాళం తీసి ''ఇందులో ఉండండి. ఇక్కడ మీరు వంట వండుకోవాల్సిన పనిలేదు. అన్నీ అందజేయబడతాయి. అంతగా ఏమైనా కావలసివస్తే నారూమ్ తెలుసుగా... అక్కడకి వచ్చేయండి'' అన్నాడు.

''బాబూ...'' అని నసుగుతున్నాడు వీరయ్య.

''ఏంటి?''.

''ఈ పూట సినిమాకెళ్ళొచ్చేమోనని''

''వెళ్ళొచ్చు. రేపటినుంచి మూడురోజులు వ్రతదీక్షలో ఉండాలి. నువ్వు రేపువెళ్ళి డబ్బులు తెచ్చెయ్యాలి. ముఖ్యంగా నువ్వు ఈ మూడురోజులు నీ భార్యని తాకకూడదు. సినిమాకెళతాం అన్నారుగా వెళ్ళండి. భోజనం వస్తుంది... చేశాక వెళ్ళండి'' అని వెళ్ళిపోయాడు శ్రీధర్.

మర్నాడు పొద్దున్నే ఒకావిడ వచ్చి లేపింది వాళ్ళిద్దరినీ. రంగమ్మని తనతోపాటు తీసుకెళ్ళింది తలకి స్నానం చేయించడానికి. భార్యకి చెప్పి ఇంటికి బయలుదేరాడు రంగయ్య. వాళ్ళయ్యగారికి విషయం చెప్పి డబ్బు తీసుకొని సాయంత్రంకల్లా తిరిగివచ్చాడు. రంగమ్మని చూసి ఆశ్చర్యపోయాడు. పట్టుచీరకట్టుకొని, చేతుల నిండా గాజులు, మెడలో గొలుసులు, వంటినిండా ఆభరణాలతో నిలబడి ఉంది.

దగ్గరికి వెళ్ళి ''శానా అందంగా ఉన్నావే రంగి'' అందామనుకున్నాడు. కాని ఆమెని తాకకూడదని శ్రీధర్ చెప్పిన మాటగుర్తుకొచ్చి ఆగిపోయాడు.

డబ్బుని తీసుకెళ్ళి శ్రీధర్‌కిచ్చాడు వీరయ్య.

''రాత్రి దేవాలయంలో పడుకుంటుంది. పగలు భక్తులతో భజనలు చేస్తూగడుపుతుంది ఈ మూడురోజులు. నువ్వు కూడా భజనలు చేస్తూ గడుపు'' అన్నాడు శ్రీధర్.

''అలాగేనండి'' అని తన గది దగ్గరకి వచ్చేశాడు వీరయ్య.

ఆ రాత్రి రంగమ్మని దేవి గదిలోకి తీసుకువెళ్ళారు. రెండు చేతులు జోడించి నమస్కరించిన రంగమ్మని ''సుపుత్ర ప్రాప్తిరస్తు'' అని ఆ





పక్కనే ఉన్న పాలగ్లాసు ఆమెకిచ్చి "తాగు రంగమ్మా" అంది దేవి.

"అదేంటి తల్లీ... ఉపవాసం ఉండాలన్నారుకదా?"

"ఉండాలి. కాని అసలేమీ తినకుండా ఉండకూడదు. ఈ పాలు తాగు" చిరునవ్వుతో చెప్పింది దేవి.

గ్లాసులో పాలని తాగి "వస్తాను తల్లీ" అంది.

"పద... నేనూ వస్తాను" అని భూగృహంలో వున్న కృష్ణుని విగ్రహం దగ్గరికి తీసుకువెళ్ళింది దేవి. తలుపులేసి ఒక పీటమీద రంగమ్మని కూర్చోపెట్టి తాను ఇంకొక పీటమీద కూర్చొని, కళ్ళు మూసుకొని ఏదో ప్రార్థిస్తోంది. రంగమ్మ మౌనంగా దేవివైపే చూస్తోంది. కళ్ళు తెరచుకొనే ఉండాలని ఎంత ప్రయత్నిస్తున్నా కనురెప్పలపై ఏదో భారం ఉంచినట్టుగా తెరచుకొని ఉండలేకపోతోంది. ఇంక కూర్చోలేక పడిపోయింది.

రంగమ్మని సరిగా పడుకోబెట్టి తను గది నుంచి బయటికి వచ్చేసింది దేవి.

కొద్దిసేపటి తరువాత ఇంకో ద్వారం నుంచి లోపలికి వచ్చి అటువైపు గది గడియవేసేశాడు శ్రీధర్.

ఆమె చేతి గాజులు తీసేశాడు. తర్వాత ఆభరణాలన్నీ తీసేశాడు. అప్పుడు ఆమె మీదికి వంగాడు.

ఆ రాత్రి గడచిపోయింది.

తెల్లవారగానే మెలకువ వచ్చింది రంగమ్మకి. ఆమె ఎక్కడుందో అర్థం కాలేదు క్షణంపాటు. ఎదురుగా ఆమెవైపే నిశ్చలంగా చూస్తున్న కృష్ణుడి విగ్రహాన్ని చూడగానే తెలిసింది తను ఎక్కడుందో. తలుపులవైపు చూసింది. లోపలే గడియవేసుంది. దేవికోసం చూస్తే కనిపించలేదు. ఆశ్చర్యం అనిపించింది. తనతోపాటు లోపలికి వచ్చిన తల్లి ఇటువైపు తలుపు లేసి బయటికి ఎలా వెళ్ళింది.

తలుపులు తీసి బయటకి వెళ్ళింది రంగమ్మ.

మళ్ళీ నిన్నటిలాగే తలకి స్నానం చేయించి పట్టుచీర, గాజులు, ఆభరణాలు ఆమెకు తగిలించి శ్రీకృష్ణుని భజన బృందంలో కూర్చోబెట్టారు. వీరయ్య కూడా అక్కడే కూర్చొని ఉన్నాడు.

మధ్యాహ్నం భోజనానికి తమకిచ్చిన గదికి వెళ్ళారు. భోజనం చేస్తూ, "రంగీ రాత్రి ఏమయిందే...?" అడిగాడు వీరయ్య. రంగమ్మ వడ్డిస్తోంది, భోజనం చేయకూడదుకదా!

"తల్లి నన్ను కృష్ణుని మందిరానికి తీసుకువెళ్ళింది. అక్కడికెళ్ళాక కళ్ళు మూసుకొని కొద్దిసేపు దేవుడితో మాట్లాడింది. ఆవిడ మాట్లాడుతుండగానే నాకు నిద్రవచ్చేసింది. ఆ తల్లి ఇటువైపు తలుపు తీసి బయటకి వెళ్ళిపోయింది"

"నీవైపు తలుపులేసి బయటికి ఎలా వెళుతుంది?"

"ఏమో మావా" అంది.

రెండోరోజు కూడా అలాగే జరిగిపోయింది

మూడోరోజు భోజనంచేస్తూ వీరయ్య- "ఈరోజే దేవుడు నీ గర్భంలో పిండాన్ని ప్రవేశపెట్టేది" అన్నాడు

"అవును మావా. అక్కడికి వెళ్ళగానే ఎంత లేచి ఉందామన్నా ఉండలేకపోతున్నాను. అక్కడకి వెళ్ళగానే నిద్రవచ్చేస్తుంది" అంది.

దేవుడు ఆమె గర్భంలో పిండాన్ని ఎలా ప్రవేశపెడతాడో చూడాలనే ఆసక్తిని అణచుకోలేకపోయాడు వీరయ్య.

ఆరోజు రంగమ్మ వెనకాలే దేవి ఉండే గదిలోకి వచ్చాడు. అక్కడ చాలామంది ఉన్నారు. అది చాలా పెద్ద గది. ఆ గదిలోపలికి ఇంకో చిన్న గది ఒక మూలకివుంది. దేవి పన్నెండు గంటలకి దేవునితో మాట్లాడుతుందని ఆ సమయంలో అటువైపు వెళితే తలపగిలి చస్తారని భక్తులందరికి తెలియజేయబడింది. రాత్రి పన్నెండు గంటలకి కొద్దిగా ముందు రంగమ్మ అక్కడికి వెళుతుంది. అంతవరకు భజనే. ఆ పెద్ద గదిలో చాలా మంది పడుకొనివుంటారు. అప్పుడు పాలు ఇచ్చి రంగమ్మని భూగృహంలో ఉన్న కృష్ణుని విగ్రహం ముందుకి తీసుకువెళుతుంది. ఆ భూగృహం తలుపులు ఎప్పుడో కాని తెరవరు.

అక్కడ భూగృహం ఒకటి ఉందని చాలాకొద్ది మందికే తెలుసు.

రంగమ్మకు పాలు ఇచ్చి తనతో తీసుకువెళ్ళింది దేవి. వాళ్ళ వెనకాలే వెళ్ళిన వీరయ్య బయటే నిలబడిపోయాడు. పదినిముషాల తరువాత దేవి తలుపులు దగ్గరకి చేరవేసి తన గదికి వెళ్ళిపోయింది. వీరయ్య లోపలికి వెళదామా వద్దా అని ఆలోచిస్తున్నాడు. దేవుడు ఎలా తన భార్య గర్భంలోకి పిండాన్ని ప్రవేశపెడతాడో చూడాలన్న కోరిక బాగా పెరిగిపోయింది. తలుపులు నెమ్మదిగా తోసి లోపలకి అడుగుపెట్టాడు. మళ్ళీ తలుపుని నెమ్మదిగా దగ్గరగావేసి విగ్రహంవెనక్కి వెళ్ళి నుంచున్నాడు. హాయిగా పడుకొని ఉన్న భార్యవైపు చూస్తున్నాడు.

కొద్దిసేపటికి...

ఇంకో తలుపు తెరుచుకొని లోపలికి వచ్చాడు ఓవ్యక్తి. రంగమ్మ దగ్గరకి వచ్చేవరకు అతడిని గమనించలేదు వీరయ్య. తనకు అన్నిఏర్పాట్లుచేసిన ఆ శ్రీధర్ ఉన్నట్టుండి అక్కడ ఎలా ప్రత్యక్షమయ్యాడో అర్థంకాలేదు వీరయ్యకి. శ్రీధర్ ప్రతి కదలికని విభ్రాంతితో చూస్తున్నాడు.

శ్రీధర్ రంగమ్మ పక్కన కూర్చొని గాజులు, అభరణాలు తీస్తున్నాడు. వీరయ్యకు క్రమంగా సంగతి అర్థమవుతోంది. అతని రక్తం సలసల కాగనారంభించింది. దేవుడి పేరుచెప్పి వీళ్ళు చేస్తున్నది ఇదా అని ఆలోచిస్తున్నాడు.

అంతలోనే విగ్రహంవెనుక కదలిక పసిగట్టాడు శ్రీధర్. వెంటనే వెనక్కి శ్రీకృష్ణుని విగ్రహంవైపు తిరిగాడు. శ్రీకృష్ణుని విగ్రహానికి నమస్కారంచేసి, "భగవాన్ నువ్వాదేశించినట్టే నీ కోరికమేరకు నేను , ఈమెను పునీతురాలిని చేస్తున్నాను. ఇది పాపమో పుణ్యమో, తప్పో ఒప్పో నాకు తెలీదు! నీ ఆదేశాన్ని పాటించడమే నా కర్తవ్యం. దానివలన కలిగే లాభనష్టాలు. పాపపుణ్యాలు భరించాల్సింది నీవే" అని రంగమ్మవైపు తిరిగాడు.

అలా భర్త ఎదురుగా భార్యని....

ఈ ప్రపంచంలోని కుళ్ళుకి దూరంగా ఉన్న పల్లెటూరి అమాయకుడు వీరయ్య అతడు అన్నదంతా నమ్మేశాడు. సినిమాలలో ఇక్కడ మాయమై అక్కడ ప్రత్యక్షమయ్యే శ్రీకృష్ణునిలా తలుపులన్నీ వేసివున్నా శ్రీధర్ ఆ గదిలో ప్రత్యక్షమవడం, శ్రీధర్ మాటలు అతడికి గొప్పగా అనిపించాయి.

కాని, తన ఎదురుగానే తన భార్యని....

చూడలేక కళ్ళు మూసుకున్నాడు వీరయ్య. తలుపు గొళ్ళెంచప్పుడు అవడంతో కళ్ళు తెరిచాడు వీరయ్య.

శ్రీధర్ రంగమ్మ వచ్చిన తలుపులు తెరుచుకొని బయటికి వెళ్ళిపోయాడు.

వీరయ్య అక్కడవుండి ఏంచెయ్యాలో తెలియక నెమ్మదిగా బయటకి వచ్చేశాడు. తన రూమ్‌కెళ్ళి తలుపులేసుకొని మంచంమీద పడుకున్నాడు. ఎంతకీ నిద్ర రావడంలేదు.

మంచంమీద నిద్రరాక పొర్లుతున్న వీరయ్య, "వీరయ్యా..." అని గోడలోనుంచి వినబడటంతో ఆశ్చర్యంగా అటువైపు చూశాడు.

"నువ్వు చూడకూడని దైవకార్యం చూశావు. నా లీలావిలాసాలనే నమ్మలేకపోయావు... నీకు శిక్ష తప్పదు" అని వినబడింది. వెంటనే వెళ్ళి తలుపులు తీసిబయటకి వచ్చాడు. అక్కడ ఎవరూలేరు.

తప్పుచేశానన్న భావం అతడిలో ప్రవేశించడం మొదలయింది. లోపలకివెళ్ళి తలుపులు వేసేసుకున్నాడు.

లోపలకి వెళ్ళి మంచంమీద పడుకోగానే, "నువ్విక్కడ వుండటానికి తగవు" అని వినిపించింది.

ఈసారి భయం వేయడం మొదలయింది.

కిటికీలోనుంచి పొగలాంటిది ఏదో అతడి గదిలోకి ప్రవేశిస్తోంది. ఆ పొగవైపే వింతగా కళ్ళు పెద్దవి చేసుకొని చూస్తున్నాడు. ఆ పొగ మిళితమైన గాలిని పీల్చగానే కళ్ళు మూసుకుపోవడం మొదలయ్యాయి. కొద్దిసేపటికి మెదడు మొద్దుబారిపోయి విశ్రాంతి తీసుకోవడం మొదలుపెట్టింది.

కిటికీ చువ్వలమధ్యనుంచి ఓ పొడవాటికర్ర వచ్చి వెనకవైపు తలుపు గెడతీసింది. ఇద్దరు బలిష్టులు లోపలకివచ్చి వీరయ్యని ఎత్తుకున్నారు. ఓ కారుదగ్గరకి తీసుకువెళ్ళి లోపల

పడుకోబెట్టి శ్రీధర్ దగ్గరకి వచ్చారు. శ్రీధర్ చెయ్యాల్సింది చెప్పాడు– వాళ్ళు వెళ్లిపోయారు ఆ కార్లో.

తెలవారుతోంది...

నోరు విపరీతంగా బాధపెడుతుండటంతో మెలకువ వచ్చింది వీరయ్యకి. నోటినిండా ఎర్రని రక్తం.

మాట్లాడదామని ప్రయత్నించి నాలుక విపరీతమైన బాధని కలిగించడంతో ఆగిపోయాడు. నాలుక ఎవరో కోసిపడేసినట్టు అతడి ఎదర పడివుంది. బాధని భరించలేక "అమ్మా" అని గట్టిగా అరవాలని, భోరుమని ఏడవాలనివుంది. అలాచెయ్యాలని ప్రయత్నిస్తే ఇంకా బాధ పెరిగిపోతోంది.

తనకి దేవుడువేసిన శిక్ష ఇదేనా?

పొద్దున్నే లేచింది రంగమ్మ. స్నానంచేసి తాము తీసుకున్న గదికి వెళ్ళింది. శ్రీధర్ అక్కడకివచ్చి, "రాత్రి వీరయ్య ఊరెళతానని చెప్పి వెళ్ళిపోయాడంట. దేవి అనుమతి తీసుకొని మీరుకూడా వెళ్ళిపోవాలనుకుంటే వెళ్ళిపొండి" అన్నాడు.

పరాయిమగవాడితో మాట్లాడేటప్పుడు సహజంగా వచ్చి తలపైపడే సిగ్గుభారంతో తల దించుకొని నెమ్మదిగా "వెళ్ళిపోతానండి" అంది.

"మీ ఇష్టం" అని వెళ్ళిపోయాడు శ్రీధర్.

సామానులన్నీ ఇక్కడే వదిలేసి ఒక్కడే ఎందుకు వెళ్ళిపోయాడో అర్థంకాలేదు రంగమ్మకి. తెచ్చుకున్న మూట, సంచి బయటపెట్టి దేవి గదిలోకి వెళ్ళింది.

"వెళ్ళొస్తాను తల్లీ... కొడుకు పుట్టాక చూపించడానికి తీసుకొత్తానండి" అంది.

"తప్పకుండా తీసుకురా. పేరు నేనేపెడతాను" అంది దేవి.

"అలాగే తల్లీ... వస్తాను" అని బస్స్టాండ్వైపుగా వెళ్ళడానికి బయలుదేరుతుండగా శ్రీధర్ వచ్చాడు. "వీరయ్య రాత్రి ఎందుకెళ్ళిపోయాడో ఎంతకీ అర్థంకావడంలేదు. సరే... మీరీ కారులో వెళ్ళండి. డ్రయివర్... ఈవిడని వాళ్ళ ఊళ్ళో దింపేసిరా" అన్నాడు.

"మీకెందుకండీ శ్రమ?" అనబోయింది.

కానీ డోర్తెరిచి "ఎక్కండి" అన్నాడు.

ఎక్కి కూర్చుంది. కారు వాళ్ళ ఊరువైపు బయలుదేరింది. వాళ్ళ ఇంటిముందు ఆపించుకొని దిగి కారుని వెనక్కిపంపేసి దగ్గరకి వేసున్న తలుపులని తోసింది. లోపల దృశ్యం చూసి కెవ్వున అరిచి మూట బుట్ట కిందపడేసింది. వీరయ్య ఉరేసుకుని వున్నాడు.

* * *

మండుటెండను కక్కిన సూర్యుడు కొండలచాటున దాక్కునే ప్రయత్నంలో ఉన్నాడు. ఆహారాన్వేషణకై తిరుగుతున్న పక్షులు తమ తమ గూళ్ళు చేరుకోవడానికి వెనక్కి బయలుదేరాయి. సూర్యుని ప్రతాపానికి భయపడి ఇళ్ళల్లోను, ఆఫీసుల్లోను దాక్కున్న ప్రజలు బయటకు వస్తున్నారు. క్రమంగా బయటకి వస్తున్నవారి సంఖ్య పెరుగుతోంది.

ఎంతో ఆహ్లాదంగా ఉంది సాయంకాలం. చల్లనిగాలి మెల్లగా స్పృశిస్తూ మత్తైన అనుభూతికి లోనుచేస్తోంది.

అంతవరకు హాయిగా విద్రించిన ప్రదీప్ అప్పుడే బద్ధకంగా కనులు విప్పాడు. ఎదురుగా ఉన్న గడియారం ఆరు గంటలు సూచిస్తోంది.

గబగబ లేచి, లుంగీ సరిచేసుకొని, మొహం కడుక్కొని అద్దం దగ్గర కాసేపు గడిపి రూమ్కి తాళంవేసి బయటకి వచ్చాడు.

గుంపులు గుంపులుగా పైనెగురుతున్న పక్షులని చూసి నిట్టూర్చాడు. అతనలా నిట్టూర్చడానికి ప్రత్యేకంగా ఏకారణమూలేదు. బజారుకెళ్ళినప్పుడు కళ్లారా చూసేందుకు ఒక మ్మాయి కూడా కనబడకపోయినా, పూరీ తిందామని హొటల్కెళ్ళినప్పుడు వాడు ఇడ్లీ ఉందండి అన్నా అలాంటి నిట్టూర్పులే యాంత్రికంగా అతడి నుండి వెలువడతాయి.

నెలరోజుల నుంచి ప్రయత్నిస్తున్నాడు నచ్చిన అమ్మాయికోసం. కానీ కాళ్ళు నొప్పులు తప్పించి ఫలితం దక్కటంలేదు.

నిరాశ అనేది అతని ఏనరంలోను ప్రవహించడంలేదు. అసాధ్యం అనే పదానికి

అతని మెదడులో ఎక్కడా స్థానంలేదు. అతడు ఆశాజీవి. అలసట ఎరుగని పట్టుదల మనిషి ప్రదీప్.

బజారులో నడుస్తున్న అతనికి తనపక్కనే మృధుమధురమైన స్వరం వినబడటంతో ఒక్కసారిగా ఆగిపోయాడు. స్వరం వచ్చిన వైపు చూశాడు.

ఆమె కళ్లల్లో నిర్మలత్వం.

ఆమె పెదవులపై చిరుదరహాసం.

ఆమె మొహంలో ముగ్ధత్వం.

అవన్నీ అతన్ని ఆకట్టుకున్నాయి.

ఆమె నవ్వుల్లో రతనాలూ, ఆమె కళ్ళల్లో వైఢూర్యాలు, ఆమె చెంపల్లో కెంపులకోసం వెదికాడు.

ఆమె నవ్వినప్పుడు రతనాలు కనిపించకపోయినా, తెల్లగా రతనాలులా మెరుస్తున్న పలువరుస కనిపిస్తుంది.

ఆమె కళ్ళల్లో అటు ఇటు తిరుగుతున్న కనుపాపలు వైఢూర్యాలకంటే విలువైనవి. ఆమె చెంపల్లో కెంపులు దొరకలేదు అతనికి. ఆమె సిగ్గుపడినప్పుడుకదా కెంపులు దొరికేది అనుకొని ఆమె వెనుక నడవడం ప్రారంభించాడు.

ఇప్పుడు అతను ఆమె పక్కనే నడుస్తున్నాడు.

ఆమె ఒకసారి అతనివైపు చూసింది. కనులు కలుసుకున్నాయి.

ఆమె తనకి అంతదూరంలో ఉంటే కనులు ఎలా కలుసుకుంటాయో! కనులు కాదు కలుసుకున్నది చూపులు. ఒకరి కంటి నుంచి చూపు విల్లుని వీడిన అంబువలె, పిస్టల్‌ని వదిలిన బుల్లెట్‌వలె ఇంకొకళ్ల కళ్లలోకి దూసుకుపోయిందన్నమాట.

ఆమెతోపాటే ఆమె పక్కనే నడుస్తున్నాడు ప్రదీప్. ఆమె తన పక్కనున్న అమ్మాయితో మాట్లాడటం ఆపేసింది.

"మగవాళ్లకి ఇదేం మాయదారి రోగమో" అని పక్కనున్న అమ్మాయి గొణుక్కోవడం స్పష్టంగా కాకపోయినా అర్థమయిపోయేలా వినిపించింది.

తనని ఒక్కడినే కాకుండా మొత్తం మగజాతినే తిట్టడంతో అతనికి అంతగా బాధకలగలేదు. అలా తన పక్కనుంచి సైకిల్‌మీద రాసుకుంటూ వెళ్ళిపోయినవాడిని, ఆమె పక్కనుంచి అంతే వేగంగా దూసుకుపోయిన స్కూటర్‌వాలాని, అమెరికా ప్రెసిడెంట్‌ని, ఇండియా ప్రైమ్‌మినిస్టర్‌ని, ఆంధ్రప్రదేశ్ మినిష్టర్‌ని, మానవజాతిని సృష్టించిన ఆ బ్రహ్మని అందరినీ కలిపి తిట్టడంతో అతడికి బాధకలగలేదు.

అలా తనపక్కన ఎవరో అపరిచితుడు నడవడం కామన్ అన్నట్టుగా ప్రదీప్‌ని పట్టించుకోకుండా నడుస్తోంది ఆ అమ్మాయి.

ఆమె తనని అసలు పట్టించుకోకపోవడం అతణ్ని నిరుత్సాహానికి గురిచేసింది. ఆమె తనవైపు చూసే క్షణంకోసం ఆశగా ఎదురుచూస్తున్నాడు. అలా చూసిన మరుక్షణం తన చూపులతో ఆమె చూపులని బంధించాలని అతడి సంకల్పం.

రెండు నిముషాలు ఎవరూ ఏమీ మాట్లాడకుండా గడచిపోయాయి. ఇంక లాభంలేదు ఆమెతో మాట్లాడేయాలన్న నిర్ణయానికొచ్చాడు ప్రదీప్.

"ఎక్స్‌క్యూజ్‌మి" అన్నాడు ప్రదీప్. కాని ఆ మాటలు అతడికే సరిగా వినబడలేదు.

"ఈ జిడ్డు మనల్ని వదిలేలాలేదు. సరే గానీ, ఇంతకీ రేపు సినిమాకి వెళదామా, వద్దా చెప్పు" అంది అవతల అమ్మాయి.

జిడ్డు అన్నపదం వినబడగానే అతడి అహం దెబ్బతింది.

"మీపక్కనున్న ఆ బొద్దుగారి పేరేమిటండీ" అని అతను ఆ అమ్మాయిని అడిగినట్టుగా ఊహించుకొన్నాకగానీ అతని అహం సంతృప్తి చెందలేదు.

అతని ఆలోచనలలో ఆమె అన్నమాటలు మెరుపులా మెరిశాయి.

మెదడు కాళ్లకి, పెదవులకి, నాలుకకి ఒకే సారి ఆజ్ఞలు ఇచ్చింది.

కాళ్ళు ఆ అమ్మాయి దగ్గరకి వెళ్లాయి.

పెదవులు- నాలుక కలిసి "మీ పేరేమిటండి" అన్నాయి.

ఆమె అసలు మాట్లాడలేదు. మళ్ళీ అడిగాడు.

"మీకెందుకండి" అంది పక్కన అమ్మాయి.

"మిమ్మల్ని అడగలేదండి" అన్నాడు ప్రదీప్.

"ఆమె మీలాంటి రోడ్‌సైడ్ రోమియోలతో మాట్లాడదు" అటువైపు నుంచి ఘాటైన సమాధానం వచ్చింది.

"ఇదిగో చూడండి... నేను మిమ్మల్ని ఏమీ అనకుండానే మీరు నన్ను చాలా అంటున్నారు. దీసీజ్ టూమచ్!"

"ఏమీ అనకపోవడం ఏమిటి. మా పేర్లు మీకెందుకు?"

"మీపేరు ఎవరడిగారు. ఆమెని ఆమె పేరు అడిగితే మీకెందుకు"?

"మీకు అక్కాచెల్లెళ్ళు లేరా? వాళ్ళని ఎవరైనా ఏడిపిస్తే మీకెలా ఉంటుంది??"

"మీ మొదటి ప్రశ్నకి నా సమాధానం నాకు అక్కాచెల్లెళ్ళున్నారుకానీ వాళ్లకి మీలాంటి స్నేహితులులేరు. ఇక రెండో ప్రశ్న నేను మిమ్మల్ని ఏడిపించడంలేదు" అన్నాడు ప్రదీప్.

"మణీ... నువ్వూరుకో" అంది ఆ అమ్మాయి.

అమ్మాయిలిద్దరూ శ్రీకృష్ణభగవానుడిని స్మరించుకోడానికి కొత్తగా కట్టిన ఆలయంలోకి దారితీశారు. వాళ్ళవెనకే లోపలికి వెళ్లాడు ప్రదీప్.

ఆమె లోపలికి వెళ్లగానే వెనక్కిచూసింది. ఆమెవైపే చూస్తూ లోపలికి వస్తున్న అతని కళ్లల్లో ఆమె ప్రతిబింబం. ఆమె కనుపాపల మీద అతని ప్రతిబింబం ఒకక్షణం మాత్రమే. ఆమె తలతిప్పేసుకుంది.

అక్కడ ఏదో అర్చన జరుగుతోంది. కొందరు భక్తిగీతాలు పాడుతుంటే ఒకతను నెత్తిమీద హారతిపళ్ళెంపెట్టుకొని అటుఇటు ఊగుతున్నాడు. డిస్కోడాన్స్ కంటే బాగుందే అనుకున్నాడు ప్రదీప్.

అమ్మాయిలిద్దరూ భక్తిగీతాలు పాడుతున్న వాళ్లతో కలిసిపోయారు. ప్రదీప్ దేవునివైపే తదేకంగా చూస్తున్నట్టు చూస్తూ ఆమెవైపు చూస్తున్నాడు.

మనల్ని ఎవరైనా గమనిస్తున్నారనిపిస్తే మనకి తెలియకుండానే అంటే మెదడు ఆజ్ఞాపించకుండానే వాళ్ళు గమనిస్తున్నారో లేదోనని వాళ్ళవైపు చూస్తాం. అది సహజం. ఆ అమ్మాయి కూడా అలాగే ప్రదీప్ వైపు చూసింది తనవైపు చూస్తున్నాడో లేదో తెలుసుకోడానికి అన్నట్టు.

అంతే...

చూపులు కలుసుకున్నాయి. కలుసుకొని రిఫ్లెక్ట్ అయిపోయాయి.

అవే ప్రేమించుకున్నవాళ్ళయితే ట్రాన్స్‌మిట్ అయిపోయి ఆమె చూపులు అతని కళ్ళనుంచి మెదడులోకి, అతని చూపులు ఆమె కళ్ళనుంచి మెదడులోకి వెళ్ళిపోతాయి. అదేనేమో బహుశా ప్రేమ సందేశం అంటే.

ఇద్దరూపైకి లేచారు. ఒక పక్కగా కూర్చున్న పెద్దమనిషి దగ్గరకి వెళ్లారు. ఆయన పక్కనే ప్రదీప్ నిలబడి ఉన్నాడు.

"మీ నాన్నగారు రాలేదేమమ్మా?" అడిగారాయన.

"ఊరెళ్ళారండి"

"ఎప్పుడొస్తారు?"

"ఈరోజు సాయంత్రం రావచ్చండి"

"మీ నాన్నగారొస్తే దేవి రమ్మందని చెప్పమ్మా"

"అలాగేనండీ" అంది ఆమె.

"ప్రసాదం తీసుకున్నావా?"

"ఇంకా దేవిదగ్గరకి వెళ్లలేదండి" అంది ఆమె.

దేవి భక్తజన సంఘం సభ్యులకి మాత్రమే ప్రతిరోజు దేవిని దర్శించుకునే భాగ్యం కలుగుతుంది.

"వెళ్ళిరామ్మా" అన్నారాయన.

అమ్మాయిలిద్దరూ దేవి దగ్గరకి వెళ్లారు. వాళ్ల వెనకాలే లోపలికి వెళ్ల ప్రయత్నించాడు ప్రదీప్. అక్కడ కూర్చున్నాయన ప్రదీప్‌వైపు అనుమానంగా చూస్తున్నాడు మొదటినుంచి. లోపలికి వెళ్లాలని ప్రయత్నించగానే ఆపేసి

''ఎవరు బాబూ నువ్వు?'' అని అడిగారు.

ఏంచెప్పాలో కొద్దిక్షణాలవరకు తేల్చుకోలేక అలా నిలబడిపోయాడు.

''ఇక్కడ ఎప్పుడూ కనబడకపోతే అడిగాను నాయన'' అన్నారాయన.

''ఇదే మొదటిసారండి రావడం'' అన్నాడు ప్రదీప్.

శ్రీకృష్ణభగవాన్ భక్తజన సంఘంలో సభ్యులయితేనే లోపలికి వెళ్ళడానికి అర్హులు. దేవిని దర్శించుకోవాలనుకుంటే సోమవారం రాబాబూ. ఆరోజు దేవి సామాన్య ప్రజల సమస్యలని పరిష్కరించడానికి అందరితో మాట్లాడుతుంది''

''అయితే ఇప్పుడు...''

''కుదరదు బాబూ'' అని లోపలికి ఎవరో వెళుతుంటే అతడి దగ్గరకి వెళ్లారాయన. ఆయన కూర్చున్నచోటుకి కొద్దిగా అవతల నిలబడ్డాడు ప్రదీప్ వాళ్ళిద్దరికోసం వేచిచూస్తూ



ఆయన మళ్ళీ వెనక్కి వచ్చి తనస్థానంలో కూర్చున్నారు.

లోపలికి వెళ్ళినవాళ్ళు ఎంతకీరాకపోవడంతో దేవిగురించి, తాను విన్న వాటి గురించి అడుగుదామని ఆయన దగ్గరకి వెళ్లబోయాడు. సరిగా అదే క్షణంలో ఎవరో ఒక వ్యక్తి పరిగెత్తుకు వచ్చి ఆయన కనబడగానే అక్కడ ఆగి ఆయాసంతో, ''నిన్నొచ్చిన కుర్రవాడు పాముకాటేసి మరణించాడంట'' అన్నాడు. ఆయన ఆ మాటలు వినగానే అంతకు ముందు ఇద్దరమ్మాయిలు వెళ్లిన గదిలోకి స్పీడ్‌గా వెళ్ళిపోయారు.

పాము కాటేసి మరణించడం ఏమిటో అర్థంకాలేదు ప్రదీప్‌కి. పరిగెత్తుకొని వచ్చిన కుర్రవాడినే అడిగాడు. ''పాము కాటేసి ఎవరు మరణించారంటున్నారు?'' అని.

ఆ కుర్రవాడికి ఆ విషయం చెప్పడం ఎంతో ఆనందం కలిగిస్తున్నట్టుగా ఉంది. మొహంలో ఆనందఛాయలు. చెప్పడం మొదలుపెట్టాడు, ''నిన్న ఓ కుర్రవాడొచ్చాడు ఇక్కడికి. దేవికి వ్యతిరేకంగా ఏదోచేద్దామని వాడి ప్రయత్నం. దేవి ఎంత వారిస్తున్నా వినిపించుకోకుండా ఆవిడని దూషించాడు. ఆవిడకి కోపంవచ్చి 'నువ్వు పాముకాటుకి గురై మరణిస్తావ్' అన్నారు. ఈరోజు అలాగే పాముకాటుకి గురై మరణించాడు... మహిమగల దేవత'' అన్నాడు వాడు.

ప్రదీప్ ఆశ్చర్యంగా విన్నాడు.

''అసలు ఎవరు ఈ దేవి?''

అడిగాడు ప్రదీప్ ఆ చావు కబురు తెచ్చిన కుర్రవాడిని.

''అమెరికానుంచి ఇహలోక బంధాలన్నిటిని తెంచుకొని, మాకోసం ఇక్కడికి వచ్చారు''

''అమెరికానుంచి వచ్చారా?''

''అవును.''

''దేవిని దర్శించుకోవచ్చా?''

''ఈ సంస్థలో సభ్యుడిగా చేరితేనే దేవి దర్శనం''

''ఎలా సభ్యుడిగా చేరడం''

''ఇప్పుడు ఇక్కడ కూర్చున్నారే ఆయనని అడిగితే చెబుతారు''

''ఈ సంస్థ పేరేమిటి?''

''శ్రీకృష్ణభగవాన్ దేవి భక్తజనసంఘం''

అప్పుడే లోపలనుంచి ఇద్దరమ్మాయిలు బయటకు వచ్చారు.

''థాంక్స్... చాలా విషయాలు చెప్పావు'' అని ఆ ఇద్దరమ్మాయిల వెనుక బయలుదేరాడు.

ఇంకొద్దిసేపటి తరువాత అక్కడ కూర్చున్న ఒకాయన భక్తజనులందరిని దగ్గరకు పిలిచి నిన్న జరిగిన విషయం ఎవరికీ చెప్పొద్దనీ, పోలీసులతో మనకి లేని పోని వ్యవహారాలు వద్దనీ చెప్పి పంపేసాడు.

అప్పటికే అక్కడ జరిగిన విషయం ప్రదీప్‌కి తెలిసిపోయింది. చెప్పిన కుర్రవాడు కామ్‌గా ఊరుకొన్నాడు.

అమ్మాయిలిద్దరి వెనుక వెళుతూ ఆ అమ్మాయితో మాట్లాడించడానికి శతవిధాల ప్రయత్నించి విఫలుడయ్యాడు.

చివరకి ''మీరు మూగవారా, మాటలు రావా, చెవుడు కూడా వుందా?'' అని, దానికీ సమాధానం రాక ఊరుకున్నాడు.

మనం మాట్లాడకపోతే ''అరచీ అరచీ అతనే ఊరుకుంటాడని చెప్పానుగా'' అంది లోగొంతుకతో పక్కనున్న అమ్మాయితో.

ఇద్దరమ్మాయిలు ఒక ఇంటిలోకి వెళ్లారు. ప్రదీప్ ఆ ఇంటిని గుర్తు పెట్టుకొని రూమ్ వైపు బయలుదేరాడు.

ప్రదీప్ వెళ్లిపోగానే ఇద్దరు నవ్వుకుంటూ బయటకొచ్చి తమతమ ఇళ్లవైపు వెళ్లిపోయారు.

★ ★ ★

మర్నాడు !

ప్రదీప్ నిన్న అమ్మాయిలిద్దరు వెళ్లిన ఇంటి దగ్గరకి వెళ్లాడు. తలుపులు దగ్గరకు వేసి ఉన్నాయి. పావుగంట తరువాత మళ్లీ వెళ్లాడు. అప్పుడు తలుపులు తీసే ఉన్నాయి కాని ఎవరూ కనిపించలేదు.

ప్రదీప్‌కి ఒక ఆలోచన వచ్చింది. వెంటనే రూమ్‌కెళ్లి తన సర్టిఫికెట్స్ తీసుకుని వచ్చాడు.




తన ఐడియాగాని పారితే ఆ అమ్మాయికి తను ట్యూషన్ చెప్పొచ్చు. తర్వాత ఏం కష్టం వుండ దు.

ఇంటి తలుపు కొట్టాడు. ఒక బట్టతలాయన వచ్చాడు.

ఆయన బయటకు రాగానే మొహాన్ని దీనంగాపెట్టి "నమస్కారం సర్" అన్నాడు. 'నమస్తే... ఏం కావాలి?" అన్నారాయన.

"నాపేరు ప్రదీప్ సర్. ఎంయస్సీ పాస య్యాను సర్. మీ ఇంటిలో ఇంటర్మీడియట్ కాని, బియస్‌సి కాని ఎవరైనా ఉంటే ట్యూషన్ చెబుతానండి. ఇవిగోండి నా సర్టిఫికెట్లు" అన్నాడు ప్రదీప్. అతను నిన్నే కనిపెట్టాడు అమ్మాయిలిద్దరూ సైన్సు గ్రూపేనన్న విషయం. బోటనీ, జువాలజీలలో ఏదైనా ఫర వాలేదు. కెమిస్ట్రీ, ఫిజిక్స్ అయితేనే కష్టం అనుకున్నాడు.

ఆయన సర్టిఫికెట్లు అన్నీ చూసి, "మా ఇంట్లో పదో క్లాసు చదువుతున్న కుర్రవాడున్నా డు. వాడికి ట్యూషన్ చెబుతావా?" అన్నారా యన.

ప్రదీప్‌కి పిచ్చి కోపం వచ్చింది. ఇంట్లో అమ్మాయిని వుంచుకొని, ఆ అమ్మాయికి చెప్ప మనకుండా టెన్త్ వాడికే చెప్పమంటున్నాడు. తన కోపాన్ని తనలోనే అదుముకుంటూ "మీకు ఇంటర్మీడియట్ కాని, బియస్సీకాని చదువుతు న్న అబ్బాయిలుకాని, అమ్మాయిలుకాని లేరా?" అన్నాడు అమ్మాయిలు అన్నది వత్తి పలుకుతూ.

"ఎవరూ లేరు" అన్నాడాయన.

అప్పుడు వచ్చింది ప్రదీప్‌కి- ఆ అమ్మాయి ఇల్లు ఇది కాదేమోనని, తనని తప్పు పట్టించ డానికే ఈ ఇంట్లోకెళ్లిందేమోనన్న అనుమానం.

"సారీ సర్ చెప్పను" అని బయటకు వచ్చేసా డు.

అప్పుడే ఆ ఇంటివైపు వస్తూ కనిపించింది ఆ అమ్మాయి. పంజాబీ డ్రస్సులో ఆ అమ్మాయి అందం మరింత ఇనుమ డించింది. కన్నార్పడం మరచిపోయాడు ఒక్క క్షణం. ఆ అమ్మాయికి కనిపించకుండా ఇంటి పక్కకి వెళ్ళిదాక్కున్నాడు.

తలుపులు వేద్దామని బయటకు వచ్చిన బట్టతలాయనకి పంజాబీడ్రస్సులో అమ్మాయి కనిపించడంతో "ఏంటమ్మా ఇలా వచ్చావు" అని లోపలకి నడిచారు.

"నాన్నగారు మిమ్మల్ని రమ్మని చెప్పారు" అంది ఆ అమ్మాయి.

వాళ్ళు మాట్లాడుతున్నకిటికీ దగ్గరే ఉన్న ప్రదీప్‌కి వాళ్ళ మాటలు క్లియర్‌గా వినిపిస్తు న్నాయి.

"మీ నాన్న ఎప్పుడొచ్చారు ఊరునుంచి?"

"నిన్నరాత్రి వచ్చారండి"

"ఎందుకు రమ్మన్నారు?"

"ఏదో సంఘం గురించి మాట్లాడాలంట"

"ఇప్పుడే రమ్మన్నారా?"

"అవునంకుల్"

"నువ్వు ఇప్పుడు వెళుతున్నది ఇంటి కేనా?"

"అవునంకుల్"

"ఇప్పుడే వచ్చేస్తానని చెప్పమ్మా" అని లోపలకి వెళ్ళిపోయాడాయన. ఆ అమ్మాయి బయటకు వచ్చింది. తన ఇంటి వైపు మందగమనముతో వెళుతోంది.

ఇంటిచాటునుంచి బయటకు వచ్చాడు ప్ర దీప్. ఆ ఇంటివైపు చూసాడు. నేమ్‌ప్లేటు మీద నాగేశ్వరరావు అసిస్టెంట్ ఇంజనీరు అని ఉంది. చిన్న నిట్టూర్పు వదిలాడు.

ఇంజనీర్లు, డాక్టర్లు, పొలిటిషియన్లు అంద రు భక్తజనులే. వీళ్ళ చదువులు ఎందుకో అనిపించింది.

ఈసారి ఆ అమ్మాయికి తెలియకుండా జాగ్రత్తగా ఫాలో అవుతున్నాడు ప్రదీప్.

ఆ అమ్మాయి సరాసరి తన ఇంటిలోకి వెళ్ళింది. పెద్దఇల్లే.

నేమ్‌ప్లేటు మీద కృష్ణారావ్, యం.డి. అని ఉంది.

ఈసారి నిట్టూర్చడానికి కూడా శక్తి లేక అలాగే ఉండిపోయాడు. ఇంటికొసారి వెళ్ళి ఫ్రెష్ అయి మళ్ళీవద్దామని ఇంటికి బయలు దేరాడు. అరగంట తరువాత అదే ఇంటి

ముందు ఆగాడు. సర్టిఫికెట్స్ అన్నిటిని సర్దుకున్నాడు. ఇంటర్వ్యూకి వెళ్ళేటప్పుడు కూడా అంత టెన్షన్ అనుభవించలేదు ప్రదీప్.

గేటు తీసుకొని లోపలకి వచ్చాడు. "నిన్నేదో గొడవైందంట దేవి దగ్గర" అన్నమాటలు వినబడటంతో ఆగిపోయాడు.

"అవును... దేవి అన్యాయంగా పాముకాటుకి మరణించాడు ఆ కుర్రవాడు ఈ విషయం ఎవరితోను చెప్పొద్దు అన్నాడంట రాధాకృష్ణ"

"అవును... పోలీసులతో గొడవెందుకని"

"అంతేనంటావా"

"ఇంకేముంటుంది"

"దేవికి తెలియకుండా అతగాడు గూడుపుఠాణీ ఏమైనా నడుపుతున్నాడేమో?"

"అలాంటిదేంలేదు కాని. దేవి నన్ను సంఘానికి పదివేలు కట్టమంది"

"నన్నూ కట్టమంది. నువ్వు కడుతున్నావా?"

"కడుతున్నాను. ఆమెమాటకి ఎదురుచెపితే పుట్టగతులుండవు"

"నేనూకడతాను" అన్నారు కృష్ణారావు.

ప్రదీప్ కి దేవి విషయం ఒక పెద్ద మిష్టరీలా ఉంది. తనువెంటనే నరేంద్రకి ఈ విషయం చెప్పాలి అనుకున్నాడు.




చాలామంది గుమికూడి ఉన్నారక్కడ. ప్రతి వ్యక్తి మదిలోను ఒకే ఆలోచన "ఎవరీ వ్యక్తి" అని.

వాళ్ళ మధ్య ఓ శవం "నల్లగా", ప్రతి నరంలోనూ విషం ఎక్కిందేమో నల్లగా ఉంది శవం. నోటి నుంచివచ్చిన నురగ ఎండిపోయింది. చేతిలో పర్సు బిగుసుకుపోయి ఉంది.

ఇంతలో గుంపును చెదరగొడుతూ వచ్చారు పోలీసులు.

తరువాత జరగాల్సినవన్నీ రొటీన్‌గా జరిగిపోయాయి.

అక్కడనుంచి అందరూ తప్పుకున్న తరువాత ఒకేఒక వ్యక్తి మిగిలిపోయాడు ఆ ప్రదేశాన్ని పరిశీలిస్తూ.

అలా తిన్నగా వెళితే ఏరొస్తుందిగదా! ఇటువంటి వేళప్పుడు అటువైపు ఎందుకు వెళ్లినట్టు అనుకొని, పోలీస్‌స్టేషన్‌వైపు వెళ్లాడు.

అప్పటికే చచ్చిపోయిన కుర్రవాడి తల్లిదండ్రులు అక్కడకి వచ్చేశారు. పోస్టుమార్టం అయిన తరువాత శవాన్ని ఇస్తారని ఏడుస్తూ ఎదురు చూస్తున్నారు.

వాళ్ల దగ్గరకి వెళ్లాడు అతను.

"చనిపోయింది మీ అబ్బాయేనా?" అడిగాడతను.

"అవును బాబూ" అన్నారు కుర్రవాడి తండ్రి.

"మీ అబ్బాయి పేరు?"

"సుకుమార్ బాబు. బియస్సీ చదువుతున్నాడు"

"ఐసీ" అని ఇన్‌స్పెక్టర్ దగ్గరకు వెళ్లి "హలో ఇన్‌స్పెక్టర్" అన్నాడు.

"హలో... మీరు?" అని ఆగిపోయాడు అతను.

"నేను జర్నలిస్టుని. నాపేరు నరేంద్ర"

"గ్లాడ్ టు మీట్ యు. ఐయామ్ దినేష్"

"ప్లీజ్ టు మీట్‌యు. ఆ కుర్రవాడు ఎలా చనిపోయాడని మీ ఉద్దేశం?"

"మీకు తెలుసుకదా అటువైపు పాములెక్కువని. పాము కాటుకి చనిపోయుంటాడు, ఎనీహౌ పోస్ట్‌మార్టమ్ రిపోర్టు వచ్చింతరువాత స్పష్టంగా తెలుస్తుంది"

"థాంక్యూ" అని బయటకు వచ్చేశాడు నరేంద్ర.

మళ్లీ సుకుమార్ చనిపోయిన దగ్గరకి వెళ్లాడు.

సుకుమార్ చనిపోయేముందు పర్సు ఎందుకు తీశాడు?

పోలీసులకి పర్సులో డబ్బు, అతని అడ్రస్సు తప్పించి ఇంకేమీ దొరకలేదు. "పర్సు ఎందుకు తీశాడు" అన్న విషయం గురించి తీవ్రంగా ఆలోచిస్తూ ఆ ప్రదేశాన్ని పరిశీలిస్తున్నాడు.

అతనికి తెలుసు పోలీసులు పాము కాటుకి చనిపోయాడని ఫైలు మూసేస్తారని. కానీ పాముకాటుకే సుకుమార్ మరణించలేదనీ, ఇంకేదో ఉందనీ అనిపిస్తోంది అతనికి.

మరికాసేపట్లో అతని శ్రమ ఫలించింది. అక్కడ ముళ్లచెట్టు కొమ్మకు తగులుకొని ఒక కాగితం కనిపించింది. అందులో-

సుకుమార్!

ఏటికెళ్లే దారిలో మూడు మామిడి చెట్ల నీడలో నిలబడు నాకోసం.

-దేవి.

అనివుంది.

చదివిన తరువాత ఒకసారి చుట్టూ చూసాడు. అతడిప్పుడు మూడు మామిడి చెట్ల నీడలో ఉన్నాడు. నరేంద్రకిప్పుడిప్పుడే పరిస్థితి అర్థమవుతోంది.

ఈ దేవి అనబడే వ్యక్తి ఎవరోగానీ సుకుమార్ని ఇక్కడికి రమ్మంది. సుకుమార్ ఈ కాగితాన్ని పర్సులో పెట్టుకొని ఇక్కడికి వచ్చి ఉంటాడు. ఇంకోసారి అదే స్థలమో కాదో తెల్సుకోడానికి పర్సుతీసి కాగితం చూసుంటాడు. కరెక్టుగా అప్పుడే పాము కాటువేసివుంటుంది. భయంతో కాగితాన్ని వదిలేసివుంటాడు. అది ఎగిరి ఇక్కడ పడివుంటుంది అనుకొని కాగితాన్ని జేబులో పెట్టుకున్నాడు.

ఎవరీ దేవి, తెల్సుకోవాలి అనుకొన్నాడు.

★ ★ ★

నరేంద్ర సుకుమార్ ఇంటికి వెళ్లాడు. ఆ ఇల్లు బంధుజనాలతో నిండిపోయి ఉంది. సుకుమార్ నాన్నగారు డీలాపడిపోయి ఒక మూలకూర్చొన్నారు. చుట్టాలు ఆయన వద్ద కూర్చొని స్వాంతనవచనాలు పలుకుతూ జరగవలసినది చూడమంటున్నారు.

సుకుమార్ అమ్మగారి దుఃఖాన్ని ఎవరు ఆపలేకపోతున్నారు.

అటువంటి పరిస్థితులలో ఏంచెయ్యాలో అర్థంకాక బయటే నిలబడిపోయాడు నరేంద్ర. జరగవలసిన కార్యక్రమాలనే సరిగచూడలేకపోతున్న ఆయనని తన ప్రశ్నలతో వేధించడం మంచిదికాదని మిన్నకున్నాడు.

బయటకు వచ్చిన సుకుమార్ తమ్ముడిని పిలిచి- "మీ అన్నయ్య ఫ్రెండ్స్‌లో ఒకరి పేరు చెప్పమ్మా" అన్నాడు నరేంద్ర.

"కృష్ణమూర్తి" అన్నాడు ఆ చిన్నపిల్లాడు.

"ఇల్లు చూపెడుదువుగానివస్తావా"

"పదండి" అని తనకూడా తీసుకొనివెళ్ళి కృష్ణమూర్తి ఇంటికి చేర్చాడు.

"కృష్ణమూర్తి, కృష్ణమూర్తి" అని పిలిచాడు నరేంద్ర.

"నేను వెళ్ళొస్తానండి" అని వెళ్ళిపోయాడు సుకుమార్ తమ్ముడు.

ఒక వ్యక్తి బయటకు వచ్చాడు. అప్పటివరకు ఏడ్చినట్టు అతనికళ్ళు ఎర్రగా ఉన్నాయి. బుగ్గలపై నీటిచారికలు.

"మీరేనా కృష్ణమూర్తి?" అడిగాడు నరేంద్ర.

"అవునండి" అన్నాడు ఆ వ్యక్తి. అంతవరకు ఏడ్చి ఉన్నాడేమో అతని కంఠం బొంగురుపోయింది.

"నాపేరు నరేంద్రండి. జర్నలిస్టుని"

"ఏం పనిమీదవచ్చారు"

"సుకుమార్ మీ క్లోజ్‌ఫ్రెండ్ అనుకుంటాను?"

"అవునండి"

"మీరు అతని గురించి నాకు కొన్ని విషయాలు చెప్పాలి"

"ఏ విషయాలు"

"అతను చనిపోకముందు, అంటే ఈమధ్య జరిగిన విషయాలు"

"అవి మీకెందుకు?" ఆశ్చర్యంగా అడిగాడు కృష్ణమూర్తి.

''సుకుమార్ మరణం యాధృచ్ఛికంగా జరిగిందికాదనీ. ఎవరోకావాలని పాముకాటుకి గురిచేసి చంపి ఉంటారని అనుమానం. వాళ్ళెవరో తెలియాలంటె ''మీ యొక్క కోఆపరేషన్కావాలి''

''వాడికోసం నేను ఏమిచేయమన్నా చేస్తానండి''

''దేవి ఎవరోతెలుసా?''

''తెలుసు... మా ఫ్రెండ్''

''ఆమె ఎటువంటిది''

''అంటే'' సరిగా అర్థంకాక అడిగాడు కృష్ణమూర్తి.

''ఆమెకి- సుకుమార్కి ఎటువంటి సంబంధాలు ఉండేవి. అంటే బాగుండేవారా లేదా అని''

''దేవి, నేను ప్రేమించుకున్నాం. సుకుమార్కి ఆమెకి మంచిసంబంధాలే ఉండేవి ఎందుకలా అడుగుతున్నారు''

''మీకు మూడు మామిడి చెట్ల నీడ గురించి తెలుసా''

''నేను, దేవి ఎప్పుడు అక్కడే మాట్లాడుకుంటాం''

''మీరు దేవిని ప్రేమించడం, ఆమెతో సుకుమార్ ఎలా ప్రవర్తించేవాడు మొదలైనవన్ని చెపుతారా?'' అడిగాడు నరేంద్ర.

★ ★ ★

''నెలరోజుల క్రితం, నేను సుకుమార్ కాలేజీ నుంచి ఇంటికొస్తున్నాం. దారిలో ఒకమ్మాయి కనిపించింది. ఆ అమ్మాయిని చూడగానే నాకు ఆ అమ్మాయిఎంతో నచ్చింది. అదే విషయం సుకుమార్తో చెప్పాను. ఆఅమ్మాయి అప్పటికే సుకుమార్కి తెలుసు. వాళ్ళిద్దరు చిన్నప్పటి ఫ్రెండ్స్.

నన్ను వెంటనే ఆమె దగ్గరకి తీసుకువెళ్ళి పరిచయం చేశాడు.

ఆమె దగ్గరనుంచి మరింత అందంగా కనిపించింది. ఆమె రూపు నా మదిలో గాఢంగా హత్తుకుపోయింది. మా ఇద్దరిని పరస్పరం పరిచయం చేశాడు సుకుమార్.

వినమ్రతతో నమస్కరించింది ఆమె. పేరు తనేచెప్పింది దేవి అని.

కాని... అప్పటికే ఆ అమ్మాయికి చాలా మంది ఫ్రెండ్సు ఉంటారనిపించింది. వాళ్ళందరిలో నన్ను ఆమె ప్రత్యేకంగా చూడాలంటే నేను ఏదో ఒకటి చేయాలి. ఆమెతో నడుస్తూ ఏంచేయాలి అని ఆలోచించాను ఆఖరికి లెక్కల్లోకిదిగిపోయాను.

''మీరు మేథమెటిక్స్ కదా ఇంటర్లో'' అని అడిగాను

''అవునండి''

''ఒక వ్యక్తి ఆగస్టు పదిహేనున గాంధీజి బొమ్మదగ్గర రెండుపూలుంచాడు. తరువాత రోజు వచ్చేసరికి అక్కడ నాలుగున్నాయి. ఆ తరువాత రోజుకి ఎనిమిది ఉన్నాయి. నాలుగో రోజుకి పదహారు, అయిదోరోజుకి ముప్పైరెండు ఉన్నాయి. యాభయ్యోవరోజుకి అక్కడ 250 పూలుంటే అందులో సగం ఏ రోజున ఉంటాయి'' అని అడిగాను.

రెండు క్షణాలు ఆలోచించి-'' ఇరవై ఐదవ రోజున అంది''

''దీనికి రెండుక్షణాలు సమయం సరిపోదండి. ఇంకోసారి ఆలోచించి డేట్తో సహా చెప్పండి'' అన్నాను.

''నువ్వు చెప్పుకుమార్'' అడిగింది సుకుమార్ని.

''వాడు చెప్పడు. మీరే చెప్పండి'' అన్నాను.

''అది చెప్పలేవా?'' అన్నాడు సుకుమార్.

కాసేపు తీవ్రంగా ఆలోచించింది. ఆమె మొహంలోని కళ చెప్పింది ఆమెకి ఆన్సర్ వచ్చేసిందని.

''నాకు ఎప్పుడు సగం ఉంటాయో తెలిసిందికానీ డేట్ తెలుసుకోవాలంటే కాస్తకష్టం... లెక్కపెట్టుకోవాలి'' అంది.

''లెక్కపెట్టుకొనేచెప్పు'' అన్నాడు సుకుమార్.

''పూవుపెట్టిన నలభైతొమ్మిదో రోజున అంటే సెప్టెంబర్ ఇరవై రెండున యాభయ్యవ రోజున ఉన్న పూలల్లోసగం ఉంటాయి.

ఆమె మొహంలోని ఇంటరెస్ట్ని చూడగానే ఇంకోటి అడగడానికి రడీ అయ్యాను. ''హెూట

ల్‌లో టి ఎక్కడుంటుంది?'' అని అడిగాను.

''కష్టమర్ ఎదుట''

''కాదండి''

''టీతయారుచేసే చోట'' అంది.

''కాదండి''

''ఇంకెక్కడ ఉంటుంది?''

''హోటల్‌లో వెదుక్కోండి దొరుకుతుంది'' అని- ''పోని ఇది చెప్పండి- మామూలుగావున్నా తిరగేసి ఉన్నా ఒకే విలువకలిగి అడ్డంగా ఉంచితే అనంతం అయ్యేది ఏంటో చెప్పండి'' అన్నాను.

'ఏంటండీ... మళ్ళీ చెప్పండి?''

రిపీట్‌చేసాను.

''ఏంటో తెలియట్లేదండి''

''ఇంటికి వెళ్ళి డీప్‌గా ఆలోచించండి. ఏంటో తెలిసిపోతుంది''అన్నాను. తరువాత మామూలు విషయాలు మాట్లాడుకొన్నాం.

తరువాతరోజు ఆదివారం. ఎనిమిది గంటలకి నాదగ్గరకొచ్చి- ''ఈరోజు పిక్‌నిక్ వేసుకుంటున్నామురా'' అన్నాడు సుకుమార్. ''ఎవరెవరు'' అడిగాను.

''నువ్వు, నేను, దేవి'' అన్నాడు.

''దేవి కూడా వస్తుందా?''

''వస్తుందా అంటావేంటిరా. ఈ పిక్‌నిక్ తనే అరేంజిచేస్తే''

ఆ మాటలు వినడంతో నా మనసు దూదిపింజలాగాలిలో ఎగిరిపోయింది.

ముగ్గురం వెళ్ళాం. నేను ప్లేయింగ్‌కార్డ్సు నాతోపాటు తెచ్చుకున్నాను.

అక్కడకి వెళ్ళగానే ''హోటల్‌లో వెదుక్కుంటే 'టీ' మధ్యలో దొరికిందికాని రెండవది ఏమిటో ఎంతకి తెలియలేదు'' అంది.

''రెండవది ఎనిమిది''

''ఎలా?''

''ఎనిమిదిని తిరగేసినా ఎనిమిదే. అదే అడ్డంగా ఉంచారనుకోండి అనంతం అవుతుంది అంటే ఇన్‌ఫినిటి అవుతుంది'' అని ∞ ఫిగర్‌నివేసాను.

8→ తిరగేసిన తరువాత - 8→ అడ్డంగా వుంచితే → ∞ - ఇన్‌ఫినిటి. అని వితదీసి కూడా చెప్పాను.

''కరెక్టండి'' అంది.

''మీకు ప్లేయింగ్ కార్డ్సు వచ్చా?''

''రాదండి''

''సర్లెండి... ప్లేయింగ్‌కార్డ్స్‌తో మీకొక కొత్త ఆటనేర్పుతాను'' అని ప్లేయింగ్ కార్డ్స్‌తీసుకున్నాను.

''ఏమాట?''

''డాంకీ- ఆట''

''ఎలా ఆడతారు ఆట?''

''పేకలతోనే. మొత్తం కార్డ్సులో నుండి జోకర్ తీసెయ్యాలి. మిగిలినవి యాభైరెండు ఉంటాయి. వాటిని తీసుకొని రెండు భాగాలు చేయాలి. సగంసగం చేయగలిగితే అంటే ఇరవైఆరు, ఇరవైఆరుగా విడగొట్టగలిగితే ఆటగెలిచినట్టు. ఇరవై అయిదు, ఇరవైఏడుగా విడగొడితే, డాంకీ అయినట్టు ఇరవైనాలుగు, ఇరవై ఎనిమిదిగా విడగొడితే ఏమ్‌కీ అయినట్టు, ఇరవైమూడు, ఇరవైతొమ్మిది తీస్తే మంకీ అయినట్టు''

''ఏమ్‌కీ అంటే ఏమిటి?''

''AMKEY అంటే ఏన్‌సియెంట్ మంకీ అని''

''సరే... ఆడదాం'' అంది దేవి.

పేకని కలిపి మధ్యలో ఉంచాను. దేవీ డాంకీ అయింది. నేను డాంకీ అయాను. సుకుమార్‌కరెక్టుగా తీసాడు.

మధ్యాహ్నం వరకు ఆడుకున్నాం. క్యారియర్‌లో తెచ్చుకున్న టిఫిన్ తినేసాము.

''బోర్‌గావుందండి'' అంది దేవి.

''అయితే పా.చి.అ.ఆ ఆడదామా?''

''పా.చి.అ.ఆ. అంటే''

''పాటచివర అక్షరం ఆట. దీన్నే అంత్యాక్షరి ఆట అనికూడా అంటారు. నేనోపాట పాడాననుకోండి. ఆపాట చివరి అక్షరంకాని అక్షరంఆగుణింతాలలో ఏదో ఒక అక్షరం మొదట వచ్చే పాట మీరు పాడాలి. మీపాట చివరి అక్షరంతో నేను పాడతాను. సపోజ్, నేను ''సుజాత ఐలవ్యూ సుజాతా నిజంగా ఐలైక్





యు సుజాతా'' అని పాడాను అనుకోండి. మీరు త కాని త గుణింతములో ఏదో ఒక అక్షరంకాని మొదటి అక్షరంగా వచ్చేపాట పాడాలి'' అని చెప్పాను.

''అర్థమైంది... నన్ను పాడమంటారా మీరు పాడతారా ఫస్ట్'' అడిగింది.

''మీరే పాడండి''

కొద్దిసేపు అలా ఆడుకున్న తరువాత-

''మీకు స్వర్గంలో గడిపినట్టుగా ఎప్పుడైనా అనిపిస్తుందా. ఐ మీన్ ఎప్పుడైనా ఆ అనుభూతిని పొందారా?'' అని అడిగాను.

కొద్దిసేపు ఆలోచించి- ''లేదు... మీకెప్పుడైనా అలాఅనిపించిందా?'' అడిగింది దేవి.

''కలిగింది. మీతో గడిపిన ప్రతిక్షణం నాకు స్వర్గంలో గడిపిన అనుభూతిని కలిగిస్తుంది'' అన్నాను.

''సిగ్గుతో దేవి కనురెప్పలు కిందకివాలిపో



యాయి. ఒక్కసారి తలపైకెత్తి నావైపు చూసింది. నేను ఆమెవైపే చూస్తుండటంతో ఇద్దరి కనులు కలుసుకున్నాయి.

నీళ్లు తేడానికి వెళ్లిన సుకుమార్ వచ్చేయడంతో ఇద్దరం మామూలుగా ఉండటానికి ప్రయత్నించాం. ఆ అమ్మాయికి నేను ప్రేమిస్తున్నానని చెప్పేయాలని నిర్ణయించుకున్నాను.

రెండురోజుల తరువాత కాలేజీనుంచి వస్తుంటే కనిపించింది దేవి.

"హలో... ఎలా ఉన్నారు?" అడిగాను.

"బాగానే ఉన్నాను. మీరు?"

"నాకేమండి బ్రహ్మాండంగా ఉన్నాను ఏంటి మీరు అదోలా ఉన్నారు ఎవరినైనా ప్రేమించట్లేదుకదా?" అన్నాను.

నావైపు చాలా సీరియస్‌గా చూసింది. ఆమె తీక్షణదృక్కులని నేనసలు పట్టించుకోలేదు. "ఈరోజు మీకో కొత్తఆట చెప్పనా" అన్నాను.

"చెప్పండి" ఉత్సాహంగా అంది.

"ఈ ఆటలో మీరు ప్రేమిస్తున్నవాడి పేరులో కొన్ని అక్షరాలు తెలుస్తాయి" అన్నాను.

"ఎలాగ?"

"చెబుతాను కదా కంగారెందుకు. ఇప్పుడు అతనిపేరులో మొదటిభాగం మాత్రమేతెలుస్తుంది. అంటే అతని పేరు రాఘవరావు అనుకోండి 'రాఘవ' అని మాత్రమే తెలుస్తుంది" అన్నాను.

"ఎలా తెలుస్తుంది?" ఆశ్చర్యంగా అడిగింది.

"మీ మనసుమీద పరీక్షలు అనేకరీతుల్లో జరిపి చెపుతాం"

"ఏంపరీక్షలు"

"ఒక అంకె తలచుకోండి. రెండంకెల సంఖ్య అయివుండాలి"

"తలచుకున్నాను"

"దాన్ని ఐదువందలతో గుణించండి" చాలా సీరియస్‌గా అడిగాను.

కొద్ది సేపటి తరువాత- "గుణించాను" అంది.

"దాంట్లోంచి ఐదువేలు తీసెయండి" వచ్చేనవ్వుని ఆపుకుంటూ అడిగాను.

"తీసేసాను"

"దాన్ని యాభైతో భాగించండి"

"భాగించాను"

"ఎంత వచ్చిందో చెప్పండి"

"140"

కొద్దిసేపు దీర్ఘంగా ఆలోచించి, రెండు చేతులని గాలిలో అటుఇటు ఆడించి, ఏవేవో లెక్కలుకట్టి "మీరు ప్రేమిస్తున్నవాడిపేరులో మొదటి అక్షరం 'K'" అన్నాను.

"ఎలా తెలిసింది" విస్మయంగా అడిగింది.

"నిజమేనా" అడిగాను అంతకంటే ఆశ్చర్యంగా.

"ఏమో నాకు తెలియదు ఇంకా నేను ఎవర్నీ ప్రేమించటంలేదు" అంది దేవి.

"అతని పేరులో చివరి అక్షరం చెప్పనా?"

"చెప్పండి"

"రెండంకెలు అనుకోండి. రెండింటిని గుణించి పదిహేనుతో భాగించండి"

"ఊ... తరువాత"

"వచ్చిన దాంట్లోంచి అనుకున్నదానిలో ఏదో ఒకటి తీసెయ్యండి"

"తీసేసాను"

"నెగిటివ్ వచ్చిందా, పాజిటివ్వా"

"నెగిటివ్ వచ్చింది"

కొద్దిసేపు ఆలోచించిన తరువాత "ఎంత" అన్నాను

"మైనస్ నాలుగు" అంది.

మీరు ప్రేమిస్తున్నతనిపేరులో రెండుభాగాలున్నాయి. మొదటి భాగంలో చివరి ఆల్ఫాబెట్ 'A' అన్నాను.

"ఫస్ట్‌పార్ట్‌లో సెంటర్ ఆల్ఫాబెట్ చెప్పనా?"

"చెప్పండి"

ఆమె మొహంకేసి తదేకంగా చూసి కొద్దిసేపు కనులు మూసుకొని "అతనిపేరు ఇంగ్లీషులో ఏడు అక్షరాలది. సెంటర్ ఆల్ఫాబెట్ S'" అన్నాను.




"ఎలా కనుక్కొన్నారు ఈ వివరాలన్ని"

"ఈ వివరాలు కనుక్కోవడం ప్రేమించేవాళ్ళకే తెలుస్తుంది. ఇంటికి వెళ్ళి ఆలోచించండి మీరు ప్రేమిస్తున్న ఆ వ్యక్తి ఎవరో తెలుస్తుంది" అని వచ్చేశాను.

ఇది జరిగిన కొద్దికాలానికి దేవికి వాళ్ల ఇంటిలో సంబంధాలు చూడనారంభించడంతో మా విషయం వాళ్ళ నాన్నగారికి చెప్పింది. వాళ్లనాన్నగారు కూడా ముందు ఒప్పుకున్నారు. కాని వారంరోజుల క్రితమే నాకొక లెటరొచ్చింది దేవి దగ్గరనుంచి. అందులో- "కృష్ణా మా నాన్నగారు మన పెళ్లికి ఒప్పుకున్నారని ఎంతో సంతోషించాను. కానిమనపెళ్ళి జరగడం దేవుడికిష్టంలేదు. నన్ను పెళ్లి చేసుకుంటే నీ ప్రాణానికే ప్రమాదం... నన్ను మరచిపో" అని రాసింది.

నాకు అసలు విషయం ఏమిటో ఎంతకీ అర్థంకాలేదు. లెటర్ తీసుకొని సుకుమార్ దగ్గరికి వెళ్ళాను. వాడు ఆ ఉత్తరం చూసి నిర్ఘాంతపోయాడు అసలు విషయంఏమిటో కనుక్కుంటానని దేవి ఇంటికెళ్ళాడు.

నాకు అంతా అగమ్యగోచరంగా ఉంది. వాళ్ల నాన్నగారికి నిజంగా ఇష్టంలేకపోతే ముందు ఎందుకు ఒప్పుకున్నట్టు?

ఒక గంట తరువాత వచ్చాడు వాడు. నీరసంగా కూర్చుండిపోయాడు. వాడు రాగానే- "ఏంటిరా ఎందుకలా రాసింది" అని అడిగాను.

"నిన్ను పెళ్ళిచేసుకోవడం దేవికిష్టంలేదంటరా"

"ఎందుకనిష్టంలేదు"

"పెళ్ళిజరిగితే, మీ మొదటి రాత్రే మీకు చివరిరాత్రి అవుతుందట అందుకని"

"ఎవరు చెప్పారు అలాగని"

"ఎవరో దేవి చెప్పిందంట. నువ్వు జీవించి వుండటమే ఆమెకి కావలంట. అందుకే నిన్ను పెళ్ళిచేసుకోదంట"

"ఏంట్రా నువ్వు మాట్లాడుతున్నది నాకేం అర్థం కావటంలేదు... సరిగా చెప్పు" అన్నాను వాడు కూర్చున్న కుర్చీదగ్గరకి వెళ్ళి.

"దేవి, వాళ్ళ నాన్నగారు కూడా శ్రీ కృష్ణుని భక్తులని తెలుసుకదా" అడిగాడు వాడు.

తెలుసు అన్నట్టు తలఊపాను.

"ఇక్కడ శ్రీ కృష్ణునిదైవ ప్రతినిధిగా ఎవరో దేవి అనే ఆవిడ ఉన్నారుట. ఆవిడకి జరగబోయేది ముందే తెలుస్తుందంట. చాలా మహిమలున్నాయట ఆ దేవికి"

"ఆవిడకీ, మా పెళ్ళికీ సంబంధం ఏమిటిరా" అసహనంగా అడిగాను.

ఆవిడ చెప్పిందంట, పెళ్ళయిన తరువాత రోజు రాత్రే నువ్వు, దేవి ఇద్దరూ చనిపోతారుట. మీ ఇద్దరిజాతకాలుగాని, జన్మనక్షత్రాలుకాని ఏవీ కలవడంలేదట.

ఆవిడ మాటమీద తండ్రి, కూతుళ్ళిద్దరికి గురి"

"ఇలాంటివి నేనసలు కేర్‌చేయను. ఇప్పుడే వెళ్ళి దేవితో మాట్లాడతాను"

"నువ్వామెతో ఏంమాట్లాడినా లాభంలేదురా! ఆ దేవి ఎవరోకాని ఆమెని బాగా ఇంప్రెస్ చేసింది"

"నేను చెప్పినా ఒప్పుకోదా?"

"నా మాటకంటే, నీ మాటకంటే ఆ దేవి మాటే ఆమెకెక్కువ. దేవి చెపితే నిన్ను మరచిపోడానికి కూడా సిద్ధపడుతుంది" అన్నాడు వాడు.

వాడిమాటలు నాకసలు రుచించలేదు. నాదేవి, నన్ను ప్రాణంకంటె ఎక్కువగా ప్రేమించిన దేవి నన్ను మరచిపోతుందా. ఇంపాజిబుల్ అనుకున్నాను.

ఆమెతో నేనే స్వయంగా మాట్లాడాలని నిర్ణయించుకున్నాను. చాలాసేపు మౌనంగా ఉండి "ఈపెళ్లి ఎలా జరగదో నేనూ చూస్తాను" అంటూ వెళ్లిపోయాడు సుకుమార్.

ఆ తర్వాత చాలాసార్లు దేవితో మాట్లాడదామని ప్రయత్నించాను. కాని ఆమె ప్రతిసారీ నన్ను తప్పుకొని తిరగడం ప్రారంభించింది.

రెండురోజుల తరువాత హఠాత్తుగా సుకుమార్ వచ్చి- "మీపెళ్లి తప్పకుండా జరుగుతుందిరా. నువ్వేమీ బెంగపడకు. ఇదిగో ఈ అడ్రస్సు చూశావా" అని కాగితంమీద రాసి ఉన్న అడ్రస్సు చూపించాడు.

అడ్రసు చూసి తలఊపాను.

"ఈరోజే ఈయనని కలసి ఆ దేవి అసలు స్వరూపం బయటపెడతాను. దాంతో ఈదేవి నిన్ను పెళ్లిచేసుకోవడానికి ఒప్పుకుంటుంది" అని అడ్రస్సు తీసుకొని వెళ్లిపోయాడు.

వాడు వెళ్లిపోయిన తరువాత కూడా చాలా సార్లు దేవి ఇంటికి వెళ్లాను. లోపలే ఉండి కూడా లేనని చెప్పించింది. ఏంచేయాలో పాలు పోయేదికాదు. సరిగా ఈ సంకటపరిస్థితుల లోనే సుకుమార్ చనిపోయాడని తెలిసింది.

వెంటనే వాడు పడివున్న దగ్గరకు వెళ్లాను. నాకోసం ఎన్నోచేశాడు. వాడికోసం నేనేమీ చేయ కుండానే వెళ్లిపోయాడు" చివరిమ టలు అంటున్నప్పుడు కృష్ణమూర్తి కంఠం గాద్గదకంగా వచ్చింది.

చెపుతున్నంతసేపు అతని కంటివెంట కన్నీరు కారుతూనే ఉంది. బహుశా అప్పుడు జరిగినవన్నీ అతని కనులముందు కదలాడి వుండి ఉండవచ్చు. చివరిగా "వాడసలు ఏటి దగ్గరకి ఎందుకు వెళ్లాడో నాకెంతకి అర్థంకాలే దు" అన్నాడు.

"ఈ రైటింగ్ ఎవరిదో కాస్త చూడండి" అని తనకు ముళ్లకంపలదగ్గర దొరికిన ఉత్తరం చూపించాడు నరేంద్ర.

"ఇది దేవి రైటింగ్ మాత్రంకాదు. అని ఆమె తనకి రాసిన ఉత్తరం తీసుకొచ్చాడు. రెండింటిని ఒకసారి చూసి- "దేవి ఇంటికి వెళదాం వస్తారా" అని అడిగాడు నరేంద్ర.

"ఎందుకు?"

ఆమెదగ్గరకి వెళ్లినరోజు ఏమిమాట్లాడారో తెలుసుకుందాం" అన్నాడు నరేంద్ర.

లోపలికి వెళ్లి బట్టలు మార్చుకొని వచ్చాడు కృష్ణమూర్తి.

ఇద్దరూ బయటికి వచ్చారు. "సుకుమార్ చూపించిన అడ్రస్సు జ్ఞాపకం ఉందా" అని అడిగాడు నరేంద్ర.

"సరిగా జ్ఞాపకంలేదు" అన్నాడు కృష్ణమూ ర్తి

"ఎంతవరకు గుర్తుందో అంతవరకే చె ప్పండి"

కళ్లు మూసుకున్నాడు కృష్ణమూర్తి జ్ఞాప కంతెచ్చుకోడానికి. కళ్లుతెరిచి- "అందులో అడ్రస్సు కె.వెంకట్రావు, అసిస్టెంట్ ఇంజనీర్, ప్రతాప్‌నగర్ అని ఉంది" అన్నాడు కృష్ణమూ ర్తి.

నరేంద్ర నోట్‌చేసుకున్నాడు కృష్ణమూర్తి చె ప్పింది. ఇద్దరుకలిసి దేవి ఇంటిదగ్గరకి వచ్చా రు. గేటు తీసుకొని లోపలికి వెళ్లారు. కాలింగ్ బెల్ నొక్కబోతుండగా తలుపులు తెరుచుకు న్నాయి.

పనిమనిషి బయటకొచ్చి- "అమ్మాయిగా రు లేరుబాబు" అంది. ఆ పనిమనిషి కళ్లల్లోకి చూశాడు. గిల్టీగా అనిపించింది ఆ పనిమని షికి.

"తలుపులేసుకో తులసీ. దేవి ఉందోలేదో నాకుతెలుసులే." అని "పదండి" అన్నాడు నరేంద్ర వైపు తిరిగి.

గేటువేయడానికి వెనక్కి తిరిగిన కృష్ణమూర్తి కి కిటికీదగ్గర నుంచి వెళ్లిపోతున్న దేవి కనబ డింది. చిన్నగా నిట్టూర్చి "దేవి దగ్గరకి రావా లంటే నాతో రాకండి. ఆమె ఉండికూడా లేదు అనిపిస్తుంది. సాయంత్రం ఒక్కరే వెళ్లండి ఉంటుంది" అన్నాడు.

"దేవి లోపలుందా" మామూలుగా అడిగా డు నరేంద్ర.

"ఉంది... నేనొస్తే బయటకిరాదు. నేనంటే ఆమెకెందుకంత కోపమో నాకెంతకీ అర్థంకావ డంలేదు. నాతో అసలు మాట్లాడనే మాట్లాడ టంలేదు. ఎందుకు తననితాను శిక్షించు కుంటూ నన్నిలా శిక్షిస్తుందో అర్థంకావడంలే దు" అన్నాడు

ఇద్దరూ నడుస్తున్నారు.

"అయితే సాయంత్రం నేనొక్కడినీ వెళతా ను" అన్నాడు నరేంద్ర.

"దేవి దగ్గరకి వెళ్లిన తరువాత నాదగ్గరికి రండి"

"అలాగే" అని వచ్చేశాడు.

అక్కడినుంచి అదే విషయం గురించి దీర్ఘంగా ఆలోచిస్తూ రూమ్‌చేరుకున్నాడు. అక్కడ అప్పటికే ప్రదీప్ వేచివున్నాడు అతడి కోసం.

# అందం -- ఆరోగ్యం

## JEEVANTONE

బల హీనమైన కణాలకు మంచి రక్త ప్రసరణను అందజేస్తుంది. ఇదికాక ఆరోగ్యాన్ని, బలాన్ని, కండరాలకు దారుఢ్యాన్ని ప్రసాదిస్తుంది.



ఒక సీసా తాగింతర్వాత
ఇంకా ఎన్ని సీసాలు తాగాలో
మీరే నిర్ణయిం చేసుకోగలు

ఆరోగ్యంగా లేకపోతే
రోగాలపాలవుతారు

మంచి ఆరోగ్యం, బలం, శక్తి
పుష్టిగా కండరాలు పొందిన తర్వాత
ఈ మందును ఆపివేయడం మంచిది

"MFG. LICENCENo. AUS 59/75"
Contact our new sole Distributors"

**M/S. New Shakti Pharma,**
No. XXV/475, Havanapet,
Adoni-518 301,
Kurnool Dist., A.P.
**Phone: 2866**






ఏ.పి.పి
కొరకు

జీవన్‌టోన్ ప్రాడక్ట్
పి.బి.నం. 880 17/2
కేంబ్రిడ్జి రోడ్
బెంగుళూర్-560 008

450 Grams Rs. 40/-

SINDU

"ఒక అరగంట నుంచి నీకోసమే ఎదురు చూస్తున్నాను" అన్నాడు ప్రదీప్.

"దేనికి" అడిగాడు నరేంద్ర.

"ఇక్కడ శ్రీకృష్ణభగవాన్ దేవి భక్తజన సంఘం అని ఒకటుంది తెలుసా?"

"తెలుసు"

"ఆ సంఘం సభ్యులు అందరూ దేవి అనే ఆవిడని దైవప్రతినిధిగా నమ్ముతున్నారు. ఆవిడ మొన్న సుకుమార్ అనేవాడిని 'పాముకాటుకి గురై మరణిస్తావ్ అని శపించిందిట"

"నిన్న అతను చనిపోయాడు. అంతేనా ఇంకేమైనా తెలుసా?"

"అంతే... కొందరుభక్త జనులకు తెలుసు. ఈవిషయం నీకెలా తెలును?"

"విషయసేకరణేగా నాపని" నరేంద్ర. చెప్పాడు. సుకుమార్ చనిపోవడం, దేవి విషయం అంతా చెప్పాడు నరేంద్ర ప్రదీప్‌కి, చివరన "ఈకేసు మనమే తేల్చాలి" అన్నాడు.

"ఓకే" అన్నాడు ప్రదీప్.

★ ★ ★

నరేంద్ర, ప్రదీప్‌లు కలిసి దేవి ఇంటికివచ్చారు. పొద్దున్న వచ్చిన పనిమనిషే బయటకు వచ్చింది. నరేంద్ర గేటువైపు తిరిగిపోయాడు.

"ఎవరు కావాలండి?" అడిగింది ఆమె.

"దేవిగారు కావాలి" అన్నాడు ప్రదీప్.

"లోపలకొచ్చి కూర్చోండి" అని లోపలకి వెళ్లింది పనిమనిషి.

లోపలకి అడుగుపెట్టారిద్దరూ! ఇంద్రభవనంలావుంది ఇల్లు.

అందమైన తివాచీలు, అందమైన సీనరీలతో అందంగా అలంకరించబడింది ఆ గది. ఆ గది ఒకచివర శ్రీకృష్ణుని నిలువెత్తు ఫొటో. దానికింద ఎవరిదో ఒకావిడ ఫొటో, అగరొత్తులు వెలుగుతున్నాయి, పూలుపెట్టి వున్నాయి.

"ఎవరండీ మీరు" అన్న ప్రశ్న వినబడటంతో గదిని పరిశీలించడంలో నిమగ్నమైపోయిన ఇద్దరూ ఒక్కసారి ఈలోకంలోకి వచ్చేసారు.

ఎదురుగా దేవి.

"నాపేరు నరేంద్ర అండి. జర్నలిస్ట్‌ని. ఇతను నా స్నేహితుడు ప్రదీప్" అన్నాడు నరేంద్ర.

"ఏంకావాలండి"

"నేను సుకుమార్ స్నేహితుడినండి"

"ఏ సుకుమార్...?"

ఆశ్చర్యపోయారిద్దరూ.

అంతలోనే "ఓహో ఆ సుకుమారా" అంది.

"అదేంటండి మీరు అతనికి మంచి ఫ్రెండ్ అని చెప్పాడే" అన్నాడు ప్రదీప్.

"దేవుడిని దూషించేవాళ్లన్నా దేవుని ప్రతినిధులంటే లెక్కలేనివాళ్లన్నా నాకసహ్యం. అతన్ని ఇంక నేను ఫ్రెండ్‌గా ఎలా ట్రీట్ చేయగలను" అంది.

ఆ అమ్మాయికి దేవుడంటే విపరీతమైన భక్తని ఇద్దరూ గ్రహించారు. మనదేశంలో ఏఅమ్మాయికి లేదుగనుక దైవభక్తి.

"అతను చనిపోయాడు" అన్నాడు నరేంద్ర.

"తెలుసు. దేవిని ధిక్కరించాడు. ఆమె శాపానికి గురై మరణించాడు. అప్పటికీ నేను చెప్పాను... వింటేనా" అంది.

"ఏమని చెప్పారు?" అడిగాడు ప్రదీప్. నరేంద్ర నోట్ చేసుకోడానికి రడీగా ఉన్నాడు.

"దేవి మహిమగలది. ఆవిడకి కోపం తెప్పిస్తే బూడిద అవుతావని"

"ఎప్పుడు చెప్పారు?"

"మొన్నెప్పుడో వచ్చి 'దేవి మోసగత్తె. ఆవిడ బండారం బయట పెడతాను. చూస్తూవుండు. అప్పుడైనా పెళ్లికి ఒప్పుకో అన్నాడు. అప్పుడే హెచ్చరించాను. వినలేదు... ఫలితం అనుభవించాడు"

"మీకు కృష్ణమూర్తి అనే వ్యక్తితో పెళ్లి నిశ్చయం అయిందని చెప్పాడు... నిజమేనా?"

"నిశ్చయం అయిందికాని దేవికిష్టంలేక కాన్సిల్ చేసుకున్నాము" ఆమాటలు అంటున్నప్పుడు ఆమె మొహంలో విషాదవీచికలు స్పష్టంగా అగుపించాయి ప్రదీప్, నరేంద్రలకి.

"దేవి మీకెవరితోనైనా పెళ్లి నిశ్చ

యించారా'' అడిగాడు నరేంద్ర.

''అవును నిశ్చయించింది. శ్రీధర్ అని దేవి భక్తజనసంఘంలోని వాడే''

''మీరొప్పుకున్నారా''

''నా సమ్మతితో నిమిత్తంలేదు. దేవుని ఆజ్ఞఎలా ఉంటే అలా జరుగుతుంది''

''మేము అందులో సభ్యులుగా చేరాలంటే ఏంచెయ్యాలి?''

''వెయ్యిరూపాయలు కట్టాలి సభ్యత్వ రుసుంగా. దేవిమాటకి ఎదురుచెప్పకూడదు'' అంది.

''మీకు సుకుమార్ అంటే అంత కోపమెందుకు'' మళ్లీ అడిగాడు నరేంద్ర.

దేవికంటిలో కన్నీరు. ఆ కన్నీరు కంటి నుండి ఉబికి చెంపమీదుగా జారి జాకెట్టుని తడిపింది.

''సుకుమార్ నామాట వినకుండా చావుని కొని తెచ్చుకున్నాడన్న ఉక్రోషంతో అలా అన్నాను'' అని ఏడవడం ప్రారంభించింది.

అప్పటివరకు అదిమిపట్టి ఉంచిందేమో ఒక్కసారిగా ఉప్పెనలా ముంచేసింది ఆమెని దుఃఖం. ఆమెని ఓదార్చే ప్రయత్నమేమీ చెయ్యకుండా అలా ఉండి పోయారు ఇద్దరూ. కొద్దిసేపటికి ఇందాకటి ఉధృతం తగ్గింది.

''మీతో చివరిసారిగా ఏమన్నాడు'' అడిగాడు ప్రదీప్.

''నీకు, కృష్ణమూర్తికి తప్పకుండా పెళ్లి జరిగేలా చేస్తాను అన్నాడు. అందుకే మాకోసం దేవిని ఎదిరించి, మాపెళ్లి కోసం సమిధైపోయాడు'' అంది.

ఇంకొద్దిసేపు అక్కడే ఉండి రూమ్‌వైపు బయలుదేరారు ఇద్దరూ.

''వెంకట్రావుగారింటికి కూడా వెళదామా'' అన్నాడు నరేంద్ర.

''పద'' అన్నాడు ప్రదీప్.

జాగ్రత్తగా ప్రతాప్‌నగర్ అంతా వెదికి వెంకట్రావుగారిల్లు కనుక్కున్నారు. కాలింగ్ బజర్ నొక్కారు. ఓ పిల్లవాడు వచ్చి తలుపుతీశాడు.

''వెంకట్రావుగారు లేరామ్మ'' అడిగాడు నరేంద్ర.

''ఉన్నారు కూర్చోండి పిలుస్తాను'' అంటూ లోపలికి వెళ్లిపోయాడు కుర్రవాడు.

రెండు నిమిషాలకి లోపలనుంచి వెంకట్రావుగారు వచ్చారు.

నరేంద్రని చూడగానే- ''ఏంటోయ్ ఇలా వచ్చావు'' అని అడిగారు ఆయన.

ఆయనని అక్కడ చూసి ఆశ్చర్యపోయాడు నరేంద్ర. నరేంద్ర నాన్నగారి ఫ్రెండ్ ఆయన.

''మీనాన్నగారు, అమ్మగారు అందరు బాగున్నారా?'' అడిగారాయన నరేంద్ర ఏమి మాట్లాడకపోవడంతో.

నరేంద్ర ఆయన దగ్గరకి ఎప్పుడు వెళ్లినా ఆఫీసుకే వెళ్లేవాడు. దాంతో ఆయన ఇల్లు తెలియదు నరేంద్రకి.

''బాగానే ఉన్నారండీ'' అన్నాడు నరేంద్ర.

''మీఫ్రెండా?'' అడిగారాయన ప్రదీప్‌ని చూస్తూ.

''అవునండి వాడు మీతో ఏదో మాట్లాడాలంటే వచ్చాము'' అన్నాడు నరేంద్ర.

''నాతో మాట్లాడటానికి వచ్చాడా'' ఆశ్చర్యంగా అడిగారు ప్రదీప్ వైపుచూస్తూ.

ఇతన్ని ఎక్కడ చూసినట్టూ గుర్తులేదే అనుకున్నారాయన.

పరిస్థితి అర్థమైంది ప్రదీప్‌కి, నరేంద్ర తనని అడగమంటున్నాడని అర్థం చేసుకున్నాడు.

''మీకు దేవి తెలుసాండి'' అడిగాడు ప్రదీప్.

''ఏ దేవి?''

''శ్రీకృష్ణభగవాన్‌భక్తజనసంఘానికి సంబంధించిన దేవి''

''ఆ దేవా... తెలుసు''

''ఎలా తెలుసు?''

నరేంద్ర వైపుచూస్తూ- ''మీఫ్రెండ్‌కి ఈ విషయాలు ఎందుకు?'' అని అడిగారాయన.

''వాడు జర్నలిస్ట్ అంకుల్. ఆవిడ గురించి ఏదో రాద్దామని'' అన్నాడు నరేంద్ర.

''అలాగా. మొన్నెప్పుడో ఇలాగే ఒకరు వచ్చి దేవి వివరాలన్నీ నోట్‌చేసుకొని వెళ్ళారు''

"ఎవరో తెలుసాండి?" అడిగాడు ప్రదీప్.

"సుకుమార్ అనుకుంటా అతని పేరు"

"ఏమడిగాడు మిమ్మల్ని?"

"దేవి మీకెలా తెలుసు అని అడిగాడు"

"చెప్పారా?"

"చెప్పాను. థాంక్యూసర్. ఒక నిండుజీవితాన్ని రక్షించారు అని వెళ్ళిపోయాడు" అదంతా ఎందుకు అసలు విషయానికి రమ్మన్నట్టు ప్రదీప్‌ని మోచేతితో పొడిచాడు నరేంద్ర.

"దేవి మీకెలా తెలుసండి?"

"ఆమె నా ఫ్రెండ్ భార్య"

"ఆమె అమెరికానుంచి వచ్చారని విన్నాను?" సందిగ్ధంగా అడిగాడు ప్రదీప్.

"ఇరవై సంవత్సరాలక్రితమే వాడు అమెరికా వెళ్ళిపోయాడు. రెండు సంవత్సరాలకోసారి వస్తుండేవాడు ఇక్కడకి. ఇక్కడకి వచ్చిన ప్రతీసారి నన్ను కలిసేవాడు"

"చివరిసారిగా ఎప్పుడొచ్చారు ఆయన?"

"పోయిన సంవత్సరం వచ్చాడు. భార్యా పిల్లలు అందరితో కలసి వచ్చాడు. 'ఇళ్ళస్థలాలు చూడరా. ఇక్కడే సెటిల్‌అయిపోవాలని ఉంది' అన్నాడు. ఇక్కడ రెండు మూడు స్థలాలు చూపించాను. ఇక్కడికంటే ఇళ్ళస్థలాలు అమెరికాలోనే తక్కువ అనుకుంటూ వెళ్ళిపోయాడు. ఆ తరువాత పెద్దకొడుకుని తీసుకొని వాడి భార్య... అదే దేవి మళ్ళీ వచ్చేసింది. ఇక్కడ ఏదో భక్తజనసంఘం పెట్టింది"

"ఇక్కడికి వచ్చిన తరువాత మిమ్మల్ని కలవలేదా?"

"కలిసాను. తనో పెద్దదేవతలా ఫీలైపోతూ నన్ను అసలు పట్టించుకోలేదు. నాకు అలాంటి వాళ్ళంటే అసహ్యం. అందుకే మరెప్పుడూ వెళ్ళలేదు. మొన్నే వచ్చింది అమెరికానుంచి లెటర్. ఇక్కడే ఇల్లుకొందామంటే ఒప్పుకోకుండా అబ్బాయి శ్రీధర్‌ని తీసుకొని అక్కడకి వచ్చేసింది కాంతం. అక్కడే ఏదో ఒకస్థలం సెటిల్‌చేస్తుందంట' అని రాశాడు. ఇక్కడ ఈమె చేస్తున్న నిర్వాకంవాడికి రాయాలో, అక్కరలేదో అర్థంకావట్లేదు. వాడికి సాధువులన్నా యోగులన్నా అసహ్యం..." అని ఆగారు.

"శ్రీధర్ అంటే వాళ్ళబ్బాయా?"

"అవును. ఇక్కడెవరికీ ఆ సంగతి చెప్పలేదనుకుంటాను, భక్తజనంలో ఒకడిగానే అతన్ని చూస్తుందనుకొంటా" అన్నారాయన.

"దేవికి మానవాతీత శక్తులున్నాయని కాని, ఆమె దేవుని ప్రతినిధి అనికాని మీరు నమ్ముతున్నారా?"

"లేదు... ఆవిడకి ఏశక్తులులేవు. ఉన్న శక్తి అల్లా మనుషుల బలహీనతల్ని కేష్‌చేసుకోవడం. ఆమె భక్తులలో ఒకడు ఇల్లుకట్టిస్తున్నాడనీ, మరొకడు ఏ.సి. కారు కొనిస్తున్నాడనీ విన్నాను ఫూల్స్"

"ఇక్కడ వాళ్ళకి ఎవరులేరా?"

"లేరు. ఎప్పుడొచ్చినా హొటల్‌లోనే దిగుతారు. ఫ్రెండ్స్‌తో కొన్నాళ్లు గడిపివెళ్ళిపోయేవారు"

"దేవి వైపుకాని, ఆయన వైపుకాని బంధువులు అసలు లేరంటారా?"

"ఉన్నారేమోకాని నాకు తెలీదు" అన్నారాయన.

నరేంద్ర మొత్తం అంతా నోట్‌చేసుకున్నాడు. ఇద్దరూ ఆయనకి థాంక్స్‌చెప్పి బయటకి వచ్చేశారు.

"దేవికి ఎటువంటి మానసికశక్తులు లేవు. ఇక్కడున్నవాళ్ళని ఏవేవోమాజిక్‌లు చేసి వశపరచుకొని ఉంటుంది" అన్నాడు ప్రదీప్.

"ఎటువంటి శక్తులూ లేకపోతే మొన్న సుకుమార్‌ని శపిస్తే అతడు అదేవిధంగా ఎలా చచ్చిపోయాడంటావ్?"

"దేవి, కృష్ణమూర్తి మామూలుగా కలుసుకునేది మూడు మామిడి చెట్లదగ్గరేకదా?"

"అవును"

"సుకుమార్‌ని అక్కడకి రమ్మని ఎవరో రాసారన్నావుకదూ?"

"అవును... రాసారు. అది నాదగ్గరే ఉంది"

"అది రాయించింది భక్తజనసంఘం దేవే అయివుంటుంది. అక్కడ ఎలాగూ వస్తాడని తెలుసుకదా. ముందే పాములవాడిని అక్కడకి వంపి పాముచేత కాటువేయించి వుంటుంది. సుకుమార్‌ని చంపిస్తే అటు శత్రువుచస్తాడు.

ఇటు తన పలుకుబడి కూడా పెరుగుతుందిక దాని చంపించేసి ఉంటుంది''

''అదిసరే, అలాగే జరిగి ఉంటుందను కొందాం. అసలామె దేవి పెళ్ళి కృష్ణమూర్తితో జరగకుండా ఎందుకు అడ్డుపడిందంటావ్?'' అడిగాడు నరేంద్ర.

''ఏమో మరి, ఏదో ఉపయోగం ఉండే వుంటుంది''

''సాయంత్రం కృష్ణమూర్తి దగ్గరకి వస్తానని చెప్పాను... వెళదాంపద'' అన్నాడు నరేంద్ర.

ఇద్దరూ కృష్ణమూర్తి రూమ్‌వైపు బయలుదే రారు.

★ ★ ★

ప్రదీప్ - నరేంద్రలు కృష్ణమూర్తి రూమ్‌చేరు కున్నారు. వరండాలో కూర్చొన్న కృష్ణమూర్తి వారిని లోపలకాహ్వానించాడు. ముగ్గురూ వరండాలో కూర్చున్నారు.

నరేంద్ర తనకి తెలిసిందంతా కృష్ణమూర్తికి



చెప్పాడు. చివర్న తన అనుమానంకూడా చెప్పాడు. దేవే ఈ హత్య చేయించివుంటుందని.

"సుకుమార్ని కావాలని చంపేసిందంటారా" ఆగ్రహంగా అడిగాడు కృష్ణమూర్తి.

అతనికి దేవిని కాల్చిపారేయాలనీ, ముక్కలు ముక్కలుగా నరికి పారెయ్యాలనీ అనిపించింది. సలసల కాగుతున్న నూనెలో వేసి వేయించాలనిపించింది. తన పెళ్ళిని ఆపించడమేకాకుండా తన ప్రాణస్నేహితుడిని బలితీసుకున్న ఆమెని ప్రాణాలతో వదలకూడదనుకున్నాడు.

ఇంతచేసిన ఆ దేవిని వదలను. ఈరాత్రికే దానిని చంపేస్తాను కత్తితో నరికిపోగులుపెడతాను" ఆవేశంగా అన్నాడు కృష్ణమూర్తి.

అతని ఆగ్రహానికి ఆ ఇద్దరూ అదిరిపోయారు. అతనికి ఎలా నర్దిచెప్పాలో కూడా తెలియడంలేదు.

"నా దేవిని నాకు కాకుండాచేసి, నా ఆరో ప్రాణమైన సుకుమార్ని నాకు కనబడకుండా చేసినదానిని వదలిపెట్టను... రాత్రికే చంపేస్తాను" కృష్ణమూర్తి మొహంలో అప్పుడే ఆమెని చంపేసినట్టు పైశాచికభావం కదలాడింది.

కృష్ణమూర్తిలో ఆ భావం పెరిగిపోతే అతన్ని ఆవడం ఎవరితరంకాదు. ఇప్పటికే తన దేవి దూరం అవడం, సుకుమార్ చనిపోవడం అతని హృదయాన్ని రాతినిచేసాయి. తొందరపాటుతో ఏదైనాచేస్తే అది అతని ప్రాణానికే ముప్పని గ్రహించాడు ప్రదీప్.

"తొందరపడి దేవిని చంపితే లాభం ఏమీ లేకపోగా జీవితాంతం జైలులో గడపాలి" అన్నాడు ప్రదీప్.

"నా దేవిని నాకుకాకుండా చేస్తున్నదానిని ఏమీ చేయలేని అసమర్ధునిలా జీవించడంకంటే దాన్ని చంపి జైలుకెళ్ళడమే మంచిది"

"అప్పుడు దేవి నిన్ను మరింతగా ద్వేషిస్తుంది" అన్నాడు నరేంద్ర.

బుల్లెట్‌దెబ్బ తగిలిన పక్షిలా గిలగిలలాడిపోయాడు కృష్ణమూర్తి. ఏంచెయ్యాలో పాలుపోక అయోమయంగా వాళ్లిద్దరివైపు చూశాడు.

"నీకు ఇంత అన్యాయం చేసినదాని బండారం బయటపెట్టి దేవిని పెళ్ళిచేసుకోవాలి. అంతేకాని ఆవేశంతో ఏంచేసినా అనర్థానికే దారితీస్తుంది" అన్నాడు నరేంద్ర.

"దానిబండారం బయటపెట్టగలం అంటారా?" ఆశగా అడిగాడు కృష్ణమూర్తి.

"సుకుమార్ ఒక్కడూ దీన్ని ఛేదించడానికి ఒంటరిగా ప్రయత్నించి చివరకు చనిపోయాడు. ఒక్కడు అంతవరకూ ఛేదించుకురాగాలేనిది ముగ్గురం ఏమిచేయలేమా?" అన్నాడు ప్రదీప్.

ఎంతోమంది అమాయకులని మోసంచేస్తూ, మరెందరి ఉసురునో పోసుకుంటున్న దేవి గుట్టురట్టుచేసి ఏ జనమైతే ఆమెను దైవప్రతినిధురాలు అంటూపొగుడుతున్నారో వాళ్ళచేత తిట్టించి వాళ్ళ కళ్లు తెరిపించాలన్న నిర్ణయానికొచ్చాడతను.

"యూ ఆర్ కరెక్ట్" అన్నాడు నరేంద్ర.

"మనకి పోలీసుల సహాయంకూడా ఉంటే మంచిది" అన్నాడు ప్రదీప్.

"అవును. మనం సేకరించిన విషయాలు వాళ్ళకి చెబితే తప్పకుండా వాళ్లు మనకి సహాయంచేస్తారు" అన్నాడు నరేంద్ర.

"నాకు తెలిసిన ఇన్‌స్పెక్టర్ ఉన్నాడు. మా అన్నయ్య క్లోజ్ ఫ్రెండ్ అతను. అతని దగ్గరకి వెళ్ళితే?" అడిగాడు కృష్ణమూర్తి.

"ఎవరా ఇన్‌స్పెక్టర్?" అడిగాడు నరేంద్ర.

"దినేష్" చెప్పాడు కృష్ణమూర్తి.

"గుడ్... సుకుమార్ కేసు ఇన్వెస్టిగేట్ చేస్తున్నది కూడా అతనే. వెంటనే అతడి దగ్గరికి వెళదాం" అన్నాడు నరేంద్ర.

"ఆయనిల్లు తెలుసా?" అడిగాడు ప్రదీప్.

"తెలుసు"

"అయితే పదండి వెళ్ళికలుసుకుందాం" అన్నాడు ప్రదీప్.

ముగ్గురు కలసి దినేష్ ఇంటికి వెళ్ళారు. పైజమా, లాల్చీతో ఉన్నాడు దినేష్.

"ఏంటి ఇలా వచ్చావు... రా కూర్చో" అన్నాడు కృష్ణమూర్తిని చూడగానే.

ముగ్గురూ కూర్చున్నారు.

"అన్నయ్య ఏమైనా లెటర్ రాశాడా? ఇలా

వచ్చావు?''

"లేదండి'' అన్నాడు కృష్ణమూర్తి.

"నిన్న చనిపోయిన సుకుమార్ కేసు విషయం మీతో మాట్లాడదామని'' అన్నాడు ప్రదీప్.

"కేసు విషయాలు ఏమైనా స్టేషనులోనే. నా విషయం నీకు తెలుసుకదా వీళ్ళని ఇక్కడి కెందుకు తీసుకొచ్చావు? సారీ... రేపు స్టేషన్‌కి రండి'' అన్నాడు దినేష్.

"సుకుమార్ పాముకాటుకి గురై మరణించాడని ఫైలు మూసేసి ఉంటారు. సుకుమార్ మరణం సహజ మరణంకాదు హత్య అని మా అనుమానం. అందుకే మీతో మాట్లాడదామని వచ్చాము'' అన్నాడు నరేంద్ర.

"సుకుమార్‌ది హత్యకాదు. అతను పాముకాటుకే మరణించాడని పోస్ట్‌మార్టమ్ రిపోర్టు కూడా వచ్చింది''

"సుకుమార్ చనిపోయింది పాముకాటుకే కాని పాము చేత అతన్ని కాటేయించారు కొందరు''

"మీరేం మాట్లాడుతున్నారో నాకసలేమీ అర్థంకావడంలేదు. చెప్పదలచుకున్నది సరిగా చెప్పండి'' అన్నాడు దినేష్.

"అసలు సుకుమార్ అక్కడికి ఎందుకు వెళ్ళాడో మీఇన్వెస్టిగేషన్‌లో తెలిసిందా?''

"తెలీలేదు. అతని తల్లితండ్రులని, ఫ్రెండ్స్‌ని అడిగాం. ఎవరు చెప్పలేకపోయారు ఆ సమయంలో అక్కడికెందుకు వెళ్ళాడో''

తన దగ్గరున్న కాగితం తీసి దినేష్‌కిచ్చి- "హత్యా స్థలంలో నాకు దొరికిందిది. చదవండి'' అన్నాడు నరేంద్ర.

చదివి "ఎవరీ దేవి'' అన్నాడు దినేష్.

"శ్రీకృష్ణభగవాన్ భక్తజనసంఘంలో ప్రజల చేత దైవ ప్రతినిధిగా పిలిపించుకుంటున్న ఒక హంతకురాలు. హత్యచెయ్యడానికి అందరూ పిస్టల్స్, కత్తులు ఉపయోగిస్తే ఈమె పాముని ఉపయోగించింది.''

"ఆవిడ అతడిని ఎందుకు హత్యచేయించిందో తెలుసా?'' అడిగాడు దినేష్.

దినేష్‌కి మొదటి నుంచి అంతా చెప్పాడు నరేంద్ర. నరేంద్ర చెప్పిందంతా విని ఆశ్చర్యపోయాడు దినేష్. అసలే అతడికి ప్రజల్ని మోసం చేసే దేవి లాంటి వ్యక్తులంటే అసహ్యం. ఆవిడ ప్రజల్ని మోసం చేస్తోందని పించి ఇద్దరు కానిస్టేబుల్స్‌ని అక్కడ మఫ్టీలో ఉంచాడు. అలా ఉంచిన రోజు మధ్యాహ్నామే ఆవిడ మీద నిఘా ఎత్తివేయమని పై నుంచి ఆర్డర్స్ అందుకున్నాడు. చేసేది లేక వాళ్ళని వెనక్కి పిలిపించడం జరిగిపోయింది. మంచి పలుకుబడి ఉన్న ఆమె జోలికి వెళ్ళలేక సమయంకోసం చూస్తున్నాడు.

నరేంద్ర చెప్పిందంతావిని- "ఒకసారి మనం అక్కడికి వెళ్ళి సుకుమార్‌కి, దేవికి మధ్య జరిగిన సంభాషణేంటో తెలుసుకుందాం'' అన్నాడు. లోపలికి వెళ్ళి బట్టలు మార్చుకొని బయటకు వచ్చాడు దినేష్.




నలుగురూ అక్కడికి చేరుకునేసరికి భక్తులు పరవశంగా తమనితాము మరచిపోయి భజనలో మునిగిపోయి ఉన్నారు. సినిమా పాటలని దేవుని పాటలుగా మార్చేసి అదే ట్యూనింగ్‌తో పాడేస్తూ కళ్ళు మూసుకొని భక్తిలో మునిగితేలుతున్నారు.

ఒక భక్తుడు వాళ్ళ దగ్గరకొచ్చి- "ఎవరు కావాలండీ'' అని అడిగాడు.

"దేవిని చూడటానికి వచ్చాం'' అన్నాడు దినేష్.

"దేవిని చూడాలంటె మీరు ఆమె భక్తులై ఉండాలి''

"మేము నలుగురం ఆవిడ భక్తులమే'' అన్నాడు నరేంద్ర.

"ఆ భక్తులు కాదు... భక్తజనసంఘంలో సభ్యులై ఉండాలి" అన్నాడు వాడు.

"అయితే మాకు ఆమె దర్శనం కలగదా"

"ఊహు... కలగదు. దేవుడికి దండం పెట్టుకొని వెళ్ళిపొండి" అని వెళ్ళబోయాడు

దేవుడిని చూడొచ్చుకాని దేవుని ప్రతినిధిని మాత్రం చూడడానికి లేదు.

ఇంతకీ వాళ్ళిద్దరిలో ఎవరు గొప్ప.

వెళ్ళిపోబోతున్నవాన్ని ఆపి- "మొన్నెప్పుడో ఎవర్నో దేవి పాముకాటుకి గురై మరణిస్తావ్ అని శపించిందట" అడిగాడు దినేష్.

నలుగురివైపు అనుమానంగా చూస్తు- "అటువంటిదేమీలేదే" అని మళ్ళీ-

"మీతో ఎవరన్నారు" అని అడిగాడు

"ఇక్కడే ఎవరో నిన్న అన్నారు" అన్నాడు ప్రదీప్.

"పొరపాటుగా విని ఉంటారు. అటువంటిదేమి జరగలేదు. దేవికి అసలు కోపంరాదు ఇంక శపించడానికి ఎక్కడ అవకాశముంది" అని వెళ్ళిపోయాడు.

ముగ్గురిని బయటకి తీసుకొచ్చేసాడు దినేష్.

"ఇంకొకళ్ళని ఎవరినైనా అడుగుదాం" అన్నాడు ప్రదీప్.

"వేస్ట్... ఎవరిని అడిగినా అదే చెపుతారు" అన్నాడు దినేష్.

"అందరికి చెప్పుకుంటే వాళ్ళకే మంచిది కదా" అడిగాడు నరేంద్ర.

"వాళ్ళ సభ్యులు కొత్తగా జాయిన్ అయ్యే వారికి చెపుతారు. అంతేగాని పబ్లిక్‌గా చెప్పరు.

అలా చెప్పుకుంటే పోలీసులతో గొడవ. జర్నలిస్టులతో గొడవ" అన్నాడు దినేష్.

"ఇంక దేవిని అరెస్టుచేయడం కుదరదా?" అడిగాడు కృష్ణమూర్తి.

"ఇప్పుడప్పుడే కుదరదు" అన్నాడు దినేష్.

"దేవి ఏ గదిలో ఉంటుంది?" అడిగాడు కృష్ణమూర్తి ప్రదీప్‌ని. ప్రదీప్ చూపించాడు.

"రేపు ఏంచేయాల్సింది నిర్ణయించుకుందాం" అని ఎవరిదారినవాళ్ళు వెళ్ళిపోయారు.

★ ★ ★

కృష్ణమూర్తి ఇంటికి వెళ్లగానే ఎదురుగా లెటర్ కనిపించింది. తీసి చదవడం ప్రారంభించారు.

డియర్ కృష్ణా, ఇంక నిన్నాపేరుతో పిలిచే యోగ్యత కోల్పోతున్నాను. ఒక్కసారి నిన్ను చూద్దామని చివరిసారిగ మీ ఇంటికి వచ్చాను. దురదృష్టవంతురాలిని నిన్ను చూడలేకపోయాను.

నేను నిన్ను పెళ్ళిచేసుకోవడం నీకు, నాకు ఇద్దరికీ మంచిదికాదు. ఇప్పటికే కుమార్‌ని పోగొట్టుకొని దుఃఖిస్తున్నాను. నిన్నుకూడా పోగొట్టుకోలేను. ఇంకో పదిరోజులలో నా పెళ్ళి.

నిన్ను రావొద్దని ప్రార్థిస్తున్నాను. ఇంకెప్పుడు నన్ను కలవడానికి ప్రయత్నించవొద్దు. ప్రయత్నిస్తే....ఇట్లు దేవి.

కన్నీటిబొట్టు చెంపలమీదుగా జారి కాగితంమీద పడింది. 'దేవి' సంతకం అలికేసినట్టుగా అయిపోయి అస్పష్టంగా మిగిలింది. ఇంకో చుక్క అక్కడే పడటంతో పేరు అర్థంకకుండా పోయింది.

కంటినిండా నిండిన నీరు బుగ్గలపై జారి చారికగా మిగిలింది.

"దేవీ... నీవులేకుండా నేను బతకలేనని తెలుసుకో, నీతో ఒక్క సెకను గడిపి మరణించినా అది నాకు ఎంతో ఆనందదాయకం అని తెలుసుకో. నన్ను నీలో కలుపుకో" అంటూ ఆక్రోశించిందతని హృదయం.

దేవి దగ్గరికి వెళదామనిపించింది. కానీ ఉత్తరంలోని ఆఖరిలైను జ్ఞాపకంవచ్చి ఆగిపోయాడు.

దేవి ఎంత పట్టుదలకలదో తనకి తెలుసు. తను వెళితే ఏ ఆత్మహత్య ప్రయత్నమోచేస్తే...

ఆ ఊహకి అతను విపరీతంగా చలించిపోయాడు.

ఇదేనా ప్రేమంటే? ప్రేమ త్యాగాన్ని కోరుతుందంటారు. ఇదేనా త్యాగం అంటే.

తను దేవిలేకుండా జీవించలేడు. దేవి చావనైనా చస్తుందికాని తననిమాత్రం చేసుకోదు.





దేవి పెళ్ళిని తను చూడలేడు. అందుకే తను ముందుగానే దేవికి పెళ్ళికాకముందే నిష్క్రమిస్తాడు.

అప్పుడు జ్ఞాపకంవచ్చింది చనిపోయే ముందు చేయాల్సినవని.

తన జీవితం ఇలా దుఃఖకరంగా మారడానికి కారణమైన ఆ దేవిని చంపకుండా తను చనిపోడు. ఈరోజురాత్రికే దాన్ని చంపేసి తను చనిపోతాడు.

దేవిని చంపడానికి కావలసిన పరికరాలన్నిటినీ సిద్ధంచేసుకున్నాడు. ఆమెని ఒకేరోజు చంపకూడదు. రోజుకో భాగాన్ని ఆమె శరీరంనుంచి వేరుచేసి మరీ చంపాలి. ఆమె భక్తులు అది కనబడక పిచ్చెక్కినట్టు తిరగాలి. తను తాపీగా ఆ దేవి ఒక్కొక్క శరీరభాగాన్ని వాళ్లకి పార్శిల్‌చేసి పంపిస్తాడు.

మనిషి పట్టేంత గోనెసంచి అందులో ఒక పెద్ద దుంగ దానిమూతి కట్టడానికి తాడు. కొద్దిగా క్లోరోఫాం అన్నీ సంపాదించాడు. లుంగీ కట్టుకున్నాడు. చారల చారల షర్టువేసుకున్నాడు. అచ్చం పల్లెటూరివాడిలా తయారయ్యాడు. నుదుటమీద వీభూదిరేఖలు. కళ్ళకి కాటుక. మొహంమీద అక్కడక్కడ కాటుక మరకలు చేసుకున్నాడు. జుట్టు చిందరబందరగా చేసి మొహంమీదపడేలా చేసుకున్నాడు. తన రూపం గుర్తుపట్టలేనంతగా మారిపోయిందన్న నమ్మకం వచ్చిన తరువాత దుంగవున్న గోనెసంచిని బయటకుచేర్చి స్కూటర్‌తాళాలు తీసుకొని సెకండ్‌షో సినిమాకి వెళ్లాడు.

సినిమా అయిపోయినతర్వాత ఇంటికివచ్చి దుంగవున్న గోనెసంచిని బాక్సీటుకి కట్టి, దేవి వుండే ప్రదేశానికి కొద్దిదూరంలో స్కూటర్‌ని ఆపి గోనెసంచిని మోసుకుంటూ ఆ ప్రదేశాన్ని చేరుకున్నాడు.

మెయిన్‌గేటునుంచి లోపలికివెళ్లాడు. అక్కడున్న అరుగుమీద కూర్చున్నాడు. అతనికి కుడివైపున కొద్ది దూరంలో ఉంది దేవి గది. తలుపులు వేసివున్నాయి. లోపలికి ఎలావెళ్లాలో నిర్ణయించుకోడానికి ఆ ప్రదేశాన్ని నిశితంగా పరిశీలించాడు. దేవివుండే గదిలోపల లైటువేసి ఉండటం గ్రహించాడు.

అటువైపు చూస్తున్న కృష్ణమూర్తి వెనుక అడుగులచప్పుడవడంతో వెనక్కి తిరిగాడు.

"ఎవరుమీరు" అడిగాడావ్యక్తి.

"నాపేరు కిట్టప్పండి. ఎరుకులపాలెంనుండి వస్తున్నా, దేవిని సూద్దామని. ఇక్కడికి వచ్చేపాటికి సానా టైమ్ అయిపోయింది. ఇక్కడికివచ్చాను పడుకొని రేపు దర్శనంచేసుకుందామని".

"దేవి ఎవరికిపడితే వాళ్ళకి దర్శనము ఇవ్వదు. ఇక్కడనుంచి పో" అన్నాడావ్యక్తి.

"సానాదూరంనుంచి ఒచ్చినాబాబయ్యా ఒక్కసారి దర్శనంచేసుకొని వెళ్ళిపోతాను. నన్ను ఇక్కడే ఉండనివ్వండి బాబయ్యా"

"దేవి నీలాంటోళ్లకి దర్శనం ఇవ్వదు"

"నాలాటోళ్ళు దర్శనం చేసుకోకూడదా బాబయ్యా"

"దేవి దర్శనం చేసుకోవాలంటే వెయ్యిరూపాయలు కట్టాలి నీ దగ్గర అంత డబ్బుందా" అడిగాడు.

"అంత డబ్బులేదు బాబయ్యా. ఓసారి దేవున్ని సూసిపోతాబాబయ్యా. నన్నిక్కడ పడుకోనీయండి" అన్నాడు కృష్ణమూర్తి.

"ఇదేమన్నా ధర్మసత్రం అనుకున్నావా... పో ఇక్కడనుంచి"

"బాబయ్యా రాత్రయిపోయింది. ఇప్పుడెక్కడికిపోగలను. ఈ పదిరూపాయలు తీసుకోండి. నన్నిక్కడే పడుకోనివ్వండి" అని పదిరూపాయలు ఇచ్చాడు.

"ఇలా ఎవరైనా వస్తే కుమార్ పడుకోమన్నాడు అని చెప్పు. పొద్దున్నే వెళ్ళిపో. అర్థమైందా"

"అలాగే బాబయ్య" అన్నాడు కృష్ణమూర్తి.

అతను దేవి గదిలోకి వెళ్ళడం చూసి ఆశ్చర్యపోయాడు కృష్ణమూర్తి. తలుపు దగ్గరకు వేసి ఉంది అంతే గడియపెట్టలేదు. అతను వెళ్ళి తలుపు వేసాడో లేదో తెలియలేదుకాని లైటు ఆర్పేసాడు.

దేవిని పట్టి బంధించడం కుదరకపోతే అక్కడే చంపెయ్యడానికి కత్తికూడా తెచ్చుకున్నాడు. అతనికి ఆనందంగా ఉంది కొద్ది




నిముషాలలో తను దేవిని చంపెయ్యబోతున్నాడు. ఎందర్నో మోసం చేస్తూ, ఇంకెందరినో బాధిస్తున్న దేవిని తన చేతులతో చంపెయ్యబోతున్నాడు.

అప్పటికే నిర్ణయిం చేసుకున్నాడు దేవిని చంపిన తరువాత పోలీసులకి లొంగిపోవాలని, ఎటువంటి పరిస్థితులలో అలా చెయ్యాల్సొచ్చిందో అందరికీ చెప్పాలని ఉందతనికి.

గోనెసంచి నుంచి దుంగని బయటికి తీశాడు. గోనె సంచిని మడిచి మధ్యలో కత్తినుంచి అడుగులో అడుగు వేసుకుంటూ దేవి గది దగ్గరికి వెళ్ళాడు. తలుపు లోపల గడియపెట్టలేదు. నెమ్మదిగా తోసి లోపలికి అడుగుపెట్టాడు. అక్కడ పదిమంది కింద పడుకొని ఉన్నారు. లోపలికి ఇంకో గది ఉంది. అక్కడ నుంచి ఇంకోటి. అలా అయిదు గదులు దాటిన తరువాత లైటు వేసి ఉన్న గది కనబడింది. అక్కడ ఆగాడు.

"నీతో పెళ్ళికి దేవి ఒప్పుకుందటరా శ్రీధర్. వచ్చే వారమే పెళ్ళి. ఇంకో వారం రోజులకి నువ్వు లక్షాధికారివి అయిపోతావు" ఎవరిదో స్త్రీ కంఠం.

"సుకుమార్‌ని చంపించాం కదా. పోలీసు గొడవేమి ఉండదు కదా"

"నెమ్మదిగా మాట్లాడు. అందరు నిద్రపోయారా?"

"అర్ధరాత్రి దాటిన తరువాత ఇక్కడికి వస్తే తలలు పగిలిపోతాయనీ, ఆ టైంలో నువ్వు దేవుడితో మాట్లాడుతుంటావ్ అనీ చెప్పాం కదా"

"ఎలాగైనా మన జాగ్రత్తలో మనం ఉండాలి. నిన్న రాధ- కృష్ణ అని జంట థియేటర్స్ కడదామనుకుంటున్నాను ఆశీర్వాదం కావాలి అంటూ ఎవరో వచ్చారే ఎవడు వాడు"

"అసలు అది చెప్పుదామనే వచ్చాను. వాడికి మూఢనమ్మకాలు బాగా ఎక్కువ. ఆ ప్రదేశం బలికోరుతుంది. శాంతిచేయించాలి అంటూ వచ్చాడు"

"నువ్వేమన్నావ్?"

"అలాగే చేయిద్దామన్నాను. అప్పుడు నన్ను పక్కకు తీసుకువెళ్ళి 'శాంతి చేయించినా అంత ఎక్కువ ఉపయోగముండదంటకదా. నరబలిస్తేనే కట్టుకోవడం మంచిదంటున్నారు' అన్నాడు. అయితే ఇప్పుడు నన్నేం చేయమంటారు" అన్నాను నేను.

"నరబలి అవసరమోకాదో తేల్చుకుందామని వచ్చాను అన్నాడు. నీతో మాట్లాడి చెపుతానన్నాను"

"వాడి పేరేంటి?"

"వి.కె.రావ్ అంట"

"ఫ్యాక్టరీ కూడా కట్టిస్తున్నట్టున్నాడు. బాగానే లాగొచ్చు. శాంతి జరిపిస్తే సరిపోతుందని చెప్పు" అంది.

"అలాగే... నేను వెళతాను. అవసరమైతే కబురు చేయి" అని బయటకు వచ్చాడు శ్రీధర్.

దేవి గది ఆ ఇంటి మధ్యలో ఉంది. ఆ గది వెనక్కివెళ్ళి దాక్కున్నాడు.

ఆ హడావిడిలో కృష్ణమూర్తి వదిలేసి వెళ్ళిన మడతపెట్టిన గోనెసంచిని చూసి తీశాడు శ్రీధర్. మధ్యలో కత్తిని చూడగానే ఆశ్చర్యంతో కనుబొమలు పైకి లేచాయి.

నిశ్శబ్దంగా గోనెసంచిని అక్కడే వదిలి బయటికి నడిచాడు శ్రీధర్.

ఐదు నిముషాలు అక్కడే కామ్‌గా గడిపాడు కృష్ణమూర్తి. నెమ్మదిగా చప్పుడు చేయకుండా గోనెసంచిని తీసుకొని చప్పుడుకాకుండా దేవి గదిలోకి అడుగు పెట్టాడు.

సడెన్‌గా ఎవరో కర్చీఫ్ ముక్కు దగ్గర పెట్టారు కృష్ణమూర్తికి స్పృహ తప్పింది.

"వీణ్ణి తీసుకువెళ్ళి కింద ఉన్న కృష్ణుని ఆలయంలో కట్టి పడెయ్యండి" అన్నాడు శ్రీధర్ వెంట వచ్చిన నలుగురు మహాకాయులతో.

కృష్ణమూర్తిని కట్టేసి, అండర్‌గ్రౌండ్‌లోనున్న కృష్ణుని విగ్రహం ముందు కట్టేపడేసారు.

ఇందాక అనుకున్న నరబలి విషయం జ్ఞాపకం వచ్చింది శ్రీధర్‌కి. అతని పెదవులపై చిరునవ్వు చిన్నగా కదిలింది.

★ ★ ★



కృష్ణమూర్తి ఇల్లుగలాయన పొద్దున్నే లేచి కృష్ణమూర్తి ఇంకా రాకపోవడంతో ఆశ్చర్యపో యాడు. సెకండ్‌షోకి వెళతానని స్కూటర్ తీసుకొని వెళ్ళటంతో కొద్దిగా అనుమానం కూడా కలిగింది.

మళ్ళీ తననితానే సంభాళించుకున్నాడు. వాళ్ల ఫ్రెండ్ దగ్గర ఎవరిదగ్గరన్నా రాత్రిపడు కుండిపోయాడేమోనని సరిపెట్టుకున్నాడు.

ఆఫీసు టైమవుతున్నా ఇంకా కృష్ణమూర్తి రాకపోవడంతో ఆదుర్దా పెరిగిపోయింది. ఆయనకి ఏదైనా ఎక్సిడెంట్ కాలేదు కదా అని ఆయన అనుమానం. మరోగంట అతని కోసం చూస్తూ అక్కడే గడిపారాయన. కృష్ణమూర్తి ఎంతకీ రాకపోవడంతో ఒక నిర్ణయానికి వచ్చి, పోలీసుస్టేషన్‌కి వెళ్ళారాయన.

పోలీస్‌స్టేషన్‌లో దినేష్ కూర్చొని ఉన్నాడు. అతను, ప్రదీప్, నరేంద్ర, కృష్ణమూర్తిల కోసం వెయిట్ చేస్తున్నారు. రాత్రి చాలాసేపు ఆలో చించాడు కాని ఏ నిర్ణయం తీసుకోలేకపోయా డు.

అప్పుడే ఆయన వచ్చారు లోపలికి దినేష్‌కి తెలుసు ఆయన కృష్ణమూర్తి ఇల్లుగలాయనని.

"నమస్కారం అండీ... ఏంటి ఇలావచ్చా రు" అని ఆహ్వానించాడు.

"నిన్నరాత్రి కృష్ణమూర్తి సెకండ్‌షోకని నా స్కూటర్ తీసుకొని వెళ్ళాడు. ఇంతవరకూ రాలేదు. నిన్న ఎక్కడైనా యాక్సిడెంట్‌లు అయ్యాయా" అని అడిగారు.

అంతలోనే ఒక కానిస్టేబుల్, కృష్ణమూర్తి స్కూటర్‌ని తీసుకొని వచ్చాడు.

"ఇదే నాస్కూటర్" ఆనందంగా అన్నారా యన.

"ఎక్కడనుంచి తెస్తున్నావ్ దానిని" అడిగాడు దినేష్.

ఎక్కడనుంచో చెప్పాడు. సాలోచనగా దినేష్ కళ్ళు విశాలమయ్యాయి.

అతని స్కూటర్ అతనికి అప్పగించి పంపేశా డు.

అప్పుడే ప్రదీప్, నరేంద్రలు పోలీస్‌స్టేషన్ లోకి అడుగుపెట్టారు.

"హలో ఇన్‌స్పెక్టర్ గుడ్‌మార్నింగ్ కృష్ణమూ ర్తి వచ్చేశారా వాళ్ళ గదికితాళం వేసుంది" అడిగాడు ప్రదీప్.

"రాత్రి సెంకడ్‌షోకనివెళ్ళి ఇంతవరకు ఇంటికిరాలేదుట. రాత్రి సెకండ్‌షోకని వేసు కొని వెళ్ళిన స్కూటర్ దేవి మఠానికి దగ్గరగా దొరికింది. అది అక్కడికి ఎలావెళ్ళిందో అర్థంకావటంలేదు" అన్నాడు దినేష్.

"ఏమిటీ... కృష్ణమూర్తి రాత్రి వెళ్ళిఇంతవ రకు రాలేదా" ఆ మాటలు అంటున్నప్పుడు నరేంద్ర ముఖకవళికలు మారిపోయాయి. "డాఫిట్ నిన్నచెప్పాం అప్పటికి అక్కడకి వెళ్ళొద్దని వినకుండా వెళ్ళినట్టున్నాడు" అన్నాడు నరేంద్ర.

"ఎక్కడకి వెళ్ళొద్దన్నారు" ఆశ్చర్యంగా అడిగాడు దినేష్.

"నిన్న ఆవేశంగా దేవిని చంపేస్తాను. ఈరో జే చంపేస్తాను అన్నాడు. నేను, నరేంద్ర అతనికి నచ్చచెప్పి. ఆవిడని పోలీసులకి పట్టించాలి అంతేకాని ఆమెని చంపితే మనకి జైలుశిక్షేగతి అన్నాం"

కృష్ణమూర్తి దేవిని చంపేస్తాననడం, తాము అతన్ని సావధానపరచడం అంతా చెప్పారు వారు.

"అయితే కృష్ణమూర్తి దేవి మఠానికి వెళ్ళా డంటారా"

"ఖచ్చితంగా అక్కడికే వెళ్ళివుంటాడని మా అభిప్రాయం"

"మరి నాకింతవరకు అక్కడ హత్య జరిగిన ట్టుగా ఎటువంటి ఇన్‌ఫర్‌మేషన్ రాలేదు"

"బలేవారండీమీరు. దేవిని చంపడం అంటే, లాకప్‌లో ఉన్నవాడిని చంపడం అను కుంటున్నారా. వాళ్ళకి స్థానబలం ఉన్నచోటకే వెళ్ళి, వాళ్ళనే ఏదో చెయ్యాలనుకోవడం అవి వేకం. అలాంటిచోట భుజబలం ఎందుకూ పనిచేయదు. బుద్ధిబలంతో వాళ్ళని ట్రాప్‌లో వేయాలి" అన్నాడు ప్రదీప్.

కృష్ణమూర్తి వాళ్ళకి దొరికిపోయి ఉంటాడు. మనం ఇపుడు సడెన్‌గా వాళ్ళమీద రైడ్ చేస్తే దొరికిపోతారు".

"వాడు దొరుకుతాడో లేదో తెలియదుకాని. మాఆఫీసరుగారు మాత్రం తలవాచేలా చీవా

ట్లు పెడతారు" అన్నాడు దినేష్.

"చీవాట్లతో సరిపెట్టరేమోనండి. సస్పెండ్ చేసినా చేస్తారు. ఆయనకిదేవిమీద విపరీతమైన అభిమానం, నమ్మకం, గౌరవం ఉన్నాయండి" అన్నాడు అక్కడ ఉన్నకానిస్టేబుల్.

"మీరిలారండి" అన్నాడు ప్రదీప్ దినేష్‌తో. "నువ్వుకూడారా" అన్నాడు నరేంద్రని.

ముగ్గురూ బయటకు నడిచారు.

"మనం హొటల్‌కువెళ్ళి మాట్లాడుకుంటే బాగుంటుంది" అన్నాడు ప్రదీప్.

"అయితే పదండి" అన్నాడు దినేష్.

ముగ్గురువెళ్ళి హొటల్‌లో కూర్చున్నారు.

"ఇప్పుడు కృష్ణమూర్తినెలా రక్షించడం" అడిగాడు నరేంద్ర.

దినేష్ ఆలోచిస్తూ ఉండిపోయాడు. "ఒక ఉపాయం తట్టింది" అన్నాడు దినేష్.

ప్రదీప్, నరేంద్రలు దగ్గరకి జరిగారు.

దినేష్ తగ్గుస్వరంతో చెప్పడం ప్రారంభించాడు.



నెమ్మదిగా కళ్ళుతెరిచాడు కృష్ణమూర్తి. తల మీద బొప్పికట్టింది. తడుముకున్నాడు. దెబ్బ అంతగట్టిగా తగల్లేదు. షాక్‌కి స్పృహ తప్పిందన్నమాట. ఆ ప్రదేశం అంతా తడితడిగావుంది. అసలు ఏమాత్రం కనిపించటంలేదు. ఎటుచూసినా చీకటే, ఎటూకదలలేని పరిస్థితి.

ఐదు నిముషాలకిగాని కళ్ళు ఆ చీకటికి అలవాటుపడలేదు. అలవాటు పడిన తరువాత పరిసరాలని గమనించసాగాడు. వెనక్కి చూసి ఆశ్చర్యపోయాడు.

"హలో హౌఆర్‌యు మైడియర్ యంగ్ ఫ్రెండ్" అన్నాడు ఎదరఉన్న వ్యక్తి.

ఆయనకి నలభై, యాభైమధ్యన వయసుంటుంది. ఆయన కళ్ళు నిర్మలంగావున్నాయి. ఈ భూగోళం బద్దలైపోతుందన్నా ఈ ప్రపంచం తలకిందులయినా, పట్టించుకోని నిర్లిప్తత ఆయన కళ్ళల్లో ప్రస్ఫుటమవుతుంది. విశాలమైన నుదురు ఆయన విజ్ఞానాన్ని తెలిపితే, కొనదేరిన నాసిక ఆయన నిర్భయత్వాన్ని తెలుపుతుంది.

"ఏమిటి ఫ్రెండ్ మాట్లాడవు. నేనెవరా అని ఆశ్చర్యపోతున్నావా. నేను నీలాంటివాడినే. ఇక్కడ జరుగుతున్నది ఏమిటి అసలు దేవి అనబడే ఈ కాంతమ్మ ఎవరు మొదలైన విషయాలు తెలుసుకుందామన్న ఉత్సాహంతో ఇక్కడకివచ్చి, వీళ్ళచేతుల్లో ఇరుక్కున్నాను. నన్నుచాలా జాగ్రత్తగానే మేపుతున్నారు. కాకపోతే మాట్లాడటానికి ఎవరూ లేకుండా చేశారు. ఇప్పుడు నువ్వొచ్చావుకదా. హాయిగా ఇద్దరం కబుర్లు చెప్పుకోవచ్చు" అన్నారాయన.

"మీ పేరు చెప్పలేదు"

"పేరులో ఏముంది పెన్నిధి అన్నారు. నన్ను "ఎక్స్" అనుకో."

"ఒకవేళ అనుకున్నాననుకోండి. మనకి తెలియనిదానిని, తెలుసుకోవాలనుకుంటున్న దానిని ఎక్స్ అనుకుంటాము. ప్రస్తుతానికి మీపేరు ఎక్స్ అనుకున్నాననుకోండి, మీరు మీపేరు కనుక్కోడానికి ఏవో కొన్ని ఈక్వేషన్లే, లేకఏమైనా కొన్ని క్లూలో ఇవ్వాలిగదా"

"సెహబాష్ ఫ్రెండ్... నీకు లెక్కలగురించి బాగా తెలుసే... సరే అయితే నాపేరు కనుక్కో ఈక్వేషన్స్ ఇస్తాను" అని "ఇంగ్లీషు ఆల్ఫబెట్స్ అన్నిటికి అంటే A కి 1, B కి 2 అలాగా నెంబర్స్ ఇవ్వు.

నాపేరులో ఉన్న మూడక్షరాలకి వచ్చిన నెంబర్లమొత్తం 29 మూడింటిని గుణిస్తే వచ్చిన లబ్దం 180. మొదటి రెండక్షరాలకి వచ్చినవాటిని గుణించి వచ్చిన దానిని ఐదుతో గుణించి వచ్చిన లబ్దాన్ని చివరి ఆల్ఫబెట్‌తో భాగిస్తే వచ్చినది తొమ్మిది అయితే నాపేరేంటి ఫ్రెండ్"

"మూడు అన్‌నోన్స్ మూడు ఈక్వేషన్లు సాల్వ్‌చేస్తే వచ్చేస్తుంది" అన్నాడు కృష్ణమూర్తి.

"అదికాదు మిత్రమా నాకు కావలసినది నాపేరు అది రెండు నిముషాలలో" అన్నారాయన.

నోటిలోనే లెక్కేయడం ప్రారంభించాడు. చివరిది పది అని తేలిపోయింది. ఇంకొక నిముషంలో మిగతావి రెండు పదునెనిమిది ఒకటి అని తెలిసిపోయాయి.

"మీపేరు రాజుకదూ" అన్నాడు రెండునిముషాలు అవకముందే.

"గుడ్ - యూ ఆర్ రియల్లి ఎ గ్రేట్ మేథమెటీషియన్" అన్నారాయన. ఆయన జీవితంలో అంత ఫాస్ట్‌గా చేయగా చూసింది కృష్ణమూర్తినే.

"అయితే నాపేరు కనుక్కుంటారా" అడిగాడు కృష్ణమూర్తి.

"ఓ కనుక్కుంటాను" అన్నారాయన.

"ఇది లెక్కకాదు లాజిక్‌కాదు. పరిసరాల మీద ఆధారపడినది"

"చెప్పు"

"ఇప్పుడు మీరు నాపేరు నీడలోనే ఉన్నారు" అన్నాడు కృష్ణమూర్తి. ఆయనకి అర్థంకాలేదు. ఆయన వెనక కృష్ణుని విగ్రహం. దాని నీడలో ఆయన ఉన్నా ఆయనకి ఎంతకి అర్థంకాలేదు.

"అబ్బె తెలియట్లేదయ్యా!" అన్నారాయన.

మీరిప్పుడు వెనక్కి ఒకసారి చూసుకోండి.

ఎవరినీడలో ఉన్నారో అర్థమౌతుంది'' వెనక్కితిరిగారు వెనక కృష్ణుని విగ్రహం. చేతిలో పిల్లనగ్రోవి.

''ఓహో... నీపేరు కృష్ణా'' అడిగారాయన.

''ఇంకా ఉంది. మీరు దేని నీడలో ఉన్నారో చెప్పండి. అదే నాపేరు''

''కృష్ణుని నీడలోనే ఉన్నాను''

''కృష్ణుడి నీడలో ఉన్నారా. ఆ విగ్రహానికి ప్రాణం ఉంటే మీరన్నది ఒప్పుకోవచ్చు'' అన్నాడు కృష్ణమూర్తి.

కృష్ణమూర్తి లాజిక్ ఏంటో ఆయనకి అసలు అర్థంకాలేదు. కృష్ణమూర్తే చెప్పసాగాడు- ''మీరిప్పుడు ఉన్నది కృష్ణనిమూర్తి నీడలో అంటే కృష్ణమూర్తినీడలోనన్నమాట''

''అయితే నీ పేరు కృష్ణమూర్తా?'' అని ''ఇందాక నీకు ఎంకరేజ్‌మెంట్‌కి నువ్వు గ్రేట్ మేథమెటీషన్‌వి అన్నాను. ఇప్పుడు నిజంగా అంటున్నాను యూఆర్‌ఎ జీనియస్ '' అన్నారాయన.

కృష్ణమూర్తి సిగ్గుపడిపోతూ ''థాంక్యూసర్'' అన్నాడు.

''అడగటం మరచిపోయాను. నువ్వు ఇక్కడికి ఎందుకు వచ్చావు. వీళ్లకి ఎలాదొరికిపోయావు'' అడిగారాయన.

''పెద్దవారు మీరు ముందు చెప్పండి'' అడిగాడు కృష్ణమూర్తి.

''సరే... చెవుతాను. నేను మేథమెటిక్స్ ప్రొఫెసర్‌ని. నాకు దేవుడిపేరు చెప్పి ప్రజలని మోసం చేసేవారంటే అసహ్యం. నాకు చాతనైనంతవరకు వాళ్లఆటలు కట్టించడానికి ప్రయత్నిస్తుంటాను. కాని ఇంతవరకు ఎవరి ఆటలు కట్టించలేకపోయాను. ఈ దేవి ఆట కట్టించే అవకాశం తృటిలో తప్పిపోయింది.

''నేను చాలా రోజుల నుంచి ఇక్కడి పరిస్థితులన్నిటిని గమనిస్తూనే ఉన్నాను. నాతోపాటు కెమేరాలు, టేప్ రికార్డర్ అన్నీ తెచ్చుకున్నాను. దేవి ఉండే గది తలుపులు ఎప్పుడూ గెడపెట్టి ఉండకపోవడం గమనించాను. ఎలాగైనా వీళ్లకి మస్కాకొట్టి లోపలకి వెళ్లాలని నిర్ణయించుకున్నాను. ఆ అవకాశం ఈమధ్యే వచ్చింది.

ఆరోజు సుకుమార్ అనే ఓ కుర్రవాడు నీ. అంతే ఉంటాడు. అక్కడున్నవాళ్లతో ఏదోగొడవ పడుతున్నాడు. అదే మంచిసమయం అని లోపలికి వెళ్లిపోయాను. లోపల చాలామంది ఉన్నారు. బయటుంటే ఎవరు, ఎవరో గుర్తుపట్టగల్గుతున్నారు కాని లోపల నన్ను వేరేవాడిగా ఎవరూ గుర్తించలేదు. అందరూ ముందుమూడు గదులలోనే నడుస్తున్నారు కాని విడిగావున్న గదిదగ్గరకాని ఆ గదిముందు కాని ఎవరూ తిరగటంలేదు. అదే దేవిగది అని గ్రహించాను. దానిముందు ఒకడు నిలబడివున్నాడు. వాణ్ణి దాటుకొని లోపలకి వెళ్లడంకష్టం. వాడు దేవిగది దగ్గరకి ఒక్కొక్కరినే పంపుతున్నాడు. బయట గొడవ జరుగుతుండటంతో వీళ్లుకూడా క్యూరియాసిటీతో ముందుగదులలోకి వెళ్లారు. ఆ సుకుమార్ ఎవరో కానీ భలే గొడవచేశాడులే.

ఆ గొడవకి దేవి బయటకొచ్చి, వాణ్ణి లోపలికి పంపమని చెప్పింది. సుకుమార్ లోపలకి వెళ్లాడు. లోపలి సంభాషణ నాకు చాలా క్లియర్‌గా వినిపించింది. సుకుమార్ రాగానే ''కాంతమ్మగారూ, ఇప్పుడు మీరు నేను చెప్పినట్టుచేయాలి. లేకపోతే మీకే నష్టం'' అన్నాడు.

''ఎవ్వరు కాంతమ్మ'' అంది దేవి.

''నువ్వే ఈ మూర్ఖప్రజలని నీ మేజిక్‌లతో నమ్మించగలవేమోకాని నీగురించి పూర్తిగా తెలిసిన నన్నేమీ చేయలేవు''

కొన్ని క్షణాలు మౌనంగా గడిచిపోయాయి.

''నేనేం చేయాలి?'' అడిగింది దేవి.

''నీకొడుకు. వాడే శ్రీధర్‌కి పెళ్లి నిశ్చయించినట్టున్నావు''

''అవును''

''దేవితోనే కదా''

''అవును''

''ఆమె లక్షల ఆస్తికి వారసుడిని చేయాలన్న కోరికతోనువ్వు దేవితో ప్రేమించినవాడిని చేసుకుంటే, వాడు చచ్చిపోతాడని చెప్పావు కదూ''

ఈసారి కాంతమ్మ ఆశ్చర్యపోయింది- ఈ విషయాలన్నీ వీడికెలా తెలుసా అని కాబోలు.

"నేను ఎవరి ఆస్తి కాజెయ్యాలనీ అలా చెప్పలేదు. నా భక్తుడి కూతురు మంచికోసం చెప్పాను అంతే" అంది దేవి.

"నేను నీకు ముందే చెప్పాను నా దగ్గర కుప్పిగంతులు వేయవద్దని. నిజం చెప్పు... అది నీకు, నాకు ఇద్దరికి మంచిది"

ఏదో ఒక నిర్ణయానికివచ్చి" అవును... నిజమే. నేను డబ్బుకోసమే ఈ పనులన్నీ చేస్తున్నాను. నా కొడుకుని లక్షాధికారిని చేద్దామన్న వుద్దేశంతోనే చేశాను... ఇప్పుడేమంటావు?"

"నువ్వు ఈ ప్రజలని ఎలా దోచుకున్నా ఫరవాలేదు... దేవి జోలికిమాత్రంరాకు. వచ్చావో తీవ్ర పరిణామాలు ఎదుర్కోవలసి వుంటుంది"

"నిన్ను ఇప్పుడే బంధించేస్తే?"

"అది నాకేమంచిది. నా పోలీస్ ఫ్రెండ్‌తో చెప్పే వచ్చాను. నేను ఒక గంటలోనీ దగ్గరకి రాకపోతే నువ్వే నీ బలంతో ఇక్కడికి వచ్చెయ్యరా అని. అంతేకాదు నీ వాళ్ళందరు చూస్తుండగా లోపలకి వచ్చాను. నన్ను బంధిస్తే నేనేమయ్యానో వాళ్ళందరికి ఏమని సమాధానం చెబుతావు?"

"ఇంతకీ నన్నేం చేయమంటావు?"

"చెప్పానుకదా, దేవి జోలికి రాకు... నేను నీ జోలికిరాను"

"అది ఇంపాజిబులొ"

"అయితే కటకటాలు లెక్కపెట్టుకోడానికి రెడీగావుండు"

"నన్ను జైలుకి పంపడం నీతరంకాదు"

"మా తరం, అంటే మా యువతరం తరం అవుతుంది. రేపు నీ దగ్గరకొచ్చి నీ గొప్పతనాన్ని ప్రజలముందు బయటపెడతాను. వానర సైన్యం వస్తుంది" అన్నాడు సుకుమార్

ఎవర్నో పిలిచింది దేవి. ఇందాక బయటున్న వాడు లోపలికి వచ్చాడు. "వీణ్ణి బయటకు గెంటు... దేవుణ్ణి నిందిస్తున్నాడు" అంది.

"నా కోరిక ఒప్పుకోవా కాంతమ్మా" అన్నాడు.

"నన్నలా పిలుస్తుంటే వూరుకుంటావే. తన్ని తగలెయ్యక" అంది దేవి ఆగ్రహంగా.

అతన్ని బయటకు తీసుకువెళ్ళిపోయారు. దేవి కూడా అతనితోపాటు బయటకు వెళ్ళింది "సుకుమార్ నువ్వు పాము కాటుకి గురై మరణిస్తావ్" అని శపించిందట- అది తరువాత తెలిసింది నాకు.

మళ్ళీ పావుగంట తరువాత లోపలకి వచ్చింది దేవి ఆమెతోపాటు ఇంకెవరో వచ్చినట్టున్నారు.

"శ్రీధర్... ఇప్పుడేంచేద్దాం?" అని అడిగింది.

"చేయడానికి ఏముంది... వీణ్ని చంపెయ్యడమే" అన్నాడు శ్రీధర్.

"ఎలా?"

"ఏముంది... పాము కాటుతో పైకి పంపించేస్తాము. నీ శాపం నిజమవుతుంది".

"కాని మనకి పామెక్కడ దొరుకుతుందిరా, ఆవేశంలో ఏదో అనేశాను కానీ"

"నేనుండగా నీకెందుకు భయం మనవాళ్ళకి పురమాయించానంటే నిముషాల్లో పాము వస్తుంది, దాన్ని ఆడించే మనిషి వస్తాడు"అన్నాడు శ్రీధర్‌కి ఈ ప్రపంచంలో అసాధ్యం అనేది ఏదీలేదేమోనని పించింది నాకా క్షణం. ఎంత మామూలుగా మనిషిని చంపేద్దామంటున్నాడూ అనుకొన్నాను.

శ్రీధర్ అక్కడినుంచి, నాముందునుంచే ఇప్పుడు మనమున్న చోటికి వచ్చాడు. ఇక్కడ చాలామంది పేకాడుకుంటున్నారు అప్పుడు వాడి వెనకాలేవెళ్ళి ఇదిగో ఈ విగ్రహం వెనుక దాక్కున్నాను. నియాన్ లైట్లు వేసుకొని మరీ అడుగుతున్నారు వాళ్ళు. ఒక స్నాప్ తీసేసాను. ఇంకోటి వాళ్ళతో శ్రీధర్‌ని.

నేను వాళ్ళకి చాలా దూరంలో వుండటంతో వాళ్ళ మాటలు నాకు వినబడలేదు. కొద్దిసేపటికి వాళ్ళు అక్కడనుంచి గబగబా పరిగెత్తుతున్నట్టు వెళ్ళిపోయారు.

శ్రీధర్ అక్కడినుంచి వెళ్ళలేదు. కొద్దిసేపటికి దేవి కూడా... అదే కాంతమ్మ కూడా అక్కడికి వచ్చింది.

"తీసుకురావడానికి ఎవరినైనా పంపావా?" అడిగింది ఆమె.





అక్టోబర్ విడుదల!

అఖిలాంధ్ర పాఠకుల
అభిమాన రచయిత్రి

# శ్రీమతి యద్దనపూడి సులోచనారాణి

వినూత్న డైరెక్ట్ నవల

---

# నిశాంత

---

ఈ నాగరికతా, కాంక్రీట్ కీకారణ్యంలో,
మానవత్వానికి దూరంగా వెళ్తున్న
మనిషిమీద పూరించిన ఒక శంఖారావం!

"పంపాను ఇంకొద్ది సేపట్లో వచ్చేస్తారు" అన్నాడు.

వాళ్ళిద్దరినీ ఇంకో స్నాప్ లాగేశాను.

కొద్దిసేపటికి ఇందాక పరిగెత్తుకొని వెళ్ళిన వాళ్ళు ఎవరినో తీసుకొని వచ్చారు. వాడి బుట్టలో పాములుండటంతో పాములు పట్టేవాడని రూఢీ చేసుకున్నాను. వాడితో అమ్మ, కొడుకులిద్దరినీ ఇంకో స్నాప్ లాగేశాను.

వాళ్ళు సుకుమార్‌ని చంపించడానికి ప్లాన్ వేస్తున్నారు అనుకున్నాను. కొద్దిసేపు మాట్లాడుకొని వెళ్ళిపోయారు బయటకి. ఇందాక వున్న వాళ్ళు కూడా వెళ్ళిపోయారు నన్ను ఒంటరిగా వదిలేసి అప్పటినుంచి ఇక్కడే వున్నాను. అప్పుడప్పుడు ఈ గదిలోకి వచ్చి దేవుడికి ఫలహారాలు పెడుతుంటారు. వాటిని అరగించి బతుకుతున్నాను" అని ఆపారాయన.

"వాళ్ళు మిమ్మల్ని ఇంతవరకు చూడలేదా?" ఆశ్చర్యంగా అడిగాడు కృష్ణమూర్తి.

"చూడలేదు ఫ్రెండ్"

"మరిందాక వాళ్ళకి దొరికిపోయాను అని ఇంకా ఏదో అన్నారు?"

ఊరికే సరదాగా అన్నానుకాని నీ విషయం చెప్పు?"

అప్పటినుంచి తప్పించుకోలేదా మీరు"?

"ఇదేమైనా సినిమా అనుకుంటున్నావా? మనిష్టం వచ్చిన వైపుదారి వుండటం అందులోనుంచి పారిపోవడానికి"

"మనసుంటే మార్గముంటుంది అంటారు పెద్దలు"

"నేను పెద్ద వాణ్ణికాని నేనెప్పుడూ అనలేదు. నాకంటే పెద్దలు అన్నారు అనుకొన్నా నాకు మనసులేదు. ఉన్నది గుండె అంటే హృదయం మాత్రమే.

అప్పుడే తలుపు తెరుచుకున్న చప్పుడు అవడంతో ఆయన విగ్రహం వెనక దాక్కున్నారు.

శ్రీధర్ లోనికి వచ్చాడు ఇంకొక వ్యక్తితో. "ఇదిగోండి... ఇతనే నేను చెప్పిన వ్యక్తి" అన్నాడు కృష్ణమూర్తిని చూపెడుతూ.



"తరువాత ఏమైనా కేసులు వస్తాయేమో" అనుమానంగా అడిగాడా వ్యక్తి.

"చూడండి రావ్‌గారు! మీరు దేవునిపై భారంవేసి నిశ్చింతగా వుండండి. మీమీదకి ఏ కేసు రాకుండా చూసే పూచీనాది"

"ముహూర్తం ఎప్పుడు పెట్టారు?"

"నా పెళ్ళిరోజే అదే మంచి ముహూర్తం అంట" అన్నాడు శ్రీధర్.

వాళ్ళు మాట్లాడుకుంటున్నది అసలు ఏమీ అర్థంకాలేదు కృష్ణమూర్తికి.

"వీడు చేసుకుంటున్నది దేవినేకదా" అనుకున్నాడు మనసులో.

కృష్ణమూర్తి దగ్గరకు వచ్చాడు. "చూడమ్మా కృష్ణమూర్తీ... మనకంటే బలవంతుల జోలికి మనమెప్పుడూ వెళ్ళకూడదు. మొన్ననీ స్నేహితుడు మమ్మల్ని అది చేస్తాను, ఇది చేస్తాను అని ఏవేవో కబుర్లు చెప్పి ఏమిచేయకుండానే పైకి పోయాడు. నువ్వు హీరోలా లోపలకివచ్చి ఏదో చేసేద్దామనుకొని చేతికి చిక్కిపోయావ్. నీ చావుకికూడా ముహూర్తం పెట్టేశాం. నా పెళ్ళి రోజే నీ చావు రోజు. మీ ఫ్రెండ్ చనిపోయి మాకు బోల్డంత పబ్లిసిటీ ఇస్తే, నువ్వు చావబోతూ మాకు లక్షల డబ్బు వచ్చేలా చేస్తున్నావు. నిన్ను నరబలి ఇవ్వబోతున్నాం' అని చిన్నగా నవ్వాడు "నీ ప్రాణాలు అనంత వాయువుల్లో కలిసి పోవడం నేను దేవి మెడలో మంగళసూత్రాలు కట్టడం ఒకేసారి జరుగుతాయి. కుదిరితే మళ్ళీ కలుద్దాం" అని వచ్చిన వ్యక్తిని తీసుకొని వెళ్ళిపోయాడు శ్రీధర్.

మనుషులలో నరరూప రాక్షసులు వుంటారని విన్నాడుకాని అలాంటి వాడిని చూడటం అదే ప్రథమం కృష్ణమూర్తికి. అతను నిస్తేజంగా, నిశ్చలంగా వుండిపోయాడు. చావు తనని కబళించడానికి రెడీగా వుందని తెలుసు. అతనికి దేవిలేని తన జీవితం వ్యర్థమని ఎప్పుడో నిర్ణయించుకొన్నాడు. కానీ దేవికి ఈ ఛండాలుడితో పెళ్ళంటేనే అతనికి బాధగా వుంది. తనేమయిపోయినా ఫరవాలేదు. ఈ రాక్షసుడితో దేవి పెళ్ళి జరగకుండా చూడాలి అనుకున్నాడు కృష్ణమూర్తి.

తన దగ్గర ఎటువంటి ఆయుధాలు లేవు. ఎలా వాళ్ళని ఎదుర్కోవడం.

దేవుని విగ్రహం దగ్గర నుంచి బయటకు వచ్చారు రాజుగారు.

"నా కట్లు విప్పండి" అన్నాడు కృష్ణమూర్తి ఆయన విప్పేశారు.

"మళ్ళీ అడుగుల చప్పుడు వినబడింది. రాజుగారికి కృష్ణమూర్తి చేతులు కట్టేంత సమయంలేక పక్కకి వెళ్ళిపోయారు.




"నమస్కారం కృష్ణారావుగారూ" అన్నాడు నరేంద్ర.

"నమస్తే. మీరెవరో నాకు తెలియదే?" అన్నారాయన.

"మీకు దూరపు బంధువుని. మీ చెల్లెలి ఆడపడచు నాకు వరసకి వదినవుతుందండి. కాకినాడ పని ఉండి వెళుతున్నానూ అంటే, మిమ్మల్ని కలవమని మీ అడ్రస్సు ఇచ్చిందండి మా వదిన" అన్నాడు నరేంద్ర. వాళ్ళ చెల్లెలు అత్తవారింటి వైపు చుట్టాలు సరిగా తెలిసివుండరని; ఒకవేళ అటువంటి వ్యక్తి లేడని తెలిసినా అనలేరని అతని ఉద్దేశం.

"అలాగా బాబూ, నీ పేరేమిటి?"

"నరేంద్ర అండి"

"ఏం పనిమీద వచ్చావు?"

ఆ ప్రశ్న కోసమే ఎదురుచూస్తున్న నరేంద్ర, "ఇక్కడ కృష్ణభగవానుని భక్తజన సంఘం ఉందటకదండి! అక్కడున్న దేవి చాలా మహత్తుగలదంటకదండి?" అడిగాడు.

"అవును బాబూ... ఆవిడతో నీకేమి పని?"

"ఆవిడని కలవాలండి. ఎలా కలవాలో తెలియటంలేదు. అక్కడికి వెళ్ళి అడిగితే సభ్యులకు మాత్రమే ఆవిడతో మాట్లాడే అవకాశం ఉందంటున్నారు. సభ్యులు ఎలా అవ్వాలి అని అడిగితే చెప్పటంలేదు"

"ఈమధ్య దేవి మీద హత్యాప్రయత్నాలు జరిగాయి బాబూ! ఆవిడని నిందించిన ఒకడు పాముకాటుకి గురై మరణించాడు. మళ్ళీ చిన్నచిన్న డిస్టర్బెన్సెస్ కలుగుతున్నాయి. అందుకే కొత్త వాళ్ళనెవరినీ సభ్యులుగా చేర్చుకోవటంలేదు"

"అయితే ఇంక దేవిని దర్శించుకునే అవకాశమే లేదా?" నీరసంగా అడిగాడు. అలా అన్న తరువాత నిట్టూర్చడం మరచిపోలేదు నరేంద్ర.

నరేంద్ర పరిస్థితి చూసి ఆయన మనసులో జాలికలిగింది. "నేను ఆ సంఘంలో సభ్యుడినే బాబు" అన్నారు.

"మీరు అందులో సభ్యులా! ఆహా... ఎంత సుకృతం చేసుకున్నారు. దేవుడిని మీరిప్పటికి ఎన్నిసార్లు చూశారు?" ఆరాధనగా ఆయన వైపు చూస్తూ అన్నాడు నరేంద్ర.

నరేంద్ర అమాయకత్వానికి నవ్వుకున్నారాయన. పల్లెటూళ్ళల్లో ఇలా అనుకుంటున్నారన్నమాట– సభ్యులందరూ దేవుడితో మాట్లాడేస్తున్నారని.

"దేవుడు మనతో మాట్లాడడు. ఆయన మనతో మాట్లాడాలంటే బోల్డంత పుణ్యం చేసుకుని ఉండాలి. ఏమి మాట్లాడాలన్నా దేవుని ప్రతినిధితోనే" అన్నారాయన.

"అవును... నిజమేనండి. దేవుని ప్రాపకం సంపాదించాలంటే ఎంతో కష్టపడాలి. దేవుని మీదే మనసు లగ్నం చేసి, శరీరాన్ని మనస్సుని దేవునికే అంకితం చేయాలి"

"నీకెవరు చెప్పారు ఈ విషయం?"

"మా నాన్న అంటుంటాడు ఇప్పుడు కూడా. ఆయన పంపితేనే దర్శించుకుపోదామని వచ్చాను. వాళ్ళేమో కుదరదన్నారు"

ఈసారి కృష్ణారావుగారి మనసులో జాలి మరింత పెల్లుబికింది.

ఆయన కళ్ళు కూడా తడి అయ్యాయి. ఆ విధంగా ఆయనని చూడగానే, "అబ్బ... వివరీ

తంగా నటించేస్తున్నట్టున్నానే" అనుకొని "ఏమైనా అలాంటివాళ్లని దర్శించుకోవాలంటే పెట్టిపుట్టాలి. నా దురదృష్టం అంతాఏం చేస్తాం?" అన్నాడు.

"నిన్ను దేవి దగ్గరికి నేను తీసుకువెళతానులే. ఈరోజుకి ఇక్కడే ఉండిపో" అన్నారాయన.

ఆ మాటలు అన్న మరుక్షణం కళ్ళు మూసి తెరిచేలోగా ఆయన కాళ్ళమీద సాష్టాంగపడిపోయాడు నరేంద్ర.

"ఛఛ... ఏంటోయ్ ఇది?" అని పైకిలేపారు నరేంద్రని.

"మా వదిన మీగురించి చెబుతుంటే ఏదో పొగుడుతోంది అనుకున్నాను. మీరు నిజంగా గొప్పవారు" అన్నాడు నరేంద్ర.

ఆయనకి ఏం మాట్లాడాలో తెలియలేదు. నరేంద్ర పొగుడుతూంటే అదోలా అనిపించింది ఆయనకి.

రాత్రి భోజనాలు అయిన తరువాత ఆరుబయట కుర్చీలు వేసుకొని కూర్చున్నారు ఇద్దరూ. ఇల్లు ఊరికి దూరంగా ఉందేమో అస్సలు గొడవ వినబడటంలేదు. మబ్బులతో దోబూచులాడుతున్నాడు చంద్రుడు.

"అవును బాబు... మీ వదినావాళ్లు అందరూ బాగున్నారా?" అడిగారాయన.

"బాగున్నారండి. మీకు నమస్కారాలు అని చెప్పమందండి వదిన" అన్నాడు నరేంద్ర.

ఆ వదిన ఎవరో ఆయనకి ఎంతకీ అర్థం కావటంలేదు. అలాగని ఎవరు ఆవిడ అని అడుగుదామంటే, ఇంత అభిమానంగా తన గురించి చెప్పిన మనిషిని తను మర్చిపోయాడనుకుంటారేమో అని ఊరుకున్నారు.

ఈయన ఆ విషయాలు మాట్లాడితే ఎక్కడో ఒకచోట దొరికిపోయే అవకాశం ఉందనిపించింది నరేంద్రకు. టాపిక్ మార్చేయాలని అనుకున్నాడు. అప్పుడే జ్ఞాపకం వచ్చింది– ప్రదీప్ ఆ ఇంట్లో ఉన్న అమ్మాయిని ప్రేమిస్తున్నాను అన్నాడని.

"అమ్మాయి కనబడటంలేదేమిటండి?" అడిగాడు నరేంద్ర.

"లోపల ఉంది. పిలుస్తానుండు" అని "అమ్మా రాధికా... ఇటురా" అన్నారాయన.

"వస్తున్నా నాన్నా" అన్న మాటలు. వాటితో పాటు అందమైన కుందనపు బొమ్మలా ఉన్న అమ్మాయి బయటకు వచ్చింది. చంద్రుని లేలేత వెన్నెల కిరణాలు ఆమె మొహంమీదపడి ఆమె మోముని ప్రకాశవంతం చేస్తున్నాయి. అజంతా శిల్పంలా అందాన్నంతా తన సొంతం చేసుకుందా ఈ అమ్మాయి అనిపించేలా ఉంది.

"మా అమ్మాయి రాధిక" అని పరిచయం చేసి "మీ బాబాయి నరేంద్ర అమ్మా" అన్నారు ఆయన.

"నమస్కారమండీ" వినమ్రతగా అంది.

"పదికాలాలపాటు పిల్లా పాపలతో సుఖంగా జీవించమ్మా" అన్నాడు నరేంద్ర. అన్న తరువాత తను టూమచ్‌గా నటించేశానని అర్థమైంది. తనుబాగా నటిస్తున్నానని ఏ నటునికైనా అనిపించిన తక్షణం ఓవర్ యాక్షన్ చేయడం మొదలుపెడతాడు. తనూ అదేపని చేశాడు. సినిమాల ప్రభావం తనమీద బాగా పెరిగిపోయింది. ఈ సభ్యసమాజంలో ఎవరినైనా దీవించాలంటే ఆంగ్లేయుల్లా దీవించాలి లేదా విష్ చేసి ఊరుకోవాలి అనుకున్నాడు. తను చేసిన పొరపాటుని దిద్దుకోడానికి, "అమ్మాయిది అచ్చం మీపోలికే. ఆ ముక్కు, కనులతీరు అంతా మీరే" అన్నాడు. అది అతికినట్టుగా లేదనిపించింది. అనేసిన తరువాత జ్ఞాపకం వచ్చింది ముక్కు, కనుల తీరుకాదు, కనుముక్కుతీరని.

కృష్ణారావుగారికి నరేంద్ర ఆశీర్వదించడం వినగానే తన చిన్నతనం జ్ఞాపకం వచ్చింది. పల్లెటూళ్ళో గడిపిన మధురక్షణాలు జ్ఞాపకం వచ్చాయి. ఆరోజులు మళ్ళీ రావు. ఆ కల్లాకపటం ఎరుగని మనుషులని కూడా ఇప్పుడెక్కడా చూడలేము. అక్కడక్కడ నరేంద్ర లాంటి అమాయకత్వం మూర్తీభవించిన వ్యక్తులుంటారు అనుకున్నారు. అమ్మాయి తన పోలికే అవడం ఆయనకి ఆనందం కలిగించింది.

ఆయన అలా ఆలోచిస్తూ ఉండి పోవడం చూస్తూంటే నరేంద్రకి తనేమైనా తప్పుగా




మాట్లాడి దొరికిపోలేదుకదా అనిపించింది. అమ్మో... దొరికిపోతే ఇంకేమైనా ఉందా?

వాళ్ళిద్దరూ ఎవరి ఇష్టమొచ్చినట్టు వాళ్ళు ఆలోచించేసుకుంటు ఉండడంతో రాధికకి ఏం చెయ్యాలో తెలియలేదు. అక్కడ అలాగే నిల బడిపోయింది.



"ఏమిటండీ అలా ఆలోచిస్తు ఉండిపోయారు" అడిగాడు సరేంద్ర.

"ఏమీలేదు. నిన్ను చూస్తుంటే నా చిన్ననాటి రోజులు జ్ఞాపకం వస్తున్నాయి. ఆరోజులే వేరు" అన్నారాయన.

"పదేళ్ళనాటి సిన్మాలోనూ ' మారోజులే వేరు' అంటారు. నిన్న వచ్చిన సినిమాలోనూ అదేడైలాగ్ అన్నాడు సరేంద్ర.

కృష్ణారావ్‌గారు ఏదో చెప్పుదామని నోరు తెరిచేలోపునే- "ఎవరికైనా తమ జీవితంలో జ్ఞా

వకం ఉంచుకునే వయసు పది, ఇరవై అయిదు మధ్య ఉంటుంది. అప్పుడు వాళ్ళు ఎంతో ఆనందంగా గడిపేస్తారు. వాళ్ళు ముసలి వాళ్ళయిపోయేసరికి వ్యవస్థలో చాలా మార్పు వచ్చేస్తుంది. అప్పటి ఆనందాలు వాళ్ళకి ఇప్పుడు కలగవు అందుకే పెద్దవాళ్లెప్పుడూ మారోజులే వేరు అంటుంటారు'' అంది రాధిక.

మెచ్చుకోలుగా చూశాడు నరేంద్ర రాధిక వైపు.

''అమ్మాయికి పెళ్ళి సంబంధాలు చూస్తున్నారా'' అడిగాడు నరేంద్ర.

''ఈ సంవత్సరమే చూద్దామనుకొంటున్నాను''.

''ఇక్కడే నాకు తెలిసిన వాడొకడున్నాడు. ఏదో బ్యాంక్ అనుకుంట. ఉద్యోగం చేస్తున్నాడు. పేరు ప్రదీప్. మనిషి మంచివాడు. ఏదురలవాట్లు లేవు. అమ్మాయికి ఈ పెళ్ళి సంబంధం చూడమంటారా'' అడిగాడు నరేంద్ర.

''నీకు బాగా తెలుసా?''

''బాగా తెలుసా అని అడుగుతారేంటండి. వాడు, నేను కలసి చదువుకున్నాము. రేపు మధ్యాహ్నం వెళ్లి తీసుకురమ్మంటారేంటి?''

''అలాగే తీసుకురా'' అన్నారాయన.

''అమ్మాయి నచ్చితే కట్నం కూడా తీసుకోదనుకుంటాను.''

''కట్నందేముందిలే. నాకున్నది ఒకే అమ్మాయి. నా తర్వాత నా ఆస్తి అంతా దానిదే కదా'' అన్నారాయన.

ఇద్దరూ చాలాసేపు ప్రదీప్ గురించి మాట్లాడుకున్నారు. నరేంద్ర మాట్లాడినంతసేపు వదిన విషయం రాకుండా జాగ్రత్త పడ్డాడు.

నరేంద్రకి ఒక గది ఇచ్చేసారు పడుకోటానికి. ఆ గదికి వాళ్లు బైట గెడ వేసుకోవడం నవ్వు తెప్పించింది నరేంద్రకి. తననింకా పూర్తిగా నమ్మలేదన్నమాట.

★ ★ ★

ఉదయం కాలకృత్యాలు పూర్తి చేసుకొని కృష్ణారావుగారితో దేవి దర్శనానికి వెళ్లాడు నరేంద్ర. అక్కడ శ్రీధర్ పెళ్లికి అన్నీ రడీ చేసేస్తున్నారు.

''ఏంటండీ... ఏం జరుగుతోంది?''

''దేవి భక్తుని పెళ్లి''

''ఎవరా భక్తుడు? అదృష్టవంతుడు... దేవి చేతులమీదుగా పెళ్లి చేసుకుంటున్నాడు''

''శ్రీధర్... అదిగో అతనే శ్రీధర్ అంటే''.

''బాగానే ఉన్నాడు'' అనుకొన్నాడు. వెంకట్రావుగారన్న ''దేవి కొడుకు శ్రీధర్'' మాటలు జ్ఞాపకం వచ్చాయి నరేంద్రకి. కొంప తీసి వాడే వీడు కాదుకదా అనుకున్నాడు.

దేవి దగ్గరికి తీసుకువెళ్లాడు నరేంద్రని. ''మా చుట్టాలబ్బాయి. మిమ్మల్ని దర్శించుకోవాలని వచ్చాడు'' అన్నారు కృష్ణారావుగారు దేవితో.

అతన్ని బయటకి పంపేయమన్నట్టు సంజ్ఞ చేసింది దేవి.

''నువ్వు బయటుండు, నేనిప్పుడే వచ్చేస్తాను'' అన్నారాయన.

నరేంద్ర వెళ్లాక- ''పది వేలు సిద్ధం చేసావా... ఇంకా పది రోజులే ఉంది'' అంది దేవి.

''ఆరోజున ఇస్తాను'' అన్నారాయన.

''నీ ఇష్టం'' అని మౌనంగా తపోధ్యానంలోకి వెళ్లిపోయారు.

అక్కడినుంచి బయటకు వచ్చేసారు ఆయన. శ్రీధర్ అక్కడ పనులు పురమాయిస్తున్నాడు. అతను చేస్తున్న అథార్టీ చూస్తుంటే దేవి కొడుకేనేమోననిపిస్తోంది నరేంద్రకి.

కొంత సేపటికి దేవి కొడుకేనన్న నిర్ణయానికి వచ్చేసాడు నరేంద్ర.

కృష్ణారావుగారు బయటకు రాగానే, ''శ్రీధర్‌ని పరిచయం చేయండి'' అన్నాడు.

''ఇదిగో శ్రీధర్'' అని అతనిదగ్గరకి నరేంద్రని తీసుకొని వెళ్లి ''ఇతను నరేంద్ర, మా చుట్టాలబ్బాయి. కొత్త సభ్యుడు'' అన్నారు.

''గ్లాడ్ టు మీట్ యు'' అన్నాడు శ్రీధర్ చేయి చాపుతూ.

''బాబోయ్ మీతో చేయి కలిపే అర్హత నాకెక్కడిది. నమస్కారం బాబు'' అన్నాడు నరేంద్ర.

కాస్త క్యూరియాసిటితో నరేంద్ర వైపు చూసా

డు శ్రీధర్. అదే నరేంద్రకి కావలసినది.

తనని వాడు మరచిపోకూడదు.

"వస్తాను బాబు... నమస్కారం" అన్నాడు నరేంద్ర.

"అమాయకుడు. పల్లెటూరి బైతులా వున్నాడు" అనుకొని నవ్వుకున్నాడు శ్రీధర్.

"నేను ప్రదీప్‌ని తీసుకొని ఇంటికి వస్తాను. మీరెళ్లండి" అన్నాడు నరేంద్ర.

"ఎంతసేపటిలో వస్తావు?" అడిగారాయన.

"ఎంత... ఒక గంటలో వచ్చేయనూ"

నరేంద్ర అక్కడినుంచి డైరెక్టుగా ప్రదీప్, దినేష్‌ల దగ్గరకొచ్చాడు.

"ఏమైంది?" ఆతృతగా అడిగారిద్దరూ.

"కోటలో పాగా వేసాను. ఇహ వాళ్ల రహస్యాలు తెలుసుకోవడమే తరువాయి" అన్నాడు నరేంద్ర.

"కృష్ణారావుగారికి ఏమని చెప్పావు" అడిగాడు ప్రదీప్.

"ఏదో చుట్టరికం కలిపానులే. ఇంకో గంటలో నీకు పెళ్లి చూపులు"

"నాకా... పెళ్లి చూపులా... జోకు వెయ్యడానికి ఇదా సమయం"?

"జోకు కాదురా నిజమే. నువ్వే చెప్పావు కదా. రాధికని ప్రేమిస్తున్నానని"

"ఆ అమ్మాయి ఎవరు? అటువంటి పేరే నేనింతవరకు వినలేదు"

"కృష్ణారావుగారి అమ్మాయి రాధికరా"

"ఆ అమ్మాయా... అవును ప్రేమిస్తున్నాను. చాలా గాఢంగా ప్రేమిస్తున్నాను"

"గాఢంగా ప్రేమించడమంటే ఏమిటి?" మధ్యలో అడ్డు తగులుతూ అడిగాడు దినేష్.

"గాఢంగా ప్రేమించడమంటే..." అని ఆగిపోయాడు ప్రదీప్... ఎలా పూర్తి చేయాలో తెలియక.

"గాఢంగా ప్రేమించడం అంటే నువ్వు రాధికని ప్రేమించినట్టుగా ప్రేమించడం అంతేగా?" అన్నాడు నరేంద్ర.

"కరెక్ట్... అంతే" అన్నాడు ప్రదీప్.

"మరి పెళ్లిచూపులకి రడీ అవు" అన్నాడు నరేంద్ర.

"ఎప్పుడు పెళ్లి చూపులు?"

"ఇంకో గంటలో" అన్నాడు నరేంద్ర. చకచక బట్టలు మార్చేసుకొని, అద్దానికి ఒక పావు గంట అతుక్కుపోయిన తర్వాత బయటికి వచ్చాడు.

"నువ్వు కట్నం తీసుకోకుండా పెళ్లి చేసుకుంటావు అని చెప్పానురా"

కట్నం తీసుకోకుండా నేను పెళ్లి చేసుకోనని నీకింతకు ముందే చెప్పాను. మళ్లీ చెపుతున్నాను. నేను కట్నం తీసుకొనే పెళ్లి చేసుకుంటాను"

"ఆయనకి ఆ అమ్మాయి ఒక్కర్తెరా. ఇంక కట్నం విషయం ఎందుకు?" అన్నాడు నరేంద్ర.

"అసలు నేను కట్నం ఎందుకు తీసుకోవాలనుకుంటున్నానో నీకు తెలుసు."

"నాకు తెలుసు గాని ఇప్పుడు నువ్వు నన్ను తినేయకు అసలే అలసిపోయి వున్నాను" అన్నాడు నరేంద్ర.

"ఎందుకు తీసుకోవాలనుకుంటున్నావు?" అడిగాడు దినేష్.

"ఇప్పటికే లేటయిపోతోంది... నువ్వు వస్తావా, రావా?" అడిగాడు నరేంద్ర.

"పద... పద" అన్నాడు ప్రదీప్.

ఇద్దరూ కృష్ణారావుగారిల్లు చేరుకున్నారు. వాళ్లకోసమే ఎదురుచూస్తున్న కృష్ణారావుగారు, ఇద్దరిని ఎదురెళ్లి తీసుకుని వచ్చారు. కూర్చోపెట్టి ఫలహారాలు తీసుకుచ్చారు. ఫలహారాలు ఆరగిస్తుండగా అమ్మాయిని తీసుకువచ్చారు.

రాధిక తలెత్తి ప్రదీప్‌వైపు చూసి ఆశ్చర్యపోయింది. ప్రదీప్ ఆమెవైపు ఆరాధనగా చూడటంతో సిగ్గుతో తలదించేసుకుంది. ఇంకా తనవైపు చూస్తున్నాడో లేదోనని క్రీగంట అతనివైపు చూసింది. తను తల తిప్పుకుంటే ఆ అందాలన్నీ అదృశ్యమైపోతాయేమోనన్నట్టుగా తదేకంగా ఆమెవైపే చూస్తున్నాడు ప్రదీప్. ఆమె బుగ్గలు సిగ్గుతో అరుణవర్ణాన్ని దాల్చాయి. కనులు అరమోడ్పులయ్యాయి.

"ఏరా... అమ్మాయి నచ్చిందా?" లోగొంతు

కతో అడిగాడు నరేంద్ర.

"చాలా బాగా నచ్చింది"

"సరే... అయితే పద. నేను మాట్లాడతాను మిగతా విషయాలు తరువాత"

"అప్పుడే వెళ్లిపోదామా?" బాధగా అడిగాడు ప్రదీప్.

"ఇంకెంతసేపుంటావ్... పద పద" అని ప్రదీప్‌తో అని, "వీణ్ని దింపేసి వస్తానండీ" అన్నాడు నరేంద్ర.

"ఇక్కడే భోజనంచేసి వెడతారనుకున్నాం" నిష్టూరంగా అన్నారు కృష్ణారావుగారు.

"కతికితే అతకదు అన్నారుగదండీ పెద్దలు"

భోజనానికి వుండిపోవడానికి రెడీ అయిన ప్రదీప్‌కి నరేంద్ర మాటలతో విపరీతమైన కోపం వచ్చింది. కాని ఏమీ చెయ్యలేక, రాధికని వదలలేక వదులుతున్నట్టు చివరిసారి చూసి బాధగా నరేంద్ర వెనకే బయటపడి గది చేరుకున్నాడు.

"నేను అక్కడికి వెళతాను. రెండురోజుల తరువాత మఫ్టీలో ఎవరినైనా కానిస్టేబుల్‌ని అక్కడికి పంపించమను దినేష్‌ని. రెండురోజులవరకు ఏమీ చేయనులే" అని అక్కడి నుంచి కృష్ణారావుగారింటికి వచ్చేశాడు.

"అబ్బాయికి అమ్మాయి నచ్చిందా?" అడిగారు కృష్ణారావుగారు.

"బ్రహ్మాండంగా నచ్చిందట. మరి మీకు అబ్బాయి నచ్చాడా?"

"నచ్చాడు. వాళ్ల తల్లిదండ్రులను పిలిపిస్తే మిగతా విషయాలు మాట్లాడుకోవచ్చు కదా"

"ఇంకో పదిరోజుల్లో ప్రదీప్ వాళ్ల వూరెళతాడంట. అప్పుడు వాళ్ల నాన్నగారికి చెప్పి మీ దగ్గరికి పంపిస్తానన్నాడు"

"నిజంగా నీకు చాలా రుణపడివున్నామయ్యా" అన్నారు కృష్ణారావుగారు.

"మీరు చేసిన సహాయంలో ఇదెంతండీ... సముద్రంలో కాకిరెట్టంత" అన్నాడు నరేంద్ర.

ఆ రెండురోజులలో తనకి కావలసిన సరంజామా అంతా కూర్చుకున్నాడు నరేంద్ర. ఇంక బరిలోకి దిగిపోవాలి అనుకుని డైరెక్టుగా శ్రీధర్‌ని కలుసుకున్నాడు.

"నమస్కారం శ్రీధర్‌బాబు" అన్నాడు నరేంద్ర.

"నమస్తే... ఏంటి విశేషాలు?" అడిగాడు శ్రీధర్. ఇద్దరూ కొద్దిగా ఫ్రెండ్స్‌లా మాట్లాడుకుంటున్నారు. ఇంకా ఏడురోజులుంది శ్రీధర్ పెళ్లి.

"విశేషాలు ఏమీలేవుకాని నాకొక సహాయం చేయాలి"

"చెప్పు... చాతనైతే చేస్తాను"

"ఒక వ్యక్తిని సఫాచేయాలి" సాధ్యమైనంత కర్కశంగా అన్నాడు నరేంద్ర.

పక్కన పిడుగుపడినట్టు అదిరిపోయాడు శ్రీధర్. "నాతో జోకులు వేయకు" అన్నాడు.

"జోకులు కాదు శ్రీధర్‌బాబూ... నేను చాలా సీరియస్‌గా మాట్లాడుతున్నాను. ఇక్కడ మా మామయ్యగారి అమ్మాయి డాక్టర్ కోర్సు చదువుతోంది. ప్రదీప్ అని ఎవడో ఆ అమ్మాయిని ఏడిపిస్తున్నాడని తెలిసింది. వాడిని పైకి పంపాలి. ఎంత డబ్బు ఖర్చుఅయినా ఫరవాలేదు"

"పోలీసులకి చెబితే వాణ్ని జైలులోకి తోస్తారుకదా. ఈమాత్రందానికి చంపడం ఎందుకు?"

"అక్కడే వుంది కిటుకు. మేమిప్పుడు పోలీసుల సహాయం తీసుకునే స్థితిలో లేము" అన్నాడు నరేంద్ర రహస్యం చెబుతున్నట్టు అతని చెవిలో.

శ్రీధర్ అటుఇటు చూసి లోపలకి లాక్కుపోయాడు. నేరుగా కృష్ణమూర్తిని బంధించిన గదిలోకి తీసుకువచ్చాడు. కృష్ణమూర్తి నరేంద్ర రావడం చూసి ఆశ్చర్యపోయాడు. 'నువ్వేం భయపడకు' అన్నట్టుగా కళ్లతోనే చెప్పాడు నరేంద్ర.

"ఇప్పుడు చెప్పు?" అన్నాడు శ్రీధర్.

"చెప్పడానికి ఏముంది... నువ్వు ప్రదీప్‌ని పైకి పంపెయ్యాలి. ఎంత డబ్బాయినా ఫరవాలేదు. మా మామయ్యని అడిగితీసుకువస్తా" అన్నాడు నరేంద్ర.

"దాని గురించి కాదు నేనడుగుతున్నది. పోలీసులకి చెప్పలేని పరిస్థితులలో వున్నామని అన్నావుకదా దాన్ని గురించి" అన్నాడు శ్రీధర్.

"అది అంత అవసరమా?" ఇబ్బందిగా అడిగాడు నరేంద్ర. అప్పటివరకు అమాయకుడు అనుకున్న నరేంద్ర చాలా జాగ్రత్తగా మాట్లాడటం చూస్తుంటే ఆశ్చర్యం వేసింది శ్రీధర్‌కి.

"విషయం వివరంగా తెలియకపోతే దేవి నీకు ఎటువంటి సహాయం చెయ్యదు" అన్నాడు శ్రీధర్.

"తప్పదంటావా?"

"తప్పదు"

"అయితే ఈ విషయం ఎవరికీ చెప్పకూడదు, ముఖ్యంగా కృష్ణారావుగారికి. ఈ విషయం నలుగురికీ తెలిస్తే మా మామయ్య కూతురి పెళ్ళికాదు"

"చెప్పనులే" అన్నాడు శ్రీధర్. అతనికి నరేంద్ర నసతో విసుగొస్తోంది.

"మా మామయ్య కూతురు వాళ్ళసీనియర్‌ని ఎవరినో ప్రేమించిందంట. వాళ్ళిద్దరూ కలిసి చీకటితప్పు ... అదే క్షణికోద్రేకానికి పాల్పడ్డారంట. అది వీడియో తీసాడంట ప్రదీప్ అనేవాడు. వాడు అమ్మాయిని బ్లాక్‌మెయిల్ చేయడం ప్రారంభించాడు. త్వరలో మీ నాన్నకి చూపెడతాం అన్నాడట. సిగ్గుతో చచ్చిపోయిందీ పిల్ల. వెంటనే మొత్తం అంతా విశదీకరిస్తూ మామయ్యకి లెటర్ రాసింది. మామయ్య అగ్గిమీద గుగ్గిలం అయిపోయాడు. ఆయనకి ఏంచేయాలో అర్థంకాలేదు. ప్రదీప్ అనబడేవాడు లక్షరూపాయలు అడిగాడు. మామయ్యకి ఒక్కతే కూతురు. ఆయన లక్షరూపాయలు ఇవ్వడానికి సంసిద్ధతని వ్యక్తంచేశాడు. కాని వాడు లక్షరూపాయలిచ్చినా ఫిల్మ్ ఇవ్వడంట. దాంతో ఆయనకి కోపం వచ్చి నన్ను పంపాడు. నేను ఆ ప్రదీప్ అనేవాడిని కనుక్కున్నాను. వాడిని ఎలా చంపాలో మాకు అర్థంకావటంలేదు. ఆ వీడియో ఫిల్మ్ ఎక్కడుందో వాడికి తప్పించి ఇంకెవరికీ తెలియదు. వాణ్ణి చంపేస్తే మొత్తం పీడావిరగడైపోతుంది. వాడు సహజంగా రక్తం కక్కుకొనో, కడుపులో నొప్పితోనో, పాము కాటుతోనో మరణిస్తే, ఎవరూ ... ముఖ్యంగా పోలీసులు ఈ విషయంలో జోక్యంచేసుకోరు" అన్నాడు నరేంద్ర.

నరేంద్ర చెబుతున్నప్పుడే ఏంచెయ్యాలో ఆలోచించేశాడు శ్రీధర్. "నీ పనికావాలంటే మనిషి కళ్ళు దేవికి నైవేద్యంగా పెట్టాలి" అన్నాడు అతను.

"మనిషి కళ్ళే...? అవెక్కడ దొరుకుతాయి?"

"మేము సంపాదిస్తాం ... లక్షరూపాయలవుతుంది"

"సహజంగానే మరణిస్తాడా?" ఆశ్చర్యం, ఆనందం మిళితమైన కంఠంతో అడిగాడు నరేంద్ర.

"సహజంగానే ... ఎవరికీ, ఏ అనుమానం రాకుండా మరణిస్తాడు"

"అంటే ఎలాగ? రక్తం కక్కుకొనా లేక కడుపు నొప్పితోనా?"

"ఎలా మరణించినా నీకనవసరం. వాడు మరణించడం నీకు కావాలి ... అంతేగా!" అన్నాడు శ్రీధర్.

"అవును"

"అయితే యాభైవేలిచ్చుకో" అన్నాడు శ్రీధర్.

"అమ్మో ... మామయ్య డబ్బు పనిఅయిన తరువాతే ఇమ్మన్నాడు" అన్నాడు నరేంద్ర.

"అసలు నీదగ్గర డబ్బుందో, లేదో కూడా తెలియకుండా నేనొప్పుకోను, మీ పనిచేయడానికి"

తనతోపాటు తెచ్చిన బ్రీఫ్‌కేసు తెరచి చూపించాడు దాన్నిండా నోట్లకట్టలే!

"ఒకే డన్" అన్నాడు శ్రీధర్.

"మరి ఆవ్యక్తికి ప్రదీప్‌ని చూపించనక్కరలేదా" అడిగాడు నరేంద్ర.

"రేపు నీదగ్గరకి ఒక వ్యక్తిని పంపుతాను అతనికి చూపించు" అన్నాడు శ్రీధర్.

వెళ్ళొస్తానని చెప్పి బయటకి వచ్చాడు

నరేంద్ర. తన వెనకాలే ఇంకొకడు ఫాలో అవడంచూసి తను అనుమానించతగ్గ వ్యక్తిగా వాళ్ళు లెక్కవేసుకున్నారన్నమాట అనుకున్నాడు. దినేష్ దగ్గరికి వెళదామనుకున్న నరేంద్ర డైరక్టుగా కృష్ణారావుగారింటికి వెళ్ళిపోయాడు.

అదేరోజున మాటల సందర్భంలో లత అనే అమ్మాయి ఇక్కడ చదువుకుంటోందనీ, ఆమె తన మామయ్యగారి అమ్మాయేనని కృష్ణారావు గారికి చెప్పాడు నరేంద్ర.

అతనూహించినట్టుగానే కృష్ణారావుగారిని నరేంద్ర విషయాలన్నీ అడిగాడు శ్రీధర్.

సంతృప్తికరమైన జవాబులు రావడంతో అంతకుముందు సుకుమార్‌ని చంపడానికి ఉపయోగించిన మనిషిని పిలవమని తన మనుమలను పంపించాడు శ్రీధర్.

పాములవాడికోసం మనుమలను పంపించి బయటకి వచ్చాడు. దేవి గదినుంచి బయటకొస్తున్న కొవ్వూరాయన సతీమణిని చూశాడు. ఆవిడ మెడలో వేలాడుతున్న నగలని మరింత ఆసక్తిగా చూశాడు.

కృష్ణమూర్తి శరీరంలో ఇంకా విలువైన భాగాలున్నాయని జ్ఞాపకం వచ్చాయి. మెదడు, గుండె, రక్తం- వీటన్నిటినికూడా దేవుడి పేరుతో అమ్ముకోవచ్చుగా. ఒక్కొక్కదానికి యాభై వేలు తీసుకున్నా లక్షన్నర. కాని వాటి అవసరం వున్నవాళ్ళు ఎవరున్నారు?

తనకి కావలసినది అంత డబ్బుండి వాటి అవసరమున్నవాళ్ళు. వెళ్ళిపోతున్న ఆవిడను చూడగానే ఐడియా వచ్చేసింది.

"ఏమండీ?" పిలిచాడు శ్రీధర్.

ఆగి "ఏంటండీ" అంది ఆవిడ.

"గుళ్ళో దేవుని ప్రసాదం ఇస్తున్నారు ... తీసుకోకుండానే వెళ్ళిపోతున్నారు"

"దేవి ఏంచెప్పలేదే?"

"మరచిపోయి వుంటారు ... వెళ్ళి తీసుకోండి" అన్నాడు.

ఆవిడ అటువైపు వెళ్ళింది.

తన మనుషుల్ని సంజ్ఞల్తోనే వెనకాలే పంపాడు. వాళ్ళు ఆవిడ చుట్టూ గుంపుగా ఏర్పడ్డారు ప్రసాదంకోసం. ఆవిడ ప్రసాదంకోసం పూజారి దగ్గరికి వెళ్తుంటే చాలా జాగ్రత్తగా ఆవిడ మెడనుంచి ఒక గొలుసుని మాయంచేశారు.

చూసుకోకుండా ఆవిడ వెళ్ళిపోయింది.

అదేరోజు సాయంకాలం ఆవిడ భర్త రామారావ్‌గారి షాప్‌లో ఫోన్ మోగింది. ఎత్తారాయన.

"రామారావుగారేనా మాట్లాడుతున్నది?"

"అవును"

"నేను శ్రీధర్‌నండి! మీ అబ్బాయి హాస్పిటల్‌లో వున్నాడు ... వెంటనే రండి" అని హాస్పిటల్ అడ్రసుచెప్పి ఫోన్ పెట్టేసాడు శ్రీధర్.

ఆయన వెంటనే అక్కడినుంచి హాస్పిటల్‌కి బయలుదేరారు.

బయటే నిలబడిన శ్రీధర్ "రండి ... ఇప్పుడు మీ అబ్బాయికేం ఫరవాలేదు. కారుకోసం నిలబడిన మీ అబ్బాయిని ఎవరో తోసిపారిపోయారండి. పడటం రాయిమీద అవడంతో తలకి దెబ్బ తగిలింది. అక్కడేవున్న నేను హాస్పిటల్‌కి తీసుకొచ్చాను ' అన్నాడు.

"థాంక్యూ శ్రీధర్ ... థాంక్యూ వెరీమచ్"

"ఒకసారి దేవిని కలవకూడదూ. ఎందుకు ఇలా జరిగిందో తెలుసుకొని చెపుతారుకదా?"

"నేనే వద్దామనుకుంటున్నాను రేపు. మీరు కూడా చెప్పారుకదా ... తప్పకుండా వస్తాను"

"ఎందుకు రావడం?"

"రేపు చెపుతాను" అన్నారాయన.

ఆరోజు రాత్రి దేవి, శ్రీధర్ మాట్లాడుకుంటున్నారు.

"లక్షరూపాయలకి ఇంకో ప్లానువేసాను మమ్మీ" అన్నాడు శ్రీధర్.

"లక్ష రూపాయలకా?"

"రేపు బట్టలషాపు ఓనరు రామారావు వస్తాడు. అతడికి రోజులు బాగాలేవని భగవంతునికి మనిషి మెదడు అర్పిస్తే మంచిరోజులొస్తాయని చెప్పాలి. ఆ మెదడు మనకి లక్షరూపాయలిస్తుంది"

"ఈరోజే వచ్చింది అతని భార్య. రేపొస్తాడని చెప్పలేదే?"

"నేనే రప్పిస్తున్నాను" అని తను చేసింది

చెప్పాడు.

"ఇంకో మూడురోజులలో పెళ్ళి. పెళ్ళయితే లక్షాధికారివి. ఒక లక్షకోసం అంత కష్టపడటం ఎందుకు?"

"డబ్బు ఎంత సంపాదిస్తే అంత ఆనందం. అసలు మనమిలా మారిందే డబ్బుకోసం"

"మామూలుగా డబ్బులు బాగానే వస్తున్నాయిగా. ఇంకా ఇలా రిస్క్ తీసుకోవటం ఎందుకు?"

"డబ్బు సంపాదించడానికి. పదివేలు వొప్పున పదిమంది కడితేగాని లక్షరాదు. ఇలా అయితే ఒక్కడిదగ్గరే. ఇన్ని మాటలెందుకు ... డబ్బు వస్తుందంటే అది ఎంత అపాయకరమైనమార్గం అయినా వెళతాను"

"అయితే నీపెళ్ళి చూసేభాగ్యం నాకు లేనట్టేగా?"

"అంతా వీడియో తీయిస్తున్నాంకదా బాధపడకు. ఇక్కడ నాపెళ్ళి అక్కడ వాడి చావు ఒకేసారి జరగాలంటే తప్పదు"

"పెళ్ళిపనులు సరిగా చూడు. ఇక్కడికి వచ్చినవాళ్ళు నాగురించి అడిగితే ఏంచెబుతావు?"

"ధ్యానంలో ఉన్నావని చెప్పుతాను. సాయంత్రం నీదగ్గరకి వస్తాం ఆశీర్వాదానికి" అని "ఇంక వెళ్ళొస్తాను. రేపు వాళ్ళొస్తారు మరచిపోకు" అన్నాడు.

"అలాగే" అంది.

తరువాతరోజు పొద్దునే శ్రీధర్ మనుషులు పాములవాడిని తీసుకొచ్చారు.

"ఏంది దొరా ... మళ్ళీ అవసరమైందా నాతోటి?" అడిగాడు వాడు.

"అవునురా కోటిగా! ఇక్కడకి కొద్దిసేపట్లో ఒకడొస్తాడు. వాడితోపాటువెళ్ళి వాడు చూపించిన మనిషిని ఇంతకుముందులాగే పాముకాటుకి గురిచేసి చంపాలి"

"అలాగే దొర. ఎప్పుడు చెయ్యాలి ... ఈరోజే చంపెయ్యమంటావా?" అడిగాడు వాడు.

"అప్పుడే వద్దు. ఎప్పుడు చంపాల్సిందీ నేను చెబుతాను. ముందువెళ్ళి వాణ్ణి చూడు. ఎక్కడ ఎలా చంపాలో వాడి కదలికలనిబట్టి నిర్ణయించుకొని వుండు. ఎప్పుడు చంపాల్సింది చెబుతాను. అప్పుడు నువ్వు వేసుకున్న ప్లానుప్రకారం చంపేద్దువుగాని"

"అలాగే దొర" అని నరేంద్రకోసం అక్కడే వున్నాడు.

కొద్దిసేపటి తరువాత నరేంద్ర వచ్చాడు.

"ఇదిగోరా కోటిగా ... ఈయనే నేను చెప్పింది" అన్నాడు శ్రీధర్ ఆ పాములవాడితో.

"నువ్వు ఈ కోటిగాడికి ఆ ప్రదీప్ ఎవరో చూపించు. మాకు కావలసినవి సంపాదిస్తాడు"

"ఏంకావాలి?"

"నీకెందుకు ... నీకు కావలసింది వాణ్ణి చంపడం అంతే ... చంపుతాం. చంపాకే డబ్బు తీసుకుంటాను. వెళ్లరా కోటిగా" అన్నాడు శ్రీధర్.

కోటిని తీసుకొని బయలుదేరాడు నరేంద్ర. వాణ్ణి డైరక్టుగా దినేష్ దగ్గరకి తీసుకువెళ్ళాడు. దినేష్ వాణ్ణి కస్టడీలోకి తీసుకొని స్టేట్‌మెంట్ తీసుకున్నాడు.

"ఎల్లుండి తొమ్మిదింటికికదా ముహూర్తం. కరెక్టుగా ఆ టైమ్‌కి వస్తాను మావాళ్ళతో! రెడ్‌హేండెడ్‌గా పట్టుకోవచ్చు ... ఏమంటారు?" అన్నాడు దినేష్.

"అలాగే ... మరచిపోకండి. అక్కడికి ఎలా వెళ్ళాలో చెప్పాను గుర్తుందికదా. మళ్ళీ ... మళ్ళీ రావటం కుదరదు. వెళతాను" అని వెళ్ళిపోయాడు నరేంద్ర.

దినేష్ ప్రోగ్రాం ప్రదీప్‌కి తెలిపాడు.

అదేరోజు బట్టలషాపు రామారావు ఇంకొక వ్యక్తితో కలసి దేవి గదిలోకి వెళ్ళాడు.

లోపలికి వెళ్లగానే దేవి పాదాలమీదపడిపోయాడు రామారావు. ఆ వచ్చినవ్యక్తి కూడా అదే పనిచేశాడు.

"లే నాయనా... నీ బాధలన్నీ ఆ భగవంతుడు తప్పక తీరుస్తాడు" అంది దేవి.

"తల్లీ... ఈమధ్య నా వ్యాపారం సరిగా సాగడంలేదు. పైగా నిన్న నా జీవితంలో మరచిపోలేని గడ్డురోజు. నా భార్య మెడలో నగలు ఎవరో కొట్టేశారు. నా కొడుకు తలకి గాయం

అయింది. ఏంటో... ఆ భగవంతుని దయ నామీద వుండటంలేదు''

''నిన్న నీ భార్యని చూడగానే అనిపించింది మీలో ఏదో లోపం వుందని. నిన్ను పంపమని చెబుదామని మళ్లీ మానేశాను. రాత్రి నీ గురించి అంతా తెలిసిపోయింది. పొద్దున్న శ్రీధర్‌ని నిన్ను పిలిపించమని చెప్పాను. నువ్వే వస్తావన్నాడు. శాంతి జరిపించినా నీ బాధలు తీరవు. నీ బాధలు తీరాలంటే ఒకే మార్గముంది'' అని వక్కనున్న వ్యక్తిని చూసి ఆగిపోయింది. ''ఎవరితను?'' అని అడిగింది.

''మా బంధువు... వీడికి పెద్ద పెద్ద పదవులంటే ఇష్టం''

''పదవా?'' అని కొద్దిసేపు ఆలోచించి-- ''భగవంతునికి మనిషి గుండె అర్పించాలి'' అంది.



"మనిషి గుండే" ఆశ్చర్యంగా అడిగాడు రెండోవ్యక్తి.

"అవును... మనిషి గుండే. ఇంకేమార్గం లేదు. నీ బాధలు తీరిపోవాలంటే మనిషి మెదడు దేవుడికి అర్పించాలి. అది కూడా దేవుడు లేడనేవాడూ, దైవప్రతినిధులమైన మమ్మల్ని దూషించే వాడూ అయిన మనిషి మెదడు, గుండెకాయ కావాలి" అంది.

"అదెలా సాధ్యం తల్లీ?" అడిగాడు రామారావ్.

"ఏదో ఒకమార్గం చూడండి"

"వేరేమార్గం లేదా"

"లేదు" అని ఆవిడ కళ్లు మూసుకుని ధ్యానంలోకి వెళ్లిపోయింది. వాళ్లిద్దరూ బయటికి వచ్చారు. వాళ్లకోసమే ఎదురుచూస్తున్నాడు శ్రీధర్.

"కారణం చెప్పారా?" అడిగాడు శ్రీధర్.

"ఈ బాధలనుంచి విముక్తి ఎలాగో చెప్పారు"

"ఎలాగంట?"

చెప్పబోయి ఆగి "మీ గదిలోకి వెళ్లి మాట్లాడుకుందాం" అన్నారాయన.

"అలాగే... పదండి"

శ్రీధర్ గదిలోకెళ్లి మాట్లాడుకుంటున్నారు.

"నా బాధలు తీరిపోవాలంటే భగవంతునికి మనిషి మెదడు అర్పించాలంట. మావాడిపని అవ్వాలంటే మనిషి హార్ట్ అర్పించాలంట"

"అయ్యబాబోయ్" అన్నాడు శ్రీధర్.

"ఏం చెయ్యాలో తెలియడంలేదు"

"నేను చూస్తానులెండి. కాకపోతే కొద్దిగా ఖర్చు అవుతుంది" కొద్దిగా ఆలోచించాక అన్నాడు.

"ఆ మనిషి దేవుణ్ణి నమ్మకూడదు. తల్లిలాంటి దైవప్రతినిధులని దూషించేవాడై వుండాలి"

"ప్రయత్నించి కబురు చేస్తాను. డబ్బు విషయం ఫరవాలేదుకదా"

"ఫరవాలేదు"

ఆరోజు సాయంత్రమే వాళ్లని కలిసి మనిషి దొరికాడని, మెదడుకి, గుండెకి కలిపి లక్షన్నర అవుతుందని చెప్పాడు. వాళ్లు సరేననగానే అడ్వాన్సు కూడా వసూలు చేసుకున్నాడు.

మర్నాడు...

వి.కె.రావ్‌కి, నరేంద్రకి, రామారావుకి, ఆయన బంధువుకి ఆ మర్నాడు చాలామంచి రోజనీ; ఆరోజే దేవునికి అన్నీ అర్పించాలని తెలియజేశాడు శ్రీధర్.

ఆరోజు కూడా వచ్చింది.

తొమ్మిదిన్నరకి పెళ్లి ముహూర్తం.

★ ★ ★

సమయం తొమ్మిదిగంటలయింది.

శ్రీకృష్ణభగవాన్ విగ్రహం ఎదురుగా కృష్ణమూర్తిని నిలబెట్టారు. నోట్లో గుడ్డలు కుక్కారు. అతడి పక్కన దేవి, ఆవిడకి కొద్దిదూరంలోనే వి.కె.రావ్, నరేంద్ర, రామారావ్, అతడి బంధువు నిలబడివున్నారు.

"ఈ పాపి నన్ను చంపాలని ప్రయత్నించి మనకి దొరికిపోయాడు. సర్వాంతర్యామి అయిన శ్రీకృష్ణుని ప్రతినిధిని నన్ను చంపడం మానవమాత్రుడు వీడితరం కాదని తెలియక ఇక్కడికి వచ్చి దొరికిపోయాడు. దేవుడంటే నమ్మకంలేని, నన్ను దూషించిన వీణ్ని బతకనివ్వకూడదు. మనకెలాంటివాడు కావాలో అలాంటివాడిని మనకోసమే దేవుడు పంపినట్టున్నాడు. ముందుగా అతడు కృష్ణమూర్తి కళ్లల్లోకి ఈ ఇనుప వూసలని దింపుతాడు. మిగతా ముగ్గురూ ఒకేసారి గుండెని అర్పించాలనుకున్నవాళ్లు అతడి గుండెల దగ్గర కత్తితో, అతడి మెదడు అర్పించాల్సినవాళ్లు సుత్తితో అతడి మాడుమీద, అతడి ప్రాణం కావలసినవాళ్లు గొడ్డలితో అతడి మెడమీద ఒకేసారి కొట్టాలి. శవం అయిపోయిన ఇతడిని థియేటర్‌కి తీసిన పునాదులలో సమాధి చెయ్యాలి. బాబూ తీసుకో వూసలు" అంది నరేంద్రని వుద్దేశించి. మిగతా ముగ్గురూ కత్తి ఒకళ్లు, సుత్తి ఒకళ్లు గొడ్డలి ఒకళ్లు తీసుకున్నారు.

నరేంద్ర వూసలని తీసుకుని నడుస్తున్నాడు. ఇంకా ఎంతో టైంలేదే? క్షణం ఆలస్యం అయినా ఇవతల ప్రాణం పోతుందని తెలిసి కూడా ఇంకా రాలేదేంటి దినేష్ అని ఆలోచిస్తూ

అడుగులు వేస్తున్నాడు. వాళ్లు రాకపోతే ఏంచెయ్యాలో అర్థం కావడంలేదు. అంతవరకు వాళ్లు వస్తారని చూశాడు. రానురాను నమ్మకం తగ్గిపోతోంది. దినేష్‌కి ఇది ఎక్కడో తెలీలేదా? ఇది తెలుసుకుని ఇక్కడికి వచ్చేసరికి కృష్ణమూర్తి ప్రాణంపోతుంది. తనే ఏమైనా చెయ్యాలి. ఈ వూసలతో దేవినే పొడిచేస్తే కృష్ణమూర్తి చావు కొద్దిగా పోస్టుపోన్ అవుతుంది. ఈలోపల దినేష్ వచ్చేస్తాడు అనుకొని చాలావేగంగా వెనక్కి తిరిగి దేవి వైపు పరిగెత్తాడు పొడిచెయ్యడానికి.

కానీ దేవికి బాడీగార్డుల్లా ఉన్న ఆ ఇద్దరూ లాఘవంగా అతడి రెండు చేతుల్నీ గట్టిగా పట్టుకున్నారు.

"ఎవర్నువ్వు?" అంది దేవి ఆశ్చర్యంగా.

"దైవప్రతినిధివికదా తెలుసుకో?" అన్నాడు నరేంద్ర.

కృష్ణమూర్తి అంతకుముందే నరేంద్ర చేతికి ఉన్న గడియారంలో టైమ్ చూసాడు అతడు వెనక్కి తిరగబోతుండగా. ముహూర్తం దాటి ఒక నిముషం అయిపోయింది. ఇంక తను బతికుంటే ఎంత చస్తే ఎంత. అనుకున్నాడు కృష్ణమూర్తి. వేగంగా వెనక్కి తిరిగిన నరేంద్రని చూసి "వద్దు నరేంద్రా... వద్దు. నా ప్రాణాలు కాపాడటం కోసం నువ్వు అపాయంలో పడకు" అని అరవబోయాడు. అదంతా మూలుగై బయటికి వచ్చింది. నరేంద్ర వాళ్ళకి దొరికిపోవడంతో బాధతో చెమర్చాయి అతడి కళ్ళు.

తనని ప్రేమించి దేవి అక్కడ బాధపడుతోంది. ఇక్కడ వీళ్ళు బాధపడుతున్నారు. అందర్నీ బాధించే జన్మ అయిపోయింది తనది. ఛ... ఇంకా చావురాదే అనుకున్నాడు.

"వీడి సంగతి తరువాత చూద్దాం... ముందు మీ పనులు కానివ్వండి" అంది. "ఆగండి. తనకి చావెప్పుడొస్తుందో కూడా తెలియని ఈ కపట దేవి దైవప్రతినిధురాలుకాదు. నేను తన మనిషినో, శత్రువునో కూడా తెలుసుకోలేని ఈవిడతో దేవుడు మాట్లాడటంకాదుగదా అసలు కన్నెత్తిచూడడు. మీ మూఢనమ్మకాలకి ఒక అమాయకుణ్ణి బలిచేసి పాపాత్ములుకావద్దు. రాక్షసుల్లా ప్రవర్తించకండి. భగవంతుడు నరబలినే కాదు- అసలే బలినీ కోరలేదు... కోరడు. నాగరికత బాగా తెలిసిన మనం అటవికులం కాకూడదు. మనిషిని చంపడం సులభమే కానీ బతికించడం కష్టం. ఒక్కసారి ఆలోచించండి... దేవుడి పేరువాడుకొని డబ్బు సంపాదిస్తున్న వీళ్ళు దైవప్రతినిధులుకాదు. ప్లీజ్ నామాట వినండి. ఆలోచించండి... రాక్షసులు కావద్దు. రక్తం చిందించకండి... ఆలోచించండి"

ఇంకా అరవాలని ప్రయత్నించాడు కానీ నోరు మూసేయడంతో అరవలేకపోయాడు. "వద్దు వద్దు... చంపకండి" అని అతడి కళ్ళు అవిరామంగా సందేశాలను పంపుతున్నాయి.

నరేంద్ర మాటలతో ఆగిపోయారు వాళ్ళు ఏం చెయ్యాలో అర్థంకాక. "ఏమిటి అలా చూస్తుండిపోయారు. దేవుణ్ణి నమ్మనివాడి మాటలు నమ్ముతున్నారా? మీ ఇష్టం... మీరేం చెయ్యాలనుకుంటే అదే చేయండి. మిమ్మల్ని ఫలానా పనిచెయ్యమని నేనెప్పుడూ బలవంతం చేయలేదు. నా మాట వింటే బాగుపడతారు లేదా మీ ఖర్మ. ఆ దుర్మార్గుణ్ణి నేనే చంపుతాను" అని కదలబోయింది దేవి.

"ఆగు తల్లీ... మేము ఎప్పటికీ నీ భక్తులమే" అని సుత్తిలేపాడు రామారావు. మిగతా ఇద్దరూ తమ ఆయుధాలని లేపి కృష్ణమూర్తి వైపు బయలుదేరారు.

సరిగ్గా అదే క్షణంలో దూసుకుంటూ లోపలికి వచ్చాడు దినేష్ తన బలగంతో. వాళ్ళందరిని అరెస్టు చేయడం, వాన్‌లో తీసుకెళ్ళిపోవడం జరిగిపోయాయి.

దినేష్ తొమ్మిదిన్నరకి ముందే శ్రీధర్‌ని అరెస్టు చేసాడుగానీ భూగృహానికి దారి మరచిపోయాడు. శ్రీధర్‌ని అడిగితే చెప్పలేదు. అటువంటిదేమిలేదని బుకాయించాడు. పైగా నిర్దోషినైన నన్నే అరెస్టు చేస్తావా... నీ ఉద్యోగం పీకిం చేస్తానని భయపెట్టబోయాడు.

దినేష్ "దేవి తన గదిలోలేదు. ఇక్కడా లేదు... మరెక్కడ ఉంది?" అని అడిగాడు.

"ఏమో... నాకు తెలీదు" అన్నాడు శ్రీధర్.

అదంతా వెదికి లోపలికి వచ్చేసరికి లేటయింది. అయినా ఎవరికీ ఏ ప్రమాదం జరగలేదని సంతోషించాడు.

రాజుగారు తీసిన ఫొటోలు బాగా ఉపయోగపడ్డాయి సుకుమార్ హత్య కేసులో. నరేంద్ర చెప్పిన విషయాలన్నిటినీ పత్రికలు వేశాయి.

కృష్ణమూర్తికి దేవితోను, ప్రదీప్‌కి రాధికతోను పెళ్ళినిశ్చయమైంది. కానీ చదువు అయిపోయేంతవరకూ పెళ్ళిళ్ళు ఆపాలనుకోవడంతో ఎనిమిది నెలల తరువాత ముహూర్తం పెట్టుకున్నారు.

అందరూ ఆనందంగా ఉన్నారు రాజుగారు తప్ప.

ఆయన మదిలో ఏవేవో భావాలు, జరిగిపోయినరోజులు మిగిల్చిపోయిన విషాదచ్ఛాయలు.

ఆయన విషాదాన్ని గమనించిన ఒకే వ్యక్తి నరేంద్ర. కారణం అడిగాడు నరేంద్ర ఆయనని.

"నేను కారణం చెపుతాను. నువ్వు నాకో మాట ఇవ్వాలి" అన్నారాయన.

"ఈ మాట ఇవ్వడాలు ఇవన్నీ ఏంటండి. నాకు తల్లిదండ్రులులేరు. మీరు నాకు తండ్రిలాంటివారు... ఆజ్ఞాపించండి మీకేం చెయ్యాలో?" అన్నాడు నరేంద్ర.

ఆయన చెప్పడం ప్రారంభించారు.




రాజుగారు చెప్పింది విన్న నరేంద్ర నిశ్చేష్టుడైపోయాడు. నవ్వుతూ తమ మధ్య తిరిగే ఈయన వెనుక ఇంత దుఃఖందాగి ఉందా!

"ఇన్నాళ్ళూ మిమ్మల్ని చూస్తూ నా బాధనంతా మరచిపోయాను. ఈరోజు మళ్ళీ పాతజ్ఞాపకాలు నన్ను చుట్టుముట్టాయి. నా ఈ బాధని ఎవరో ఒకరితో చెప్పుకోవాలన్న నా కోరిక ఈనాటికి తీరింది" అన్నారాయన.

"మీకు ఈరోజే ఆ పాతజ్ఞాపకం రావడానికి కారణం?" అడిగాడు నరేంద్ర

రాజుగారు ఆరోజు పేపర్ని నరేంద్ర ముందుకి నెట్టారు.

అయోమయంగా ఆయన వైపు చూసాడు నరేంద్ర.

"చదువు... నీకే తెలుస్తుంది" అన్నారాయన.

పేపరు తీశాడు. మొదటి పేజీలోనే పెద్దహెడ్డింగుతో "రాయలసీమకి పధ్నాలుగురోజులలో వర్షాలు" అని రాసి ఉంది.

ఎంతోకాలంగా వర్షాలులేక ఎండి బీటలు వారిన పంట పొలాలకు వర్షధార. ఎండకి ఎండి నీరులేక ఆకాశంవైపు ఆశగా, దీనంగా చూసే పశువులకు వాటి ఆశ తీరేరోజు త్వరలో వస్తుంది. రాయలసీమలో వర్షాలకై రవిబాబుగారు యాగం చేయ సంకల్పించారు. రేపు ఆదివారమే వారి యాగం ప్రారంభమవుతుంది. ఆయన ఇప్పటికే చాలా ప్రజోపయోగ కార్యక్రమాలు చేపట్టారు. ఆయన యాగం పూర్తి చేసేసరికి అక్కడ వర్షంపడకపోతే అక్కడే ఆత్మత్యాగం చేసుకుంటానని ప్రతిజ్ఞ చేసారు. ఈ యాగానికి దేవతలు తప్పక సంతుష్టులవుతారనీ, ఒకవేళ అవకపోయినా తన ఆత్మత్యాగంతోనైనా వారు సంతృప్తులై, వరుణునికై ఎదురు తెన్నులు చూస్తున్న భూమాత మీద కరుణ చూపిస్తారనీ ఆయన చెప్పారు. భక్తులు తండోపతండాలుగా అప్పుడే అక్కడికి చేరుకుంటున్నారు. ఆయన సంకల్పించిన మహాకార్యానికి చాలామంది ప్రముఖులు తమ హర్షం ప్రకటించారు. ఆయన తప్పక గంగను భూమి మీదకి తెప్పిస్తారని, అభినవ భగీరథునిగా ఈయన పేరు చిరస్థాయిగా నిలిచిపోతుందని అందరూ ఆశిస్తున్నారు.

ఆయనకి ఎంత నమ్మకంలేకపోతే ఆత్మాహుతి చేస్తానని అంటారు? ఆయన తప్పక గంగని భూమి మీదకి తెస్తారు అనికొందరు అభిప్రాయపడ్డారు. అనేకమంది సత్యాన్వేషులు ఏమి జరుగుతుందోనని ఉత్సాహంగా చూస్తున్నారు. అదీ ఆ వార్త సారాంశం.



ఇప్పుడు
విదేశాల నుండి దిగుమతి అయిన మెషిన్లతో
అన్ని సైజులలో ఎయిర్ టైట్ ప్యాకింగ్‌లలో లభిస్తుంది!
త్రివేణి
కోట్లాదిప్రజలు కోరుకునే
సుగంధవక్కపొడి
TRIVENI




TRIVENI
SPECIAL
TRIVENI




త్రివేణి వక్కపొడర్ మాన్యుఫాక్చరింగ్ కో.,
మచిలీపట్నం-521 001. A.P.

"ఈ రవిబాబేనా ఆ రవికుమార్?" పేపర్ అక్కడపెడుతూ అడిగాడు నరేంద్ర రాజు గారిని.

"అవును... వర్షంపడుతుందంటావా?"

"మనమేం చెప్పగలం. వర్షంపడితే మంచిదే, పడకపోతే..." ఏదో జ్ఞాపకంవచ్చి ఆగిపోయాడు.

"అదే నేనూ ఆలోచిస్తున్నది. పడకపోతే ఆత్మత్యాగం చేసుకుంటాడంటావా?" బొంగురుగావుంది ఆయన గొంతు. ఆయన చాలా బాధపడుతున్నారని అర్థమైంది నరేంద్రకి. ఆయనని ఓదార్చాల్సిన పని తనమీద వుందని గ్రహించాడు.

"అలా అంటారేగాని నిజంగా ఆత్మత్యాగం చేస్తారటండీ?"

"నీకు తెలీదు బాబూ, వాడు మహామొండి. ఏదైనా అన్నాడంటే తప్పకుండా చేస్తాడు" అన్నారాయన.

"ఒకవేళ అతను చచ్చిపోదామనుకున్నా భక్తులు చచ్చిపోనిస్తారటండీ... ఆపెయ్యరూ" అన్నాడు నరేంద్ర. "అయినా ఆదివారం అంటే ఇంకా నాలుగు రోజులుందికదా. మనం వెళదాం" అన్నాడు.

"వద్దు బాబూ... అంతా అయిపోయిన తరువాత వెళదాం. భారం అంతా నీమీదే వేస్తున్నాను. ఎలా పూర్తిచేస్తావో"

"మీరేం బాధపడకండి... ఈ విషయం తేలిపోయిన వెంటనే మనం బయలుదేరుదాం" అన్నాడు నరేంద్ర.

మర్నాడు రవిబాబుగారితో ప్రత్యేక ఇంటర్వ్యూ వేశారు. ప్రతి పేపరులోను అదే విషయం. ముఖ్యమంత్రి కూడా వెళ్లారనడంతో ఆ విషయం మరింత ప్రాచుర్యం పొందింది. ఎవరినోటవిన్నా ఇదేమాట, ఏ పేపరులో చూసినా ఇదే రాత.

అందరూ ఎదురుచూసిన రోజు రానేవచ్చింది. రవిబాబు చేస్తున్న యాగం ప్రారంభమైంది. రవిబాబు అకుంఠితదీక్షతో యాగంముందు కూర్చున్నారు. పురోహితులు మంత్రాలు చదివిస్తూ నెయ్యి వేయిస్తున్నారు. నెయ్యి వేసిన మరుక్షణం పొగలు ఆకాశంలోకి లేస్తున్నాయి. ఆయన మొహం దివ్యతేజస్సుతో వెలిగిపోతోంది.

మొదటిరోజు కార్యక్రమం పూర్తి అయింది కాని ఎక్కడా మబ్బులజాడే కనబడలేదు. రవిబాబు పెదవులపై చిరునవ్వు పోలేదు. ఔరా... ఎంత నిబ్బరం అనుకున్నారు.

భక్తులకి భయంగానేవుంది. భక్తులు చూస్తుండగానే ఎన్నో అద్భుతాలు చేసిచూపించారు రవిబాబుగారు. అందుకే ఆయనమీద వారికి ప్రగాఢమైన నమ్మకం. ఆయన చేతిలో ఉద్భవించే నీరు శివుని జటలో నీరేనని వారి అభిప్రాయం. ఆ తీర్థంతో ఏ జబ్బులైనా ఇట్టే నయం అయిపోతాయని వారి నమ్మకం. వారి కళ్ళముందే ఎంతోమంది ఆ తీర్థం పుచ్చుకొని రోగవిముక్తులై వెళ్ళిపోయారు.

వారం రోజులు గడిచిపోయాయి. ఆరోజే చివరి అంకం పూర్తిచేశారు. అందరూ ఆకాశంవైపే చూస్తున్నారు. ఎటువైపుచూసినా సూర్యుడు మండిపోతున్న సూచనలేకాని ఎక్కడా వర్షం పడేజాడలు కనబడలేదు. మచ్చుకి ఒక మబ్బుకూడా ఆకాశంలో తిరగటంలేదు.

రవిబాబుగారి పెదవులమీద చిరునవ్వు చెరగలేదు. ఆరోజు రాత్రికి వర్షం పడకపోతే తరువాత రోజే ఆయన ఆత్మత్యాగం చేసుకునేది.

ఆరోజు రాత్రి చాలా భయానకంగా నిర్మానుష్యంగావుందా ప్రాంతం. భక్తులంతా అరచేతుల్లో ప్రాణాలు పెట్టుకున్నట్టుగా గడిపారు. నిశ్శబ్దం ఆ ప్రదేశాన్ని ముంచెత్తింది. ఎక్కడ చూసినా గుసగుసలే. ఎవరూ గట్టిగా మాట్లాడటానికి ధైర్యం చూపించడంలేదు. పున్నమి చంద్రుడు ఆకాశంలో తనకేమీ తెలియనట్టుగా అమాయకంగా తిరుగుతున్నాడు.

పొద్దునే జరిగేది తలచుకుంటే ఒక్కొక్కళ్ళ గుండె చెరువైపోతోంది. రాజుగారు నిశ్శబ్దంగా ఆకాశంవైపు చూస్తూ గడిపారు ఆ రాత్రి. వర్షించడానికి సిద్ధంగావున్న మేఘాల్లా వున్నాయి ఆయన కళ్ళు. నిశ్శబ్దాన్ని భంగం చేయడం ఇష్టంలేక నరేంద్ర పక్కనే కూర్చుని నిశ్శబ్దంగానడిచే కాలాన్ని గమనిస్తూ రాని మబ్బులు, రావాలని కోరుకుంటూ, ఎప్పుడు తెల్లవారుతుందో, ఎప్పుడు ఆయన ఏంచేస్తారో




నన్ను భయంతో ఆయన్ని గమనిస్తూ గడిపాడు.

చంద్రుని కాంతి కిరణాలని పారదోలుతూ సూర్యకిరణాలు తూర్పున వుదయించి జనస ముద్రంలోకి చొచ్చుకొనిపోయాయి.

రవిబాబుగారి ప్రాంగణం అంతా ప్రజలతో నిండిపోయింది. "ఏనోట విన్నా రవిబాబుగారు ఆత్మత్యాగం చేసుకుంటారంట" అనే మాటే. అందరు ముఖ్యమంత్రిగారికోసం వేచి చూస్తున్నారు. ఆయనకి రవిబాబుగారిమీద విపరీతమైన గురి. ఆయనపై అవిశ్వాస తీర్మానంపెట్టి దించేసినప్పుడు మీరు నెలతిరిగే సరికల్లా ముఖ్యమంత్రి అవుతారు అని చెప్పాడు రవిబాబు. అలాగే మళ్ళీ ముఖ్యమంత్రి అయ్యారు. అందుకే ఆయనకి రవిబాబు గారంటే అంత భక్తి. ఆయనవచ్చి బాబుగారిని ఆత్మత్యాగం చేసుకోవద్దని కోరుకుంటారని తెలిసి ఆయన కోసమే ఎదురుచూస్తున్నారు జనం.

రవిబాబుగారు శుచిగా స్నానంచేసి, పట్టువస్త్రాలు ధరించి తన భక్తులకి దర్శనమిచ్చారు. ఆయననిచూసి ఎంతోమంది కన్నీరుమున్నీరుగా విలపించారు. వాళ్ళ భక్తికి ఆయన కనులవెంట నీరు వచ్చింది. భక్తులని ఓదార్చి నిర్ణీత స్థలం దగ్గరికి వెళ్ళారు.

ఆయన పెదవులపై చిరునవ్వు. ఆయన మొహం దివ్యతేజస్సుతో వెలిగిపోతోంది. శివసాయుజ్యాన్ని పొందడానికై కూర్చున్నారు ఆయన.

అప్పుడే పైన హెలికాప్టర్ రొదవినిపించి ఆయనతోపాటు అందరూపైకి చూశారు. "ముఖ్యమంత్రిగారొస్తున్నారు" అన్న అరుపులతో ఆ ప్రదేశం దద్దరిల్లింది.

అంతలోనే ఓ మేఘం గర్జించి, సమాధానంలా ఇంకొక మేఘం వంతపలికింది.

చిన్నచిన్న చినుకులతో ప్రారంభమై నిముషాల్లో అది పెద్దవర్షంగా మారిపోయింది. ఆనందంతో కేరింతలు కొట్టారు జనం. వర్షంలో తడిసారు. గంతులు వేశారు.

రవిబాబుగారు వెనక్కి నడిచి లోనికి నిష్క్రమించారు.

ఆయన పేరు దశదిశలా మారుమోగిపోయింది.

చేతిలో నీటిని సృష్టించడమే ఒక గొప్ప విషయం అయితే ఇది ఇంకా అద్భుత విషయం. ఆయన భక్తులు ఆ ఒక్కరోజుతో చాలా పెరిగిపోయారు.

★ ★ ★

"కుండపోతగా కురిసింది వర్షం"

"అవును... అది ఎలా సంభవించిందంటావ్?" అడిగారు రాజుగారు.

ఆయన మాటలకి ఆశ్చర్యపోయాడు నరేంద్ర. నిన్నటివరకు వర్షంపడాలి అనికోరుకున్న వ్యక్తి ఈరోజు వర్షం ఎలాపడి వుంటుంది అని అడుగుతున్నాడు.

"నిన్నటివరకు అభిమానంవలన రవిబాబు చావకూడదనుకున్నాను. ప్రజలని డబ్బుకోసం దేవుడిపేరుచెప్పి మోసంచేసేవాళ్ళు చచ్చిపోవడమే మంచిది. కాని అలా జరగలేదు. అసలు విషయం ఏమిటో కనుక్కోవాలి" అన్నాడు.

"ఆయనకి నిజంగానే దైవశక్తులున్నాయేమో లేకపోతే వర్షం ఎలావడుతుంది" అడిగాడు నరేంద్ర.

"వాడికి ఏవో మానసిక శక్తులున్నాయని నమ్ముతున్నావా?"

"మనకి ఏ విషయమూ తెలియనప్పుడు నలుగురూ అనుకుంటున్నదే మన నమ్మకంకూడా అవుతుంది గదా"

"అయితేనీకంటూ ఒక అభిప్రాయం వుండదా?"

"ఉంటుంది కానీ ఈ విషయంలో ఇంకా అభిప్రాయం ఏర్పడలేదు?"

"మరి ఇందాక ప్రజల అభిప్రాయమే నా అభిప్రాయం అన్నావ్?"

"ప్రస్తుతానికి అంతే. నాకంటూ ఒక అభిప్రాయం ఏర్పడేవరకు వాళ్ళ అభిప్రాయమే నా అభిప్రాయం"

"మరి అందరూ దేవి గొప్ప భక్తురాలు అనుకుంటూంటే నీవు మాత్రం కాదని ఎలా అనుకున్నావ్"

"ముందు దేవి గురించి నేనసలు పట్టించు

కోలేదు. సుకుమార్ హత్య విషయమై పరిశోధి స్తుంటే దేవి విషయం తెలిసింది''

''మరి మొన్న నాతో రవిబాబు బృందం విషయం బట్టబయలు చేస్తానన్నావ్?''

''వాళ్ళు మోసగిస్తున్నారేమోననుకున్నాను. ప్రజలకోసం చావడానికి కూడా సిద్ధపడ్డారు. ఆయన ప్రజలని మోసం చేస్తున్నారంటే నేను నమ్మలేకపోతున్నాను''

''అదంతా ఓ పెద్ద నాటకం. నీలాంటివా ళ్ళందర్నీ నమ్మించడానికి వాళ్ళు చేసిన ప్రయ త్నం అంతే''

''పోనీ ఆ ప్రయత్నానికైనా దేవుడు సహక రించాడుగా. ఆవిధంగానైనా రవిబాబు దైవభ క్తుడే అయ్యాడుగా''

''దేవుడు సహకరించాడా?... ఎలా?''

''లేకపోతే వర్షం ఎలా పడుతుంది?''

''నరేంద్రా... నీ వాదాన్నింతటితో కట్టిబెట్టి నాతో వస్తావా?''

''తప్పకుండా వస్తాను. ఊరికే ఒకసారి రవి బాబు దేవుని అంశగలవాడని వాదిస్తే ఎలా వుంటుందోననే మీతో వాదించాను. అంతే! పదండి'' అన్నాడు నరేంద్ర.

ఆమర్నాడే ఇద్దరూ ప్రయాణమై రవిబాబు ఆశ్రమం చేరుకున్నారు. భక్తులు తండోప తండాలుగా వస్తున్నారు. ఆ ప్రదేశం ఒక తీర్థయాత్రాస్థలంగా మారిపోయింది. వచ్చే భక్తులకొరకు కాటేజీల నిర్మాణం ప్రారంభ మైంది. ఎక్కడెక్కడినుంచో వచ్చే భక్తులు రవి బాబు ఇస్తున్న గంగాజలాన్ని తీసుకొని తమకు తోచిన నైవేద్యాన్ని సమర్పించుకొని వెళుతు న్నారు.

వెళ్ళిన వారంరోజులవరకు పరిసర ప్రాంతా లన్నీ గమనిస్తూ గడిపేసారు ఇద్దరూ. తనని ఆశ్రమ కమిటీవాళ్ళెవరూ చూడకుండా జాగ్ర త్తపడుతున్నారు రాజుగారు.

ఎనిమిదోరోజున ఇద్దరూ ఆశ్రమం దగ్గరకి వచ్చారు. రాజుగారు బయటే నిలబడిపోగా నరేంద్ర లోపలకి వెళ్లాడు. కాని రాజుగారికి తననెవరైతే చూడకూడదనుకున్నారో వాళ్ళే చూసేశారని తెలియదు. ఆయనతో మాట్లాడి లోపలికి వెళ్ళిన నరేంద్రని కూడా వాళ్ళు గమనించారు.

నరేంద్ర లోపలికి వెళ్లాడు. లోపల అడుగి డిన మరుక్షణం ఆ నిశ్శబ్ద ప్రశాంతతకి ముగ్ధు డైపోయాడు. పరిసరాలని జాగ్రత్తగా గమనిస్తూ ముందుకి సాగిపోయాడు.

అక్కడ ఒకమ్మాయి కూర్చొని భక్తుల పేర్లు రాసుకొని వాళ్ళు దేవునికి నైవేద్యంగా ఇస్తున్న డబ్బుని తీసుకుంటోంది. ఆమె దగ్గరకి చేరు కున్నాడు నరేంద్ర.

''మీ పేరు రాయండి'' అంది ఆ అమ్మాయి.

పేరు రాసి డబ్బులు వేయాల్సినచోట ఖాళీగా వదిలేశాడు. అందులో రాసిన సంఖ్య లన్నీ వేలమీద వుండటంతో ఖాళీగా వదిలేసి ముందుకి వెళ్లబోయాడు.

''ఎక్స్‌క్యూజ్‌మి... మీరు డబ్బులివ్వలేదు'' అంది ఆమె.

''ఏం డబ్బులు?'' ఆశ్చర్యంగా అడిగాడు నరేంద్ర.

''బాబుగారిని దర్శించి తీర్థంతీసుకోవా లంటే వెయ్యికి తక్కువకాకుండా ఎంతోకొంత ఇచ్చిమరీ వెళ్లాలి''

''ఓహో... నాకు తెలియదులెండి'' అని జేబులో చేతులుపెట్టి ''డబ్బులు ఇవ్వలేక పోతే?'' అని అడిగాడు.

''ఇంకో రెండుగంటల తర్వాత భక్తులకు ధర్మదర్శనం ఇవ్వడానికి బయటికి వస్తారు బాబుగారు... అప్పుడు దర్శించుకోవచ్చు''

నరేంద్రకి అప్పుడు అర్థమైంది బయట అంతమంది ఎందుకు వేచిచూస్తున్నారో. మారుమాట్లాడకుండా డబ్బులు ఇచ్చి లోపలకి వెళ్లాడు నరేంద్ర.

భక్తులు తమ కష్టాలు చెప్పుకొని బాబు ఇచ్చిన తీర్థం పుచ్చుకుని వెళ్లిపోతున్నారు.

నరేంద్ర వంతు వచ్చింది.

బాబుకి ఏదో చెప్పుదామని వంగిన నరేంద్రని చేయిపట్టి అన్నారు బాబు.

చేయి చాచాడు నరేంద్ర. బాబు కళ్ళు మూసుకుని ఎదనిండా గాలిపీల్చి, ఏవో



మంత్రాలు చదివి, నరేంద్ర చేతిలోకి తన చేతిలో ఉద్భవించిన నీరుని పోశాడు.

"నమ్మకం కుదిరిందా నాయనా?" శాంతస్వరంతో అడిగారు బాబు. "దేనిమీద స్వామీ" అశ్చర్యంగా అడిగాడు నరేంద్ర. గాలిలోనుంచి సీటిని పుట్టించడం ఇంకా ఆశ్చర్యంగానే వుంది నరేంద్రకి.

"అయితే లోపలకి వెళ్ళు నాయనా... అంతా నీకే అర్థమవుతుంది" అన్నారు బాబు.

ఇద్దరు మనుమలు వచ్చి నరేంద్రని లోపలకి తీసుకువెళ్లారు. బాబు ఇచ్చిన నీటిని తాగేసి ఆ నీరు ఎలావచ్చిందా అని ఆలోచిస్తూ లోపలికి వెళ్లాడు నరేంద్ర.

నరేంద్రని ఒక గదిలోకి తీసుకువెళ్లి అతన్ని అక్కడ వుంచేసి వాళ్లు బయటకి వెళ్లిపోయి తలుపు గెడపెట్టేశారు. అతని ఎదురుగా పెద్ద శివలింగం.

'కొంపదీసి కృష్ణమూర్తిని బలి ఇద్దామనుకున్నట్టు తనను కూడా ఇక్కడ బలి ఇవ్వరుకదా' అనుకున్నాడు నరేంద్ర.

"లేదు నరేంద్రా... నిన్నెవరూ బలిఇవ్వరు" అన్న మాటలు నరేంద్రకి వినబడ్డాయి.

ఎవరు మాట్లాడుతున్నారా అని చుట్టూ చూశాడు. ఆ మాటలు శివలింగం దగ్గరనుంచి వినబడుతున్నాయి.

"ఎవరు మాట్లాడుతున్నారా అని చూస్తున్నావా... నేను నాయనా శివుడిని" అన్న మాటలు వినబడ్డాయి. నేను శివుడిని అన్న మాటలు హాస్యాస్పదంగా అనిపించాయి నరేంద్రకి. 'శివుడైతే ప్రత్యక్షమవ్వచ్చుకదా' అనుకున్నాడు మనసులో.

"నేను నిరాకారిని నాయనా! నా మాటలు మాత్రమే వినబడతాయి" ఈసారి మాటలు ఎవరో తన పక్కనవుండి మాట్లాడినట్టు అనిపించింది. అదే నిముషంలో అతని ముక్కు ఏదో వాసనని పసిగట్టింది. అది ఏంటా అని ఆలోచించేలోపలే అతనికి స్పృహతప్పిపోయింది.

ఎవరో తట్టి లేపడంతో లేచాడు నరేంద్ర. ఇంకా మగతగానే వుంది అతనికి. కళ్ళు నులుముకొని, నెమ్మదిగా కళ్ళు తెరిచాడు. ఎదర ప్రశాంత వదనంతో రవిబాబు.

అతనికి తెలియకుండానే రెండు చేతులు దగ్గరకిచేర్చి ఆయనకి నమస్కారం చేశాడు.

ఆయన ప్రశాంతచిత్తం, నిశ్చలమైన కళ్ళు, గంభీరవదనం ఎవరినైనా ఇట్టే ఆకర్షిస్తాయి.

బాబు నరేంద్రని దీవించి, "ఇప్పటికైనా నమ్మకం చిక్కిందా నాయనా! ఈ గదిలో దేవుని ప్రతిష్ఠించుకొన్నాను. యోగదీక్షతో ఆ పరమాత్మునితో ఎప్పుడు కావాలంటే అప్పుడు మాట్లాడగలను" అని ఒకక్షణం నరేంద్రవైపు తదేకంగాచూసి "నీ పేరేమిటి నాయనా?" అని అడిగారు.

నరేంద్రకి అంతకుముందే తనని ఆ గదిలో పేరుపెట్టి పిలవడం జ్ఞాపకం వచ్చింది.

"ఇంతకుముందే నాతో దేవుడు మాట్లాడాడు స్వామీ"

బాబు పెదవులపై చిరునవ్వు చెరిగిపోలేదు.

"ఏమని మాట్లాడాడు నాయనా?"

"నన్ను నా పేరుతో పిలచి, నేను శివుడిని నాయనా... నిరాకారిని అన్నాడు'"

"నువ్వేం అన్నావ్"

"ఆతరువాత ఏమీ అనకుండానే నాకు స్పృహపోయింది."

"అదృష్టవంతుడివి నాయనా! దేవునితో మాట్లాడగలిగేవు. నేను ఇక్కడకి పంపినవారిలో చాలాకొద్దిమందితోనే దేవుడు మాట్లాడాడు" అని, "భక్తులు నాకోసం వేచిచూస్తుంటారు. నేనిక వెడతాను. నీకు ఎప్పుడు వెళ్ళాలనిపిస్తే అప్పుడు వెళ్ళు"

"నేను వెళ్ళిపోతాను స్వామీ! నాకోసం బయట ఎదురుచూస్తున్నారు" అన్నాడు నరేంద్ర.

అతనికి అప్పుడు జ్ఞాపకం వచ్చింది తను చెబుదామనుకున్నది.

"స్వామీ" అని పిలిచాడు తలుపువైపు వెళ్ళిపోతున్న బాబుని.

వెనక్కితిరిగి చూడకుండా వెళ్లిపోయారు ఆయన. ఆయన వెనకే పరిగెత్తాడు నరేంద్ర. ఆ గది బయటకు వచ్చిన వెంటనే ఇద్దరు వ్యక్తులు అతన్ని పట్టుకొని బయటకు తీసుకొచ్చి దించేశారు.

అక్కడ అతని పేరు నోట్‌చేసుకున్న అమ్మాయి కనిపించింది. తను ఈ విషయంలో ముందుకెళ్లాలంటే ఈ అమ్మాయి హెల్ప్ తీసుకోవాల్సిందే అనిపించింది. ముందు ఈ అమ్మాయి ఆయన భక్తురాలో కాదో తెల్సుకోవాలి. ఆ తరువాత తనకి సహాయంచేసేలా చూసుకోవాలి అనుకున్నాడు.

బాబుగారు భక్తకోటికి దర్శనమివ్వడానికి బయటకు వెళ్లడంతో ఆ అమ్మాయికి కాస్త ఊపిరితీసుకొనే అవకాశం వచ్చింది. తన బ్యాగ్ సర్దుకొని బయటకు వచ్చింది. ఆమె వెనకాలే ఆశ్రమం బయటవరకూ నడిచాడు నరేంద్ర. అక్కడ రాజుగారు అతనికోసం ఎదురుచూస్తున్నారు. ఆయనని చూసికూడా పట్టించుకోకుండా ఆ అమ్మాయి వెనకాలే వెళ్ల సాగాడు.

"ఏమిటి... మాట్లాడకుండా వెళ్ళిపోతున్నాడు" అనుకొని ఆయన నరేంద్రని ఫాలోఅవసాగాడు. వాళ్ళిద్దరినీ, ఇంకొకడు ఫాలో అవుతున్నాడని వాళ్ళకి తెలియదు.

కొద్దిదూరం ఆ అమ్మాయితోపాటు నడిచిన నరేంద్ర "హలో... మీ పేరేమిటండీ?" అని అడిగాడు.

అంతవరకు అక్కడ డబ్బులు పుచ్చుకోవడాలు పేర్లు నోట్‌చేసుకోవడంలాంటి పనులతో విసిగెత్తిపోయిన ఆ అమ్మాయి "మీ కెందుకు?" అని అడిగింది.

ఏం చెప్పాలో అర్థంకాక అక్కడే ఆగిపోయాడు. ఇంకొక్కమాట మాటాడితే కరుస్తుందేమోనని అనుమానం వచ్చి అక్కడే ఆగిపోయాడు.

"ఏమైంది నరేంద్రా?" అడిగారు రాజుగారు.

"హొటల్‌లోపలకెళ్ళి మాట్లాడుకుందాం పదండి" అన్నాడు నరేంద్ర.

ఇద్దరూ హొటల్ లోపలికి వెళ్ళారు. వాళ్ళని ఫాలో అవుతున్న వ్యక్తికూడా లోపలకి వెళ్ళాడు.

"ఏమిటోనండి... నిజంగా దేవుడున్నాడేమోననిపిస్తోంది" అన్నాడు నరేంద్ర

ఎందుకలా అనిపిస్తోంది."

"దేవుడు స్వయంగా నాతో మాట్లాడాడండీ. అందుకే ఉన్నాడేమోననిపిస్తోంది"

"లోపల నీకేమైనా సినిమా అదే భక్తిరస ప్రధానచిత్రం చూపించారా"

"అలాంటి సినిమాలేమీ చూపించలేదు. ఏం ఎందుకు అలా అడుగుతున్నారు"

"సినిమాలలోనేగా దేవుడు స్వయంగా వచ్చిమాట్లాడేది... అందుకని" "నేను నిజం చెబుతుంటే మీకు వేళాకోళంగా ఉందే"

"లేదులే... అసలేంజరిగిందో చెప్పు"

అంతా విశదీకరించాడు నరేంద్ర. సావధానంగా విన్నరాజుగారు ---

"నీతో మాట్లాడింది దేవుడుకాదు. పక్కగదిలో ఉన్న మనిషి" అన్నారు నవ్వుతూ.

"పక్కగదిలోనుంచి నాకు వినబడేలా మాట్లాడటంఎలా సాధ్యం"

"నీ గదిలో స్పీకర్ ఉంటే సాధ్యపడుతుంది గదా"

"అలాంటిదేమీ కనబడలేదే"

"నీకు కనబడేలా అమరుస్తారా?"

"నాపేరెలా తెలిసింది వాళ్ళకి. లోపలకి వెళ్ళగానే నాపేరుతో పిలిచారు"

"రిజిస్టర్లో నీపేరు రాసావుకదా అది అక్కడకి వెళ్ళిపోవటానికి ఎంతసేపు కావాలి?"

"బాగానే ఉందిగానీ గాలిలో నుంచి నీరు ఎలాపుడుతుంది"

"అదే ఇంకాతెలియలేదు. నేను చెప్పమన్నట్టుగా చెప్పావా?"

"చెప్పడానికి కుదరలేదు"

"సరే... పదరూమ్‌కి వెళదాం"

"ఉండండి... నేను ఇందాక ఒకమ్మాయి వెనకేవెళ్ళానుగా, ఆ అమ్మాయిని కనుక్కుంటే ఏమైనా విషయాలు తెలుస్తాయేమో"

"ఎవరా అమ్మాయి?"

"నాపేరు రాసిన బుక్ ఆ అమ్మాయిదగ్గరే ఉంటుంది"

"ఇప్పుడొద్దు... రేపువద్దాం పద" అన్నారాయన.

వాళ్లు మాట్లాడుకున్నదంతా యథాతథంగా నోట్ చేసుకున్నాడు వాళ్ళని ఫాలో అవుతూ వచ్చినవ్యక్తి.

నరేంద్ర, రాజుగారు రూమ్‌లోకి వెళ్ళి తలుపులు వేసుకున్నారు." రేపు పొద్దున్న వరకు మనకేమిపనిలేదుగా. ఒక కొత్త ఆట ఆడుకుందామా!"

"ఏమాట"

"చెపుతానుగాని నీ దగ్గర పదిపావలకాసులున్నాయా?"

"లేవు మూడున్నాయి"

"చిల్లరకాసులు ఎన్నివున్నాయి?"

"పది ఉన్నాయి" అని తీసి ఇచ్చాడు.

రాజుగారు వాటిని త్రిభుజాకారంలో కింద నాలుగు, పైనమూడు, ఆ పైనరెండు, ఆఖర్న ఒకటి అమర్చారు పక్కనే ఉన్న టేబిల్‌మీద. అప్పుడవి పిరమిడ్ ఆకారంలోకి వచ్చాయి.

దానివైపే చూపుమరల్చకుండా చూస్తున్నాడు నరేంద్ర.

"చూసావుగా అందులో మూడు కాసులు మాత్రమే జరిపి మొత్తం పిరమిడ్ తలకిందులయే విధంగా తీసుకురావాలి" అని ఇందాకటి త్రిభుజాన్ని తిరగేసినట్టుగా ఈసారి అమర్చారు.

అలా చేసిన తరువాత మళ్ళీ ఇందాకటిలాగే అమర్చి-- "ఏ మూడింటిని ఎలా కదపాలోచెప్పు" అని మంచంమీద వాలిపోయారు.

అందులోవున్న కాసులన్నీటిని తన ఇష్టంవచ్చినట్లు కదిపాడుకాని మూడు కాసులని కదిపి దాన్ని తిరగేసి ఎలా రప్పించాలో తెలుసుకోలేకపోయాడు.

"చెప్పెయ్యండిసార్" అంటు మంచందగ్గరకి వెళుతున్న అతనికి బజర్‌మోత వినబడటంతో వెళ్ళితలుపుతీసాడు. బయటవెయిటర్ నిలబడి ఉన్నాడు. ఆమోతకి రాజుగారు లేచారు.

"ఏమిటి" అడిగాడు నరేంద్ర వెయిటర్‌ని.

"మీకు ఈ ఉత్తరం ఇవ్వమని ఒక వ్యక్తి ఇచ్చారండి" అన్నాడువాడు.

"ఎవరిచ్చారు?"

"ఆయన ఎవరో తెలియదండి. ఈ రూమ్‌లో రాజు అనే ఆయన ఉంటారు ఆయనకివ్వు అని చెప్పి ఇచ్చారండి" అన్నాడువాడు.

"ఆయనే రాజుగారంటే" అని ఆ ఉత్తరం తీసుకున్నాడు నరేంద్ర.

"ఏమిటి నరేంద్రా?" అడిగారాయన.

"మీ కెవరో ఉత్తరం ఇమ్మని వెయిటర్‌కిచ్చి పంపారు" అని ఉత్తరం తీసిఇచ్చాడు.

"నాకు ఇక్కడ ఎవరూ తెలియరే. ఎవరు పంపిఉంటారబ్బా" అన్నారు ఆయన.

"చూస్తే తెలుస్తుందికదా" అని ఉత్తరం ఆయనకిచ్చి, తను టేబిల్‌దగ్గరకి వెళ్ళాడు ఆ నాణేల పిరమిడ్‌తో ప్రయత్నించడానికి.

రాజుగారు కవరుచింపారు. లోపలి తెల్లకాగితం తీసి మడతలు విప్పారు.

"ఏమండీ... మీరు మీ అబ్బాయి, మీభార్య సుఖంగా ఉండటం ఇష్టంలేదా? మీ అబ్బాయి దైవాంశ సంభూతుడని అతని ప్రతిభని లోకం అంతా మెచ్చుకుంటూంటే మీరేమో కుశ్శంకలతో మనసుపాడుచేసుకొని, మీ అబ్బాయిమీదకి ఎవరినెవరినో పంపుతున్నారు. మీ అబ్బాయి ఇప్పుడు తన శరీరాన్ని మనసుని దేవునికే అంకితమిచ్చి, దేవునికోరికపై ప్రజల కష్టాలను దూరంచేయడానికి తనకున్న శక్తులను వినియోగిస్తున్నారు. అటువంటి కుమారుడిని కన్నందుకు గర్వపడక, మోసగాడు అని ఛీదరించుకుంటున్నారా. మీ అబ్బాయి తనపై నమ్మకంలేని వారికి నమ్మకం కలిగించడానికే ప్రయత్నిస్తున్నారు తప్పవాళ్ళని శపించడంలాంటి పనులు చేయటంలేదు. ఎంతోకాలంనుంచి ఆశ్రమకమిటీ మెంబర్లుగా ఉండికూడా దేవునితో మాట్లాడే అవకాశం పొందలేకపోయాము. మేము మీ అబ్బాయిని పరీక్షించమని మీరే పంపిన మనిషికి దైవదర్శనం కలుగచేసిన మహాత్ముడు మీకుమారుడు. ఆయన్ని అనుమానించటమా? మీకు మేము చెప్పదలచుకున్నది ఒకే విషయం--- మీరు ఇంకా ఈ ఊళ్ళోనే ఉండే అర్హత పోగొట్టుకున్నారు. మీరు, మీతోపాటు వచ్చిన వ్యక్తి మరో మూడు గంటలలో ఈ ప్రదేశాన్ని వదలివెళ్ళకపోతే, మీరు ఆ దేవుడుగారి నాన్నగారనికూడా లెక్కచేయకుండా జైల్లోపెట్టించాల్సి వస్తుంది. మీ మంచికోసమే ఇదంతా రాస్తున్నాం.

ఈసారి మీరువస్తున్నప్పుడు మాకు ముందుగా కబురు చేస్తే, మేమే మీకు ఘన స్వాగతం చెపుదాం. మీరు ఎటువంటి పరీక్షలు గాదు ఆయన చేస్తున్న మహత్యాలు ఎలా జరుగుతున్నాయోనని గాని తెలుసుకుందామని ప్రయత్నాలు చేయకపోతే మాకు గౌరవనీయ అతిథులవుతారు"

అని ఉందా ఉత్తరంలో.

"చదువు" అన్నారాయన ఉత్తరం నరేంద్రకు అందిస్తూ.

నరేంద్ర పూర్తిగా చదివిన తరువాత "ఇప్పుడేం చేద్దామంటారు?" అడిగాడాయనని.

"ఏదో అతథ్యం ఉందన్నారుకదా. అదేదో చూద్దాం" అన్నారాయన. మాటలు పూర్తికాక ముందే ముగ్గురు వ్యక్తులు లోపలకి వచ్చితన

లుపు గడియపెట్టారు.

"ఎవరు మీరు?" అన్న నరేంద్ర మాటలకి సమాధానంగా "పేపర్ ఇటు ఇవ్వండి" అన్నాడు అందులో ఒకడు.

"మేము పేపరు తెప్పించటంలేదు. అయినా పేపర్ కావల్సినవాళ్ళు తలుపుకొట్టి అడగాలికాని తలుపులేసి జబర్దస్తీగా అడుగుతున్నారేంటి?" అన్నాడు నరేంద్ర.

" ఆ పేపర్‌కాదు... వెయిటర్ ఇచ్చిన కవరులోని పేపరు"

"మాకు వెయిటర్ ఏమీ ఇవ్వలేదు"

అతని మాట పూర్తవడం, ముగ్గురిలో ఒకడి చేయి ఫెడీల్మని నరేంద్ర గెడ్డాన్ని తాకడం ఒకేసారి జరిగిపోయాయి.

రాజుగారు మారుమాట్లాడకుండా కవరు, ఉత్తరం ఇచ్చేసారు.

అది తీసుకొని "మీరు ఎన్నిగంటలలో ఇక్కడినుంచి వెళ్ళిపోతున్నారు?" అని అడిగాడు ఒకడు.

"ఇక్కడి ప్రకృతిదృశ్యాలు చాలా బాగున్నాయి. రెండురోజులుండి వెళతాం" అన్నాడు నరేంద్ర.

"మా చేతిదెబ్బకే అదిరిపోయావ్. పోలీసుల లాఠీదెబ్బలకి పైకి వెళ్ళిపోతావేమో జాగ్రత్త" అన్నాడు వాడు.

"ఇక్కడ ప్రకృతిదృశ్యాలు చూసేవాళ్ళని పోలీసులు లాఠీలతో కొడతారా?"

వాళ్ళు ఒకరి మొహాలు ఒకళ్ళు చూసుకున్నారు. "ఉత్తరం పూర్తిగా చదవలేదా?" అడిగాడు వాడు. "ఏ ఉత్తరం?" ఆశ్చర్యంగా అడిగాడు నరేంద్ర.

"ఈకాగితంలోది" అంటూ తన చేతిలోది చూపించాడు.

"చదివాను"

నరేంద్రవైపు అమాయకుణ్ణి చూసినట్టుగా చూసివాళ్ళు ముగ్గురూ నిష్క్రమించారు. వాళ్ళు నిష్క్రమించినవెంటనే రాజుగారు బ్యాగులను తీసుకొని "పద వెళ్ళిపోదాం" అన్నారు.

"అప్పుడేనా... ఏదో ఒకటి తేల్చుకుందామనుకొన్నాముగదా?"

"మనమేదో ఒకటి తేల్చుకునేలోపల మనమే తేలిపోయేలా ఉన్నాము"

"అంతేనంటారా?"

"అంతే... పద" అన్నారాయన.

ఇద్దరూ రూమ్ ఖాళీచేసి బస్‌స్టాండ్ చేరుకున్నారు. ఇందాక వచ్చిన ముగ్గురిలో ఒకడు దగ్గరగావచ్చి "వెళ్ళిపోతున్నారా... మళ్ళీ ఎప్పుడొస్తారు?" అని అడిగాడు.

"నీ పిండం కాకులకు పెట్టినప్పుడు" అని కదులుతున్న బస్సు ఎక్కేసాడు నరేంద్ర రాజుగారి వెనుకే.

★ ★ ★

కృష్ణమూర్తికి పరీక్షలు ఇంకా వారంరోజులలోనే ఉన్నాయి. పొద్దుటినుంచి చదువుతూ వుండటంతో బోర్‌కొట్టి సాయంకాలం అందాలని ఆఘ్రాణించడానికి బయటకివచ్చాడు. ముందు దేవి ఇంటికి వెళదామనుకున్నాడు. ఆమెకికూడా పరీక్షలేకదా, ఆమెనెందుకు డిస్టర్బ్‌చేయడం అని పార్కువైపు బయలుదేరాడు.

చాలాకాలంతర్వాత చల్లగాలికి మైమరచి నడుస్తున్న కృష్ణమూర్తి పక్కనుంచి హంసహొయలుతో ఓ అతివ అతన్ని దాటుకొని వెళ్ళిపోయింది. ఆమెని చూసిన మరుక్షణం తననితాను మరచి, లయబద్ధంగావున్న ఆమె నడకను తదేకంగా చూడనారంభించాడు.

ఆమెను ముందునుంచి చూడాలన్న ఆకాంక్షతో నడక వేగాన్నిపెంచి ఆమె సరసకు చేరుకున్నాడు.

తనపక్కకు చేరిన ఆ గడసరి ఎవరా అని క్రీగంట అతనివైపుచూసి, అతనుకూడా తనవైపే చూడటంతో తలతిప్పేసుకుందామె.

తను కళా పోషణచేయాల్సిన సమయం ఆసన్నమైందని గ్రహించాడు కృష్ణమూర్తి. ఓ క్షణం దేవి జ్ఞాపకంవచ్చింది. అయినా కళ్ళు మూసుకొని, "నేను తప్పుచేయడంలేదు దేవి. జస్ట్... సరదాగా చిన్నతమాషా అంతే. తప్పుగా భావించవుగా" అనుకున్నాడు మనసులో.

ఇంతలో- "ఏమయ్యోయ్... బతకాలని లేదా, రోడ్డుమీద కళ్ళుమూసుకు నడుస్తున్నావ్" అన్నమాటలు దానితోపాటే అమ్మాయి




నవ్వూ వినబడ్డాయి కృష్ణమూర్తికి.

ఆ మాటలు అన్నవాడివైపు విరాగిలా ఒక చూపి విసిరి "చనిపోవాలనుకున్నంతమాత్రాన చనిపోగలమా... అంతా ఈశ్వరుని కరుణాకటాక్షలీల" అన్నాడు కృష్ణమూర్తి. చివర మాటలకి అర్థం ఏమిటో అతనికే అర్థంకాలేదు. ఎదుటవున్నవాడికి అసలు అర్థంకాక ఏదో గొణుక్కుంటూ వెళ్ళిపోయాడు.

మళ్ళీ ఆ అమ్మాయి పక్కకి వెళ్ళాడు. "ఇందాక మీరు నవ్వారుకదా" అని అడిగాడు.

కృష్ణమూర్తిప్రశ్నకి బిత్తరపోయింది ఆ అమ్మాయి. తల అడ్డంగా ఊపింది.

"మీకు రాఘవరావు తెలుసా?"

"అతనెవరు?"

"నాతోపాటు పారిపోయివచ్చినవాడు"

"ఎక్కడినుంచి?" ఆశ్చర్యంగా అడిగింది ఆ అమ్మాయి.

"ఎవరికీ చెప్పకు, నేను చెపుతున్నది. నేనూ, రాఘవరావూ పిచ్చిఆసుపత్రినుంచి పారిపోయివచ్చాం" అన్నాడు.

"పిచ్చాసుపత్రినుంచా?" ఆ అమ్మాయి కళ్ళల్లో భీతి.

"అవును... ఎవరికీ చెప్పవుకదా" కళ్ళెర్రచేస్తూ అడిగాడు. తనకి కావాల్సిన ఎఫెక్టు ఆమె కళ్లల్లో కనబడటంతో ఇంకా భయపెట్టాలని అనుకున్నాడు. 'నన్ను చూసి నవ్వుతుందా. ఇప్పుడెలా నవ్వుతుందో నేనుచూస్తాను' అని మనసు అతనితో అంది.

తల అడ్డంగాఊపి "చెప్పను" అంది. ఆమె కాళ్ళూ చేతులు కొద్దిగా వణకడం ప్రారంభించాయి.

"పిచ్చివాళ్ళు ఎప్పుడు ఎలా ప్రవర్తిస్తారో వాళ్ళకే తెలియదు. వాళ్ళు హత్యచేసినా కేసుండదు" అని ఎప్పుడో ఎక్కడో చదివిన మాటలు ఆమెకి జ్ఞాపకంవచ్చాయి. పరిసరాలని ఒకసారి చూసింది. ఎవరూ పట్టించుకోవటంలేదు. ఏంచేస్తే ఏంచేస్తాడోనని బిగుసుకుపోయి నడుస్తోంది.

"మీకు రాధిక తెలుసా?"

"ఏ రాధిక?"

"మొన్న రాజమండ్రిలో హత్యచేయబడిన రాధిక"

"తెలియదు" భయంభయంగా అంది.

"ఆమె కంఠనాళాలు బ్లేడుతో కోసేసి చంపేసారు. ఎవరు చంపారో తెలుసా?" "తెలియదు" బెదురుచూపులు ప్రారంభమయ్యాయి.

"నేను ఈ అమ్మాయిని చంపొద్దురా అని ఎంత చెప్పినా వినకుండా చంపేసాడు వెధవ"

"ఎవరు?" ఆమె కళ్ళల్లో నీళ్ళు గిర్రున తిరుగుతున్నాయి. బయటకి ఉరకటానికి సిద్ధంగా ఉన్న కన్నీటిని నొక్కిపెట్టి ఆపింది.

"ఆ రాఘవగాడే! నాతో పారిపోయివచ్చిన రాఘవే చంపేసాడు. చంపేసి ఏం చేసాడో తెలుసా?"

"తెలియదు"

"ఆ అమ్మాయి తల పగలకొట్టి మెదడు తినేసాడు. నాకు కొద్దిగా పెట్టాడనుకోండి. ఎంత బాగుందనీ"

భయంతో ఆ అమ్మాయి కళ్ళు పత్తికాయల్లా విచ్చుకున్నాయి. కృష్ణమూర్తి చెప్పినదంతా తన కళ్లముందు జరుగుతున్నట్టే అనిపిస్తోంది ఆమెకి.

"నీ పేరేంటి?"

"శ్వేత"

"నువ్వేనా శ్వేత అంటే"

"అవును... ఎందుకు...అ...లా అడుగుతున్నావ్" తడబాటుగా అడిగింది.

"రాఘవ శ్వేతనికూడా చంపుతాను అన్నాడు. అయితే నిన్నుకూడా చంపుతాడన్నమాట. అడుగో రాఘవ... ఓరేయ్ రాఘవా!" అని గట్టిగా పిలిచి "ఇక్కడే వుండు వాడిని తీసుకొస్తాను. నీ మెదడు ఎంత బాగుంటుందో" అని వెనక్కితిరిగి అటు నడిచాడు.

కృష్ణమూర్తి నాలుగు అడుగులు అటువేసిన వెంటనే ఎవరో తరుముతున్నట్టు ఎక్కడా ఆగకుండా పరుగెత్తుకొని వెళ్ళిపోయింది ఆ అమ్మాయి. వెనక్కిచూసి గట్టిగా నవ్వుకున్నాడు కృష్ణమూర్తి.



"నవ్వే నాలుగు విధాలచేటట" అని మన సులో అనుకొని ఇక్కడదాక వచ్చేక దేవిదగ్గరకి వెళ్లకపోతే బాగుండదు. వెళ్ళివచ్చేద్దామని దేవి ఇంటివైపు బయలుదేరాడు.

మరో నెలరోజులవరకు కళాపోషణ అక్కర లేదు. అబ్బ... హాయిగావుంది. అనుకుంటూ సరాసరి దేవి ఇంటికి వెళ్ళాడు. అక్కడ నరేంద్రని, రాజుగారిని చూసి ఆశ్చర్యపోయాడు. వాళ్లద్దరితో ఉన్న అమ్మాయినిచూసి అవాక్కయిపోయాడు.

"అక్కడే నిలబడిపోయావేంటిరా?" అంది దేవి.

అంతవరకు దేవికి, మిగతా ఇద్దరికి ఏదో సీరియస్‌గా చెబుతున్న ఆ అమ్మాయి ఎవరా అని వెనక్కి తిరిగింది. ఆ అమ్మాయి వెనక్కి తిరుగుతూండగానే తన మొహాన్ని పక్కకి తిప్పుకున్నాడు కృష్ణమూర్తి. వెనక్కితిరిగిన అమ్మాయికి కృష్ణమూర్తి వీపుమాత్రమే కనిపించింది.

"ఎవరే అతను?" అని అడిగింది ఆ అమ్మాయి.

"కృష్ణమూర్తి అని చెప్పానే, అతనే" అంది దేవి.

"అమ్మాయిలంటే సిగ్గా?"

సిగ్గా, భయమా... నీగుండె ఆగిపోతుందేమోనని, భయం అనుకున్నాడు కృష్ణమూర్తి మనసులో.

"రావోయ్ కృష్ణమూర్తీ... ఈ అమ్మాయి ఒక ఇంటరెస్టింగ్ ఎక్స్‌పీరియన్స్ చెప్తుతుంది. నమ్మశక్యంగా లేని నిజం. రా కూర్చో... నువ్వూ విందువుగాని" అన్నారు రాజుగారు.

"నేను మళ్ళీ వస్తానండీ" అని వెళ్ళిపోబోయాడు.

"మళ్ళీ ఎప్పుడొస్తావు. రా... కొద్దిసేపు కూర్చొని వెళ్ళిపోదువుగాని" అని లాక్కొచ్చి కూర్చోపెట్టింది దేవి.

కృష్ణమూర్తి మొహం చూడగానే హిస్టీరియా వచ్చిన వ్యక్తిలా కాళ్ళు, చేతులు కొట్టుకోవడం ప్రారంభించింది ఆ అమ్మాయి.

"ఏమైంది శ్వేతా? ఏమైంది?" అంటూ దగ్గరికి వెళ్ళారు అందరూ. కాని, పాపం అప్పటికే స్పృహతప్పిపోయిందా శ్వేత.

"నేను వెళ్ళిపోతాను అంటే వినిపించుకోకుండా తీసుకొచ్చావు. ఏమైందో చూడు" అన్నాడు కృష్ణమూర్తి, దేవినుద్దేశించి.

అతను అంటున్న మాటలు అక్కడ స్పృహలో ఉన్న ముగ్గురికీ అర్థంకాలేదు. వాళ్లకి అర్థంఅయ్యేలా చెప్పాడు కృష్ణమూర్తి. తలవాచేటట్టు చీవాట్లు పెట్టారు ముగ్గురూ. దేవి లోపలికివెళ్ళి నీళ్ళు తీసుకొచ్చి శ్వేత మొహంమీద జల్లింది. నెమ్మదిగా కళ్ళుతెరిచి "ఇందాక కుర్చీలో కూర్చున్నాడే, అతనే మెదడుతినే రాక్షసుడు" అంది శ్వేత.

దేవి ఆ అమ్మాయికి కృష్ణమూర్తి చేసిన నిర్వాకం పూసగుచ్చినట్టు చెప్పింది.

అంతా విన్న తరువాత "అయితే అదంతా నిజంకాదా!" ఆశ్చర్యంగా అడిగింది శ్వేత.

"కాదండీ... మీరు నవ్వారన్న ఉక్రోషంతో అలా అన్నాను. ఐయామ్ సారీ" అన్నాడు కృష్ణమూర్తి.

"యూ ఆర్ నాట్ సారీ. యూ ఆర్ కృష్ణమూర్తి" అంది శ్వేత.

నవ్వులు వెన్నెల్లా కురిసాయి అక్కడ.

ఆ నవ్వుల వెన్నెలలో నరేంద్రకి ఒక ఉప్పైన ఆలోచన అతని మెదడుని తప్పుకుంటూ బయటికి వచ్చేసింది. మరికాసేపట్లో అది మిగతా అందరి మెదడులలోకి ఎక్కేసింది. దేవి ఆ ప్లాన్‌ను అసంతృప్తిగానే ఒప్పుకుంది.



నెలరోజులు గడిచిపోయాయి. కృష్ణమూర్తి పరీక్షలు అయిపోయాయి. బాగా రాశాను అనే



ఆనందంతో ఉన్నాడు. ప్రయాణానికి సంసిద్ధు డయ్యాడు కృష్ణమూర్తి. రాజుగారు అతని ప్రయాణానికి అన్నీ సిద్ధంచేస్తున్నారు.

"నువ్వెళ్ళిన నాలుగురోజులకల్లా నేను, నరేంద్ర కలుసుకుంటాము. నువ్వుమాత్రం మనం అనుకున్నపనిచేసి మాకోసం రెడీగా ఉండు" అన్నారు రాజుగారు.

"నాలుగురోజుల్లో ఆ పని పూర్తిచేయడం కష్టమేనండీ" అన్నాడు కృష్ణమూర్తి.

"వారంరోజులలో అయితే పూర్తిచేయగలవా?"

"అయితే పదిరోజులలో అయిపోతుంది. మీరు తరువాతరండి. ఒకవేళ అవసరమైతే చివరి మూడురోజులు అక్కడే ఉండొచ్చు" అన్నాడు కృష్ణమూర్తి.

"సరే... అలాగే కానీ నువ్వు బయలుదేరు.

బస్సుకి టైమ్ అయిపోతోంది'' అన్నాడు నరేంద్ర. అంతలోనే దేవి వచ్చేసింది.

''నీకు నూరేళ్ళు ఆయుష్షు దేవి. ఇప్పుడే నీగురించి మాట్లాడుకుంటున్నాం'' డబాయించాడు కృష్ణమూర్తి.

''ఏమనుకుంటున్నారు?''

ఏదో అనబోతుండగా నరేంద్ర అడ్డొచ్చాడు.

''పదపద... బస్సుకి టైమ్ అయిపోతోంది. మిగతా విషయాలు వచ్చిన తరువాత మాట్లాడుకుందురుగాని'' అన్నాడు నరేంద్ర.

అందరూ బస్ కాంప్లెక్స్‌కి బయలుదేరారు. ఒక పావుగంట తరువాత అక్కడికి చేరుకున్నారు నలుగురూ.

అక్కడో అరగంటసేపు రాని బస్సుని తిట్టుకుంటూ గడిపారు.

అనుకోకుండా అప్పుడు జ్ఞాపకం వచ్చింది నరేంద్రకి కానులతో రాజుగారు చెప్పిన ఆట.

''ఏమండీ... మూడుకానులు జరిపి దాన్ని తిరగబడేలా చేయడం ఎలాగండీ'' అని అడిగాడు రాజుగారిని.

కృష్ణమూర్తికి ఏమీ అర్థంకాలేదు. ''అదేమిటి?'' అని అడిగాడు.

రాజుగారు వివరించగానే ముగ్గురూ దానితో కుస్తీపట్టడం ప్రారంభించారు. అలా ఓ పావుగంట గడచిపోయింది కాని వాళ్ళకి ఎలాచేయాలో అర్థంకాలేదు.

అప్పుడే బస్సుకూడా వేంచేయడంతో గబగబ బ్యాగులు సర్దుకొని బస్సులో కూలబడిపోయాడు.

''విష్ యూ ఆల్ ది బెస్ట్'' అన్నారు ముగ్గురూ.

''థాంక్యూ'' అన్నాడు కృష్ణమూర్తి.

బస్సులో కూర్చొని ఆలోచించడం ప్రారంభించాడు. అతని మెదడులో దాని ఆకారం స్థిరపడిపోయింది. దేన్ని కదిపితే అది తిరగపడుతుందో ఒక్కొక్కదానిని కదపడం ప్రారంభించాడు. అలా తెలకపోవడం, ముందు మూడుకానులని ఎలా తిరగేయాలో ఆలోచించడం ప్రారంభించాడు. తరువాత ఆరు కానులతో రెండింటిని కదిపి తిరగేయడం ఎలాగో తెలిసిపోయింది. మొత్తం అంతా తెలిసిపోయింది.

దిగాల్సిన ఊరు రావడంతో దిగిపోయాడు కృష్ణమూర్తి. లోగడ నరేంద్ర, రాజుగారూ దిగిన హొటల్‌లోనే దిగాడు.

ఆరోజు విశ్రాంతి తీసుకొని తరువాతరోజు బాబుగారి ఆశ్రమాన్ని చేరుకున్నాడు. తిన్నగా బాబుదగ్గరకే వెళ్ళడానికి ఉద్యుక్తుడై మధ్యలో అమ్మాయిని చూసి ఆగిపోయాడు ''బ్యూటిఫుల్'' అని ఆ అమ్మాయికి వినిపించేలా అన్నాడు.

ఆ అమ్మాయి దగ్గరకెళ్ళి ''యూ ఆర్ బ్యూటీఫుల్'' అన్నాడు.

ఆ అమ్మాయి సిగ్గుపడింది.

''మీ పేరేమిటండి?'' ''శశికాంత''

''అబ్బ... ఎంత అందమైనపేరు. రూపుకి తగిన పేరు'' అన్నాడు.

''థాంక్యూ'' అని రిజిష్టరు ముందుకి తోసింది.

''ఏమిటండి?'' ఆశ్చర్యంగా అడిగాడు.

''పైన చదవండి... మీకే తెలుస్తుంది''

పైన ఉన్నది చదివి, ''అయితే మనీ ఇవ్వాలంటారా'' అడిగాడు కృష్ణమూర్తి.

''మీవెనుక చాలామంది ఉన్నారు''

''అయితే వాళ్ళని ముందు పంపేయండి. మీ సుందరవదనాన్ని ఇంకొద్దిసేపు చూసేభాగ్యం కలుగుతుంది నాకు''

శశికాంత నవ్వేసి ''ఎంత వేయమంటారో చెప్పండి?''

''లక్ష కోట్లకి, కోటిలక్షలకోట్లకి ఎంత తేడా అయితే అంత వేసుకోండి'' అన్నాడు.

అతను చెపుతున్నంత వేద్దామని రడీగా ఉన్న ఆమె అతను చెప్పిన సంఖ్య అర్థంకాకపోవడంతో ప్రశ్నార్థకంగా అతనివైపు చూసింది.

''మీపేరు చెప్పండి గురూగారు'' అన్నాడు కృష్ణమూర్తి తనవెనుకన ఉన్న వ్యక్తిని. అతను పేరు చెప్పి డబ్బు ఇచ్చి లోపలికి వెళ్ళిపోయాడు.

ఓ పది నిముషాలవరకు వస్తున్నవాళ్ళపేర్లు




నోట్ చేసుకోవడంతో సరిపోయింది శశికాంతకి.

"ఇప్పుడు... చెప్పండి ఎంత వేసుకోమంటారో?"

"లక్ష కోట్లకి, కోటి లక్షలకి తేడా ఎంతో అంత వేసుకోండి" అన్నాడు.

కొద్దిక్షణాలు ఆలోచించి "ఎంత తేడా... చెప్పండి?"

"తేడా ఎంతో చెపుతాను. నా దగ్గర అంతే డబ్బు వసూలుచేయాలి" అన్నాడు.

"రిజిష్టర్‌లో ఎంతరాస్తే అంతే వసూలుచేస్తాను" అంది శశికాంత.

"తేడా ఎంతో చెప్పనా?"

"చెప్పండి"

"తేడా ఏమీలేదు. రెండూ సమానమే. నేను డబ్బులేమి ఇవ్వనక్కర్లేదు"

"నేను మీరు చెప్పిన ఆ సంఖ్య రిజిష్టర్‌లో నోట్‌చేసుకోలేదు"

"నోట్ చేసుకోకపోతే...."

"నేను రిజిష్టర్‌లో ఎంత నోట్‌చేసుకుంటే అంతే వసూలుచేస్తానన్నాను. వెయ్యికి తక్కువ కాకుండా చెప్పండి. అది నోట్‌చేసుకొని అంతే వసూలుచేస్తాను."

"తప్పదంటారు"

"దర్శనం చేసుకోవాలంటే తప్పదు"

"దర్శనం అయిపోయిందిగా"

"ఎప్పుడు అయిపోయింది?"

"ఎప్పుడో అయిపోయింది. ఇంకా ఇప్పుడు కూడా దర్శిస్తూనే ఉన్నాను"

"ఎవరిని?" చిరుకోపంతో అడిగింది.

"ఎవరినైతే మీకెందుకులెండి! అందాన్నంతటిని పోగుచేసి తనలో ఇముడ్చుకున్న సుందరవదనాన్ని సుకుమార శరీరాన్ని దర్శించుకున్నాను"

చిరుసిగ్గుని ఒలకబోసింది శశికాంత. ఆమెకి అర్థమవుతోంది కృష్ణమూర్తి ఎవరిని ఉద్దేశించి అంటున్నాడో.

"ఆహా... సిగ్గుపడినప్పుడు కెంపులైన ఆ బుగ్గలు, అదురుతున్న పెదవులు, అరమోడ్పులైన కనులు— అన్నిటినీ దర్శించాను"

"దర్శించుకున్నాను అంటున్నారుగా ఇంకా ఇక్కడెందుకు?"

"ఎక్కడకి రమ్మంటారో చెప్పకుండా ఇక్కడెందుకు అంటే ఎలా?"

శశికాంత మౌనంగా ఉండిపోయింది.

"పది వీధిదీపాలున్నాయి ఒక్కొక్కవీధికి. నాలుగు దీపాల చొప్పున ఐదు వీధులలో అమర్చారు. ఆ అయిదు వీధులూ ఎలావుంటే ఒక్కొక్క వీధికి నాలుగుదీపాలు చొప్పున్న పది దీపాలని అమర్చొచ్చు? జవాబుకోసం సాయంత్రం ఆశ్రమం బయట ఎదురుచూస్తుంటాను" అని వెళ్ళిపోయాడు కృష్ణమూర్తి.

"ఒక్కొక్కవీధికి నాలుగు దీపాలు చొప్పున ఐదు వీధులలో పది దీపాలని ఎలా అమర్చవచ్చు?" అని తనలో తానే ఒకసారి అనుకొని కాగితం తీసుకొని ఎలా అమర్చవచ్చో అని గీసుకోవడం ప్రారంభించింది.

మధ్యాహ్నం ఇంటికి బయలుదేరింది శశికాంత. అప్పుడూ అవే ఆలోచనలు.

ఎంత ఆలోచించినా తెలియటంలేదు.

అప్పటికే భోజనంచేసి రడీగావున్న కృష్ణమూర్తి ఆమె వెనుక బయలుదేరాడు. ఆమెని గమనిస్తూ ఆమె తనని గమనించకుండా జాగ్రత్తపడుతూ నడుస్తున్నాడు. శశికాంత తన ఇంటిలోకి వెళ్ళిపోయింది.

"మందు వేసుకున్నావా నాన్నా?" అని అడిగింది రాగానే. ఆయనకి షుగర్, బి.పి. ఉన్నాయి.

"ఇంకా భోజనంచేయలేదమ్మా... నువ్వు వచ్చేస్తావుకదా అని"

"నాకు అప్పుడప్పుడు లేటవుతుంది. నిన్ను తినేయమని చెపుతున్నానుకదా. అయినా నామాట వినవు నువ్వు" బుంగమూతిపెట్టి అంది శశికాంత.

"ఏమిటోనమ్మా నువ్వు పక్కనుండకపోతే నాకు భోజనం చేసినట్టు ఉండదు"

బాత్‌రూమ్‌లోకెళ్ళి కాళ్ళూచేతులు కడుక్కొని వచ్చి "రా నాన్నా... భోజనం పెట్టేస్తాను" అంది.

"పదమ్మా" అంటూ లేచారు నాగేశ్వరరావు

గారు.

అన్నంపెట్టింతరువాత నాగేశ్వరరావుగారు భోజనం చేస్తుంటే "నాన్నా ఒక్కొక్కవీధికి నాలుగు దీపాలు చొప్పున ఐదువీధులలో పది దీపాలని ఉంచడం ఎలా సాధ్యం నాన్నా" అని అడిగింది.

"ఏమోనమ్మా నాకూ తెలియడంలేదు" అని భోజనం పూర్తిచేసారు.

శశికాంత తాను కూడా భోజనంపూర్తిచేసి సామానులన్నిటిని సర్దేసి మళ్ళీ ఆశ్రమానికి బయలుదేరింది. ఆమె కృష్ణమూర్తి అడిగినదాన్ని గురించి ఆలోచిస్తుంటే ఇంకొకటి అలాంటిదే తట్టింది. అతనిని అడుగుదామని మనసులో దాచేసుకుంది.

కృష్ణమూర్తి శశికాంత ఆశ్రమానికి బయలుదేరిన తరువాత ఆమె ఇంటివైపు బయలుదేరాడు.

ఆమె ఇంటితలుపు తట్టాడు. నాగేశ్వరరావుగారు తలుపుతీశారు.

"ఎవరుకావాలి బాబూ" "నాగేశ్వరరావుగారు కావాలండి"

"నేనే బాబు... ఏంటి విషయం...?"

"నేను ముకుందంగారి అబ్బాయినండి"

"ఏ ముకుందం?"

"మీ స్నేహితుడు అండి. మీరు, మా నాన్నగారు కలిసే యస్.యస్.యల్.సి. కంప్లీట్ చేసారంటకదండి"

"ఓహో... అలాగా" అన్నారేగానీ ఆయనకి ముకుందం ఎవరో జ్ఞాపకం రావడంలేదు.

"మొన్న సర్వేశ్వరరావుగారు కనిపించి మీరిక్కడ వుంటున్నారని చెప్పారండి. నాకు పని వుండి ఇక్కడకి వస్తుంటే మిమ్మల్ని కలుసుకోమని నాన్నగారు చెప్పారండి"

ఆ సర్వేశ్వరరావు ఎవరో ఆయనకి అసలు అర్థంకాలేదు. ఎవరో ఉండే వుంటారు. నేను మరచిపోయి ఉంటాను. కుర్రవాడు బుద్ధిమంతుడిలాగే ఉన్నాడు అనుకున్నారు.

"రాబాబు... కూర్చో" అన్నారాయన.

"ఆంటీ లేరాండి?" లోపలికి వస్తూ అడిగాడు.

కృష్ణమూర్తి ప్రశ్నకి సమాధానంగా ఫొటోచూపించాడు. పూలమాలవేసి ఉంది దానికి.

"ఐయామ్‌సారీ అంకుల్" అన్నాడు.

"ఇట్సాల్‌రైట్. కమాన్ మై బాయ్... నీ పేరేమిటి?"

"కృష్ణమూర్తి అండి"

"ఏంచేస్తున్నావు?"

"మొన్నే బి.యస్సీ పరీక్షలు రాశానండి"

"గుడ్. ఇప్పుడే వస్తానుండు" అని లోపలికి వెళ్ళి పాలు స్టవ్‌మీదపెట్టి వచ్చారు.

"ఇంట్లో ఎవరూ కనిపించడంలేదేమిటి అంకుల్?"

"ఒకే ఒక అమ్మాయి. ఇంటర్మీడియట్ చదివి ఆపేసింది. ఆశ్రమంలో నాకు తెలిసినాయన ఉంటే దానికి ఉద్యోగం ఇప్పించాడు"

"పేరేమిటి అంకుల్?"

"శశికాంత"

"పొద్దున్న ఆశ్రమంలో కలిసాను అంకుల్"

"ఇప్పుడే వస్తాను" అని మళ్ళీ లోపలికి వెళ్ళడంతో కృష్ణమూర్తికి ఈయనేదో చేస్తున్నారనిపించి ఆయనతోపాటు తానూ లోపలికి వెళ్ళాడు.

కృష్ణమూర్తి వెళ్ళేటప్పటికి కాఫీపొడి, పంచదారతీసి పాలు దించడానికి గుడ్డపట్టుకొని రెడీ అయిపోయారు. "నేను చేస్తాను కాఫీ, మీరు పక్కకి ఉండండి అంకుల్" అని గుడ్డ తీసుకున్నాడు.

"నీకెందుకు బాబూ శ్రమ" అన్నారాయన గుడ్డఇచ్చేస్తూ.

"ఇందులో శ్రమేముందండి. మీరు అలా కూర్చోండి. నేను పూర్తిచేసేస్తాను" అని పాలు దించేసాడు. చకచక కాఫీకలిపేసి, ఆయనకో గ్లాసులో, తనకొక గ్లాసులో పోసుకున్నాడు. ఇద్దరూ బయటకి వచ్చారు. మౌనంగా కాఫీతాగడం పూర్తిచేసారు.

"ఇక్కడెక్కడ ఉంటున్నావు?"

"హొటల్‌లో రూమ్‌తీసుకున్నానండి"

"ఇక్కడ మేముండగా హొటల్‌లో రూమ్ తీసుకోవడమేమిటయ్యా?"

"అబ్బే... ఎందుకులెండి, మీకు శ్రమ"

"ఇందులో శ్రమ ఏముంది?"

"శ్రమ కాకపోయినా... ఎందుకులెండి"

"ఇక్కడకి రావడానికి నీ అభ్యంతరం ఏమిటో చెప్పవయ్యా?"

"అభ్యంతరం ఏమీలేదు, కానీ నేను ఒక వారంరోజులవరకూ ఇక్కడే ఉంటానండీ"

"వారంరోజులు కాకపోతే నెలరోజులుండవయ్యా. మేం భోజనం పెట్టలేమనుకుంటున్నావా?"

"అబ్బే... అలాంటిదేంలేదండీ"

"అయితే రూమ్‌కి వెళ్ళి సామానులు తెచ్చుకో" అని మళ్ళీ ఏదో ఆలోచించి "నేనూ వస్తానుపద" అన్నారాయన.

సామానులతో ఆ ఇంటికి చేరుకున్నాడు కృష్ణమూర్తి.

ఆ సాయంత్రం కృష్ణమూర్తి కోసం ఆశ్రమంగేటుదగ్గర చూసింది శశికాంత. అక్కడ లేకపోవడంతో, అయ్యో... పేరైనా అడగలేదే అనుకుంది.

అన్యమనస్కంగా ఇల్లుచేరుకుంది. లోపల తండ్రి ఎవరితోనో మాట్లాడుతుండటం విని "ఎవరొచ్చారబ్బా" అనుకుంటూ లోపలికి వచ్చింది. లోపల కృష్ణమూర్తిని చూసి షాక్ అయింది.

"ఏమిటమ్మా అలావుండిపోయావ్? ఇతను నాస్నేహితుడు ముకుందం వాళ్ళబ్బాయి. మా అమ్మాయి బాబూ"

"నమస్కారం" అంది.

"నమస్తే" అన్నాడు.

"అబ్బాయికి ఇక్కడేదో పనివుండి వచ్చాడంట. మన ఇల్లు వుండుకొని హొటల్‌లో దిగాడు. నాలుగు చీవాట్లేసి ఇక్కడకి తీసుకొచ్చాను"

అలాగా అన్నట్టు తలపంకించి లోపలికి వెళ్ళిపోయింది.

"కొత్తవాళ్ళతో అది సరిగా మాట్లాడదు. ఏమనుకోకు బాబు" "నాకు కొత్త పాత ఏమీ వుండవులెండి. నేనే వెళ్ళి మాట్లాడతాను"

"అయితే ప్రొబ్లమేలేదు" అన్నారాయన.

కాళ్ళూచేతులు కడుక్కొని వంటకార్యక్రమం ప్రారంభించడానికి వంటగదిలోకెళ్ళింది. అక్కడ కృష్ణమూర్తి ఉండటంతో గిరుక్కున వెనక్కి తిరిగి వచ్చేసింది. అతని దగ్గర కెళ్ళాలన్నా అతనితో మాట్లాడాలన్న చచ్చేంత సిగ్గుగా వుంది. శశికాంతకి తనగదిలోకెళ్ళి దిండులో తలదూర్చుకొని మధురోహలలో మునిగిపోయింది. శశికాంత ఎంతకీ ఆమెగది నుండి బయటకి రాకపోవడంతో, కృష్ణమూర్తి ఆమె గది దగ్గరికెళ్ళి "ఏమండోయ్ శశికాంతగారు... సినిమాకి వెళ్ళాలని నిశ్చయించాము. త్వరగా తయారయితే మేము సినిమా ప్రారంభం నుండి చూస్తాం" అన్నాడు.

"ఏ సినిమాకి?" తనకేమి తెలియకుండానే సినిమాకి వెళ్ళేంతవరకు వచ్చిందా వ్యవహారం అనుకుంది మనసులో.

"ఏదో ఒక సినిమాకి. అంకుల్ సినిమా చూసి చాలారోజులయిందిగా"

"మరివంట?"

"వంటవండేయడం అయిపోయింది"

"మీరు వండారా?" మంచంమీదనుంచి ఒక ఉదుటున కిందికి దిగి అడిగింది. "అవునండి"

"భలేవారండి..., మాకు అతిథి మీరు. మీరు వండటం ఏమిటి? నేనొచ్చి వండేదాన్నిగా. నాన్నగారు అసలు ఎలా ఒప్పుకున్నారు?"

"నేను మీ అతిథినికానండి... మీ ఫ్రెండ్‌ని. ఫ్రెండ్‌కి అన్నిచోట్ల అధికారం వుంటుంది. నేను మీ ఫ్రెండ్‌ని కాదంటారా?"

"ఛఛ... అలా ఎందుకంటాను" అని గుమ్మం దగ్గరకి నడచి వచ్చేసరికి ఆమెకి అడ్డు తప్పుకొని "ఆ వీధులు ఎలా వుంటాయో తెలియాలంటే సినిమానుంచి వచ్చేటప్పుడు ఆకాశం వైపు చూడండి. తెలుస్తుంది" అన్నాడు.

"ఆకాశంవైపు చూస్తే ఎలా తెలుస్తుంది?"

"అది అడక్కూడదు. తెలుస్తుంది అన్నాను తెలుస్తుంది"

"అయితే మీరడిగినలాంటిదే నేను ఒకటి అడగనా?"

"ప్యూర్... తప్పకుండా అడగండి"

"తొమ్మిది వీధిదీపాలు, ఎనిమిది వీధులు. ఒక్కొక్క వీధికి మూడు దీపాలుండాలి" అంది.

"జంక్షన్స్ దగ్గర ఎన్ని వీధులు కలుస్తు న్నాయో చెప్పండి. ఐమీన్ ఏ వీధి దీపం ఎన్ని వీధులకి కాంతినిస్తుంది? అంటే ఎన్నివీధులు కలుసుకునే చోట ఒక వీధి దీపం వుంచారు అని నేనడిగింది... అర్థమైందా?" అన్నాడు.

"అర్థమైంది. రెండువీధులు కలుసుకునే చోట ఒకటి చొప్పున నాలుగు, మూడు వీధులు కలుసుకునేచోట మూడు చొప్పున నాలుగు. నాలుగు వీధులు కలుసుకునే చోట ఒకవీధి దీపం వున్నాయి" అంది.

"మీరు స్నానానికి వెళ్ళండి... నేను ట్రై చేస్తూ వుంటాను" అన్నాడు...

శశికాంత స్నానానికి వెళ్ళిపోయింది.

నాలుగు వీధులు కలుసుకునేచోటు ఒక టుంది కాబట్టి ఒక పాయింట్ దగ్గర నాలుగువై పుల నాలుగు వీధులుండి వుంటాయి అను కొని కాగితం తీసుకున్నాడు.

ఆ పాయింట్ నాలుగు వీధులకి చివరన కాని, మధ్యనకాని వుండాలి. లేకపోతే అన హ్యాంగా వుంటుంది.

మధ్యలో గుండ్రంగా చుట్టినచోట దీపం వుంటే, ఒక్కొక్కవీధికి మూడు దీపాలుండాలి కాబట్టి అటు చివర ఒకటి, ఇటుచివర ఒకటి వుంటాయి. కరెక్టుగా తొమ్మిది అయిపోయాయి. అంటే మిగతా నాలుగు వీధులు మూడు దీపాలని కలుపుతూ గీయాలి అనుకొని అలాగే గీశాడు. అన్ని లెక్క చూసుకున్నాడు. అన్ని సరిగా సరిపోవడంతో మళ్ళీదాన్నే సరిగా గీసి శశికాంతకోసం వేచిచూస్తున్నాడు.

స్నానం చేసి వచ్చింది శశికాంత. తను గీసింది చూపించాడు కృష్ణమూర్తి.

"కరెక్టుగా గీశారే. అయితే మీరుకూడా చె ప్పండి నేను చెప్పినట్టు. నేను దాని షేపు గీసేస్తాను" అంది.

"కష్టం కనుక్కోవడం. నా మాటవిని రాత్రి వచ్చేటప్పుడు ఆకాశంవైపు చూడండి తెలి సిపోతుంది"

"మీరు చెప్పండి... ఇప్పుడే చెప్పేస్తాను"

"వీధి దీపం ఉన్న ప్రతిచోట రెండు వీధు లు కలుస్తున్నాయి" అని చెప్పి స్నానానికి వెళ్ళిపోయాడు.

కాగితం, పెన్ను తీసుకొని మళ్ళీ ప్రయ త్నించడం ప్రారంభించింది.

కృష్ణమూర్తి స్నానం చేసి వచ్చేసాడు కాని శశికాంత ప్రయత్నిస్తున్న దాంట్లో సఫలత సాధించలేదు.

నాగేశ్వరరావుగారు వచ్చి "సినిమాకు టికె ట్లు తీసి వుంచమని చెప్పివచ్చాను" అని స్నానానికి వెళ్ళిపోయారు.

కృష్ణమూర్తి శశికాంత దగ్గరికి వచ్చి "తెలి సిందాండి?" అని అడిగాడు.

"లేదండి"

"చెప్పేయమంటారా, రాత్రి ఆకాశంవైపు చూసి కనుక్కుంటారా?"

"ఆకాశంవైపు చూస్తే ఎలా తెలు స్తుందండి?"

"తెలుస్తుందని తెలుసండి, ఎలా తెలు స్తుందో తెలియదు"

'చెప్పొచ్చుగా పెద్ద.... తనకే తెలుసని' అనుకుంటూ తయారవడానికి అద్దంముందు కి వెళ్ళింది.

"అద్దం ముందు ఆరుగంటలుండి అప్పల మ్మగారు రికార్డు సృష్టించారంట. ఆ రికార్డును బద్దలు కొట్టాలని ప్రయత్నించక పది నిముషా లలో వచ్చేయండి" అన్నాడు కృష్ణమూర్తి.

నాగేశ్వరరావుగారు, కృష్ణమూర్తి చకచక తయారయిపోయారు.

వాళ్ళు కుర్చీలలోనే నిద్రబోయే సమయాని కి "ఐయామ్ రడీ" అంటూ బయటికి వచ్చింది శశికాంత.

"ఐథింక్‌యూ ఆర్‌నాట్ రెడీ... యూఆర్ శశికాంత"

చిన్నగా నవ్వేసి "పదండి" అంది. ముగ్గు రూ సినిమాకి బయలుదేరారు.

"ఇదిగోండి సర్ టికెట్లు. పిక్చర్ బిగిన్ చేసేలా ఉన్నాడని నేనే తీసుకొచ్చేసాను" అని టిక్కెట్లు ఇచ్చి వెళ్ళిపోయాడు పక్కింటి అబ్బాయి.

నడకవేగాన్ని పెంచి సినిమాహాలుకి చేరుకున్నారు.

సినిమా అయిపోయిన తరువాత నెమ్మదిగా నడుచుకుంటూ వస్తున్నారు ముగ్గురూ.

ఆకాశంవైపు తదేకంగా చూస్తోంది శశికాంత.

"ఆకాశంలో నక్షత్రాలు తప్పించి ఇంకేమీ కనబడటంలేదు" అంది శశికాంత.

"అవే కనబడతాయి. మరి అదేకదా ఆన్సర్"

"ఎలా?"

"అదైనా ఆలోచించండి. తెలియకపోతే ఇంటికి వెళ్ళిన తరువాత చెపుతాను"

కొన్ని నిముషాలలోనే అర్థమయిపోయింది శశికాంతకి.

"నాకు అర్థమైపోయింది"

"ఇంటికెళ్ళిన తరువాత చెబుదురులే" అన్నాడు.

ఇంటికెళ్ళగానే పేపర్, పెన్ను తీసుకొని బొమ్మగీసింది.

"కరెక్ట్" అన్నాడు కృష్ణమూర్తి.

"ఏమిటోయ్ కరెక్టు?" అడిగారు నాగేశ్వరరావుగారు.

"మధ్యాహ్నం నిన్నడిగానే వీధిదీపాల లెక్క" అంటూ గీసింది చూపించింది శశికాంత.

★ ★ ★

మర్నాడు ఉదయం ఆశ్రమానికి బయలుదేరింది శశికాంత. ఆమె గదిలో కెళ్ళాడు కృష్ణమూర్తి.

"ఆశ్రమానికి వెళుతున్నారా?"

"ఊ... ఎందుకలా అడుగుతున్నారు?"

"ఏంలేదు... ఊరికే" అని పౌడర్‌డబ్బాతీసుకొని- "రవిబాబుగారు రాత్రి ఆశ్రమంలోనే ఉంటారా?" అనడిగాడు.

"ఆశ్రమంలో కాక ఇంకెక్కడ ఉంటారు"

"బాబుగారికి తల్లి, తండ్రిలేరా?"

"ఉండేవుంటారు. లేకుండా ఎలాపుడతారు?"

"ఇక్కడే ఉన్నారా లేరాఅని"

"నాకుతెలిసినంతవరకు ఇక్కడలేరు."

"బాబుగారు దేవుడితో మాట్లాడతారంట కదా" సాధ్యమైనంత అమాయకత్వాన్ని మొహంలో ప్రతిబింబిస్తూ అడిగాడు.

"మాట్లాడతారంట. నాకైతేనమ్మకంలేదు" అంది శశికాంత.

ఆమెమాటలకి ఆశ్చర్యపోయాడు కృష్ణమూర్తి. "ఏం... ఎందుకని నమ్మకంలేదు?"

"ఏమో అక్కడి పరిస్థితులని చూస్తుంటే ఏదోగూడుపుఠాణి జరుగుతున్నట్టు అనిపిస్తుంది"

"ఏమిటాపరిస్థితులు"

"నేను ఈ ఉద్యోగంలో జాయినయిన కొత్తలో బాబుగారిమీద పూర్తి నమ్మకంవుండేది. ఆ నమ్మకంతోఒకసారి ఆయనని దర్శించుకోడానికి వెళ్ళాను. నేను ఆయనదగ్గరికి వెళ్ళగానే- "నువ్వు ఆశ్రమంలోనే పనిచేస్తున్నావుకదా" అని అడిగారు.

"అవును స్వామీ" అని చెప్పాను.

చుట్టు ఒకసారి చూశారు. దగ్గరలో ఎవరు లేకపోవడం గమనించి, నాకొకకాగితం ఇచ్చారు. కాని అక్కడేవున్న ఓ వ్యక్తి అదిచూసి కాగితం నాదగ్గరనుంచి తీసుకున్నాడు. అందులో ఏముందోవాడికి అర్థంకాలేదు.

"ఏమిటి స్వామీ... ఏదోరాశారు" అని అడిగాడు.

"ఆ కాగితాన్ని ఆమెకివ్వు. శివుని ఆజ్ఞ, నువ్వు ఆ కాగితంలో ఉన్నట్టుగాచేయమ్మా నీకు శుభంకలుగుతుంది" అన్నారాయన.

"ఆయనకి వింజామరలు వీచే ఆ భక్తుడు అలాఅడగడం నా అనుమానానికి కారణం. ఆయన వాళ్ళచేతుల్లో ఇరుక్కున్నారేమోనని నా అనుమానం."

వాడు కాగితాన్ని నాకిచ్చేసాడు. అందులో ఉన్నది నాకిప్పటికీ అర్థంకాలేదు. ఏవో అంకెలు, గుర్తులు వేసి ఉన్నాయి. తరువాత నావైపు రెండుమూడుసార్లు చూసారు. ఆ చూపులో అర్థమైందా అన్నప్రశ్నవుండేది. నేను అడ్డంగా తలఊపాను. నాకు అర్థంకాదని నిర్ణ

యించుకున్నారేమో తరువాత తరవాత నావైపు చూడడంమానేసారు. ఆ తరువాత బాబుగారు రాత్రిపూట ఆయన పడుకునే గది తలుపులు తాళాలు వేసేస్తారని తెలిసింది. దాంతో నా నమ్మకం బలపడింది. ఆయనని లోపల వుంచి బయటతలుపులు వేయడం ఎందుకు అని అయినా ఇవన్నీ మీకెందుకు" అంది శశికాంత

"ఆయన్ని దర్శించుకుందాముకదా అని నేనడిగితే మీరే ఇదంతా చెప్పారు"

"ఇప్పటికే ఆలస్యం అయిపోయింది. నేనిక వెడతాను" అని బయటకి నడిచింది.

"బాబు ఇచ్చిన కాగితం మీదగ్గరుందా అని అడుగుదామనుకున్న కృష్ణమూర్తి మాటలు నోటిలోనే ఉండిపోయాయి. శశికాంత బయటకి వెళ్ళిపోయింది. సాయంత్రం అడిగి తెలుసుకో వాలనుకున్నాడు.

మధ్యాహ్నం ముగ్గురూ కలసి భోజనంచేసారు. ఆయన రాసిన కాగితంగురించి అడగడానికి ఎటువంటి అవకాశం కలగలేదు కృష్ణమూర్తికి. భోజనంచేసిన వెంటనేవెళ్ళిపోయింది శశికాంత. వచ్చి ఒకేరోజైనా ఇద్దరితో బాగా కలసిపోయాడు కృష్ణమూర్తి. నాగేశ్వరరావుగారితో కాసేపు ఆమాటా ఈమాటా మాట్లాడి, ఆయన ఆవులింతలు అదేపనిగా తీస్తుండటంతో ఆయనని నిద్రకి వదిలేసి తనకి కేటాయించిన గదిలోకి వెళ్ళిపోయాడు. మంచంమీద పడుకొని చేయాల్సింది పునరాలోచించుకోవడం ప్రారంభించాడు. ఆలోచిస్తూనే నిద్రలోకి వెళ్ళిపోయాడు.

సాయంత్రం నాగేశ్వరరావుగారు- "బాబూ కృష్ణమూర్తి! లేనాయన, చాలా టైమ్ అయింది" అనడంతో లేచి కూర్చున్నాడు కృష్ణమూర్తి.

"స్నానంచేస్తావేమో చేసిరా... అలాబయటకు వెళదాం" అన్నారాయన.

"మీరు చేసేసారా?"

"నా స్నానం అయిపోయి అప్పుడే అర గంట అయింది. నువ్వు లేస్తావుకదా అని చూసిచూసి విసిగిపోయి లేపాను"

"పడుకుంటే నాకు తొందరగా మెలుకువ రాదండి. మీ స్నానం అయిపోగానే లేపాల్సింది"

"ఇప్పుడైతే మాత్రం ఏమయిందిలే వెళ్ళి స్నానంచేసిరా"

టవల్‌తీసుకొని బాత్‌రూమ్‌కి వెళ్ళాడు కృష్ణమూర్తి. స్నానంచేసి బట్టలు వేసుకొని— "పదండి అంకుల్" అన్నాడు. ఇద్దరూ బయలుదేరారు.

"తొందరగా వచ్చేయండి నాన్నా" అంది శశికాంత.

"అలాగేనమ్మా" అని చల్లగాలికి ముందుకెళ్ళిపోయారు.

అలా ఊరంతా తిరిగి అరగంట తరువాత ఇల్లు చేరుకున్నారు. భోజనాలు చేసి గదులలో గాలివేయటంలేదని బయటకూర్చున్నారు.

"ఏమండీ... ఆయన రాసిచ్చిన కాగితం నాకివ్వండి. నాకేమైనా అర్థమవుతుందేమో చూద్దాం" అన్నాడు కృష్ణమూర్తి.

"ఇప్పుడు ఆ కాగితం ఎందుకులెండి... రేపు పొద్దున్న చూసుకోవచ్చు" అంది శశికాంత.

"ఏమి కాగితమమ్మా?" అడిగారు నాగేశ్వరరావుగారు.

"ఏమీలేదులేగాని, మీరెక్కడిదాకా వెళ్ళారు సాయంత్రం"

"అలా తిమ్మరాజు చెరువుదాక వెళ్ళొచ్చాము"

"అబ్బ... అక్కడదాక వెళ్ళారా?"

"మాట్లాడుకుంటూ వెళ్ళిపోయాం"

కొద్దిసేపు మాట్లాడిన తరువాత నాగేశ్వరరావుగారు నిద్రవస్తోంది అంటూవెళ్ళిపడుకున్నారు.

నాగేశ్వరరావుగారు వెళ్ళిపోయిన కొద్దిసేప టివరకు ఎవరూ మాట్లాడలేదు.

మౌనాన్ని ఛేదిస్తూ రాజుగారు అడిగిందే అడిగాడు. ఏమూడింటిని కదపాలని! కొద్దిసేపు ఆలోచించి-- "తెలియట్లేదు చెప్పేయండి" అంది.

ఒకసారి దీర్ఘంగా నిశ్వాసించి, "ఇంకోసారి ఆలోచించండి రెండులైన్లే ఉంటే ఒకటి కదిపి,

మూడులైన్లు ఉంటె రెండుకదిపి అలాగే నాలుగు లైనులు ఉంటే మూడుకదిపి తిరగేయవచ్చు" అన్నాడు.

ఆమె మనను అతను చెపుతున్నదానిమీద లగ్నం అవటంలేదు. అతడిని చూస్తుంటే ఏవేవో భావాలు, అందమైన ఊహలు. అతడిని చూస్తూ తననితానే మరచిపోతోంది ఆమె. ఆమె కనులు మత్తుగా వాలిపోతున్నాయి ఆమెకి మౌనంగా ఒకరినొకరు చూసుకుంటూ గడపాలనుంది. అతనివైపే ఆరాధనగా చూస్తుండిపోయింది. ఆమె మదినిండా అతని రూపమే. ఆమె మస్తిష్కంనిండా అతని ఆలోచనలే.

ఎంతసేపైనా మౌనంగా ఉండిపోవడంతో— "ఏంటండీ తెలియటలేదా" అని అడిగాడు కృష్ణమూర్తి.





"తెలియలేదండి"

అయితే చెపుతాను చూడండి అని కదపాల్సిన మూడిటిని చూపించాడు ఎలాకదపాలో. పైన ఒకటి, రెండోవవరసలో రెండు, మూడోవరుసలో మూడు, నాలుగోవరుసలో నాలుగు ఉంటే అది పిరమిడ్ అయింది.

ఇపుడు నాలుగోలైన్లో ఆచివరి కాయిన్, ఈచివరి కాయిన్ రెండోలైనులోకి, పైనున్నకాయిన్ క్రిందకి తీసుకొస్తే అది తిరగబడుతుంది."

శశికాంత ఏమాత్రం ఆసక్తి చూపించలేదు. "అలాగా" అని ఊరుకొంది.

కాగితం తీసుకురమ్మని అడుగుదామనుకొన్నాడు గానీ బాగుంటుందో, బాగోదో అని ఆలోచిస్తుండగా --

"మీరెవరినైనా ప్రేమించారా?" అని అడిగింది శశికాంత.

ఉరమని పిడుగులా అతనిమీద పడిన ఆ ప్రశ్నని వినగానే అతని మనసు ఏదో అపశకునాన్ని శంకించింది. ఆమె కళ్ళల్లోకి లోతుగా చూసాడు. కనుగుడ్లు తప్పించి ఇంకేమీ కనబడలేదు. ఏంచెప్పాలో తెలియక-- "ఎందుకలా అడుగుతున్నారు" అని అడిగాడు. అలా అంటూనే ఆలోచించడం మొదలుపెట్టాడు. కొంపదీసి ఈమెగాని తనను ప్రేమించట్లేదు కదా. అమ్మో ప్రేమించిందంటే ఇంకేమైనా ఉందా చచ్చాడన్నమాటే.

"ఏంలేదు... ఊరికే అడుగుతున్నాను"

"ఇంతవరకు లేదండి. ఇకముందుకూడా ప్రేమించనండీ"

"ఇకముందు ప్రేమించనని ఇప్పుడే ఎలా చెపుతున్నారు"

"నేను ప్రేమ ఫ్లేమ్‌లాంటిదని నమ్ముతున్నాను కాబట్టి"

"అంటే?"

"ప్రేమకి, ఫ్లేమ్‌కి అవినాభావ సంబంధం ఉంది"

"ఏమిటాసంబంధం?"

"ప్రేమ ఎలా మొదలవుతుందో, ఎలా అంతమవుతుందో చెపుతుంది ఫ్లేమ్"




"ఎలా మొదలవుతుంది, ఎలా అంతమవుతుంది"

"ఫ్లేమ్‌లో మొదటి అక్షరం యఫ్. అంటే ప్రేమ ఫ్రెండ్‌షిప్‌తో ప్రారంభమవుతుంది. ఫ్రెండ్‌షిప్ కాస్త రెండో అక్షరం యల్ దగ్గరకొచ్చేసరికి లవ్‌గా మారిపోతుంది. లవ్, ఏ దగ్గరకొచ్చేసరికి "ఎలియన్స్" అంటే శారీరక సంబంధం దగ్గరకి, అక్కడినుంచి యమ్ దగ్గరకి అంటే మారేజి దగ్గరకి వచ్చి అక్కడినుంచి ఎనిమిగా మారడంతో అంతమైపోతుంది" అన్నాడు కృష్ణమూర్తి.

"అంతా ట్రాష్. ప్రేమకి, ఫ్లేమ్‌కి అసలే సంబంధంలేదు"

"అది మీ అభిప్రాయం అవ్వచ్చు. ఒక్కొక్కరికి ఒక్కొక్క అభిప్రాయం ఉంటుంది. మీ అభిప్రాయాన్ని నేను ఖండించను. నా అభిప్రాయాన్ని మీరు మార్చడానికి ప్రయత్నించొద్దు" అని ఒక ఆవులింతను రప్పించుకొని- "నిద్దర వస్తోంది- వెళ్ళి పడుకుంటాను" అని లోపలికి వెళ్ళిపోయాడు కృష్ణమూర్తి. అతని వెనకాలే లోపలికి వచ్చేసింది శశికాంత కూడా.

"మీ అభిప్రాయాన్ని మార్చుకునేలా చేస్తాను చూస్తుండండి" అనుకుంది శశికాంత. వెళ్ళి మంచంమీద అయితే పడుకుంది కాని నిద్ర ఎంతకిరాలేదు. అనేకానేక ఊహలలో విహరించి, అలసిపోయి నిదురపోయింది.

★ ★ ★

శశికాంత ఆశ్రమానికి వెళ్ళడానికి ఇంకా ఒకగంట ఉంది అనగానే ఆమె దగ్గరకి వెళ్ళాడు కృష్ణమూర్తి. డైరెక్టుగా కాగితం అడిగితే బాగోదని- "ఆశ్రమం దగ్గరకి నేను రావచ్చా" అన్నాడు.

"రావచ్చు... మొదటిరోజు వచ్చారుగా"

"దర్శనం చేసుకోడానికి రావచ్చా అని అడుగుతున్నాను"

"రావచ్చు" అని మళ్ళీ "ఈరోజు లోపలికి వెళ్ళడానికి నేను పర్మిషన్ తీసుకొని వస్తాను. రేపు వెళుదురుగాని అప్పుడైతే ఇహ డబ్బులేం ఇవ్వక్కరలేదు" అంది.

"అవును... నిన్న బాబుగారు మీకేదో కాగితం ఇచ్చారని అన్నారు. ఏది నాకోసారి చూపించండి. నాకేమైనా అర్థమవుతుందేమో

చూద్దాం" అన్నాడు.

శశికాంత బీరువాలో దాచిన కాగితాన్ని బయటికితీసి కృష్ణమూర్తి దగ్గరకి తీసుకొనివచ్చి ఇచ్చింది. కాగితంమీదున్నది చదివి తల గోక్కున్నాడు. ఏమీ అర్థం కాలేదు. దానిమీద రోమన్ అంకెలు, మామూలు అంకెలు కలగలిపి వేసివున్నాయి.

అర్థం కావడానికి దానిమీద ఏమైనా రాసివుంటేగా... అన్నీ అంకెలే. పోనీ డీకోడ్ చేయడానికి క్లూలు కూడా లేవు. ఆలోచిస్తూ కాగితాన్ని అటూ, ఇటూ తిప్పుతుండగా ఆ కాగితం చివర కొసలు రెండూ అంటించి ఉండడం గ్రహించాడు. రెండు కొసలని వేరు చేశాడు. లోపల తెలుగులో రాసివుంది.

"నేను పైన రాసింది కింది అడ్రస్సుకి పంపగలరని ఆశిస్తున్నాను. పంపితే మీకెంతో ఋణపడి ఉంటాను" అని రాసిఉంది. దాని కింద అడ్రస్సుకూడా ఉంది. అడ్రస్సు చదివి అది రాజుగారి అడ్రస్సని గ్రహించాడు.

రవికి, తండ్రికి లెటర్ రాసుకునే యోగ్యత కూడా లేదా అనుకున్నాడు.

"ఏం రాసివుంది" అడిగింది శశికాంత.

కాగితం ఆమెకిచ్చాడు. ఆమె చదివి- "అయ్యయ్యో... దీన్ని చాలాసార్లు చూసాను కాని లోపల ఏమైనా ఉండిఉంటుందని ఒకసారి కూడా అనిపించలేదే" అనుకుంది.

"ఈరోజే పోస్ట్‌చేస్తాను" అంది శశికాంత.

చిన్నగా నవ్వి- "చెయ్యండి" అన్నాడు. రాజుగారు ఆ ఊరువదిలేసి అప్పుడే నాలుగు నెలలవుతోంది. అదీ ఆయనని చేరదు. వృధా ప్రయాస అంతే అనుకున్నాడు కృష్ణమూర్తి.

కవరు తీసుకొని మేటరు అందులో రాసి అంటించింది. "మీరు ఖాళీగానే ఉంటారుగా పోస్ట్ చేసెయ్యండి" అని కృష్ణమూర్తికిచ్చింది కవరుని.

"మీరు రేపైతే దర్శనం చేసుకోవచ్చు అన్నారుగా. పర్మిషన్ తీసుకొస్తారా?"

"రేపు ఎక్కువ రష్‌గా ఉంటుంది కుదరదు. ఎల్లుండికి పర్మిషన్ తీసుకోనా?"

ఎల్లుండికి నరేంద్రవాళ్ళు వచ్చేస్తారుగా అనుకొని "ఆవలెల్లుండికి పర్మిషన్ తీసుకోండి" అన్నాడు.

"అలాగే... నాకు టైంఅయిపోయింది. నేను వెళతాను" అని వెళ్ళిపోయింది శశికాంత.

శశికాంత వెళ్ళిపోయిన తరువాత పోస్టాఫీసుకి వెళ్ళి ట్రంక్‌కాల్ బుక్‌చేశాడు నరేంద్ర కోసం.

"హలో" అన్నాడు నరేంద్ర స్వయంగా.

"నువ్వేనా... నేను కృష్ణమూర్తిని మాట్లాడుతున్నాను. మీరెప్పుడు బయలుదేరుతున్నారు?"

"ఎల్లుండి వద్దామా వద్దా అని ఆలోచిస్తున్నాం"

"వచ్చేయండి. నాకు చిన్న ఇన్‌ఫర్‌మేషన్ అందింది. రాజుగారు ఉంటేగానీ అదేమిటో తెలియదు"

"ఆ అమ్మాయి సరిగా మాట్లాడిందా? లేక నీకెందుకు. నీకనవసరం అందా?"

"ఆ అమ్మాయివైపునుంచి నరుక్కురావడం కష్టం అని, వాళ్ళ నాన్నగారి విషయాలు కొన్ని సేకరించి అటువైపునుంచి నరుక్కొచ్చాను. ఇప్పుడు మనం వాళ్ళింట్లోనే ఫ్రీగా మెక్కేసి పడకేస్తున్నాం"

"ఏంటీ... నిజమే" ఆశ్చర్యంగా అడిగాడు నరేంద్ర. "మాసిరమ్మంటే కాల్చివచ్చే రకంలా ఉన్నావే"

"ఈరోజుకాని, రేపుకాని శశికాంతతో మన విషయం చెప్పేసి ఆమె హెల్ప్ తీసుకుంటాను"

"అబ్బ... అంతదూరం వచ్చావా?"

"ఇక్కడకొచ్చి చూసావంటే ఢమ్‌మని పడిపోతావ్"

"ఎందుకు పడిపోవడం?"

"మూర్ఛ వస్తుంది కాబట్టి"

"అబ్బ... అంతదూరం వెళ్ళావా"

"ఇక్కడికి వస్తావుగా... చూద్దువుగానిలే! ఎల్లుండి వచ్చెయ్యండి. ఇలా మాట్లాడుతుంటే ఎంతకీ తెగదు"

"ఏంతెగదు?"

"టెలిఫోన్ తీగ" అన్నాడు కృష్ణమూర్తి.

"ఎల్లుండి మధ్యాహ్నం వస్తాం" అని ఫోన్ పెట్టేశాడు నరేంద్ర.

తను ఫోన్‌పెట్టేసి, డబ్బు చెల్లించేసి ఇంటికి చేరుకున్నాడు కృష్ణమూర్తి. సాయంత్రం వరకు ఎలాగో గడిపేసి, సాయంత్రం స్నానంచేసి నాగేశ్వరరావుగారితో బయటికి అలా తిరిగి వచ్చేసాడు. భోజనాలు చేసేసి బయట కూర్చున్నారు ముగ్గురు. కొద్దిసేపుండి లోపలికి వెళ్ళిపోయారు నాగేశ్వరరావుగారు.

"లెటర్‌పోస్ట్ చేసారా?" అడిగింది శశికాంత.

వేయడానికి, వేయకపోవడానికి మధ్యస్థంగా ఊపాడు తల.

"మీతో ఒక విషయం చెప్పాలి" అంది శశికాంత.

"నేను మీతో ఒక విషయం చెప్పాలి" అన్నాడు కృష్ణమూర్తి.

"ఏమిటి?"

"నేను చెప్పింది విని నన్ను కోప్పడకూడదు. అంతేకాదు. నాకు మీరు హెల్ప్‌కూడా చేయాలి"

"మిమ్మల్ని కోప్పడటమా అది జరగని పనిలెండి. ఇకపోతే నా హెల్ప్ మీకెప్పుడూ ఉంటుంది"

"మాట తప్పరుగా"

"తప్పేదానిలా కనపడుతున్నానా?"

"కనబడటంలేదుకాని, నేను చెప్పింది విన్నతరువాత మారిపోతారేమోనని"

"మారనులెండి... చెప్పండి"

"ఇప్పుడుకాదులెండి... రేపు చెబుతాను"

"ఎప్పుడైనా చెప్పాల్సిందే కదా. ఇప్పుడే చెప్పండి"

"మీరేదో చెవుతానన్నారు"

సిగ్గుతెరలు ఆమెని ముంచెత్తాయి. తను అడుగుదామనుకొన్న విషయం జ్ఞాపకం రాగానే కనురెప్పలు బరువుగా కిందికి వాలిపోయాయి.

"మీరే చెప్పండి ముందు" అంది.

చెవుదామా వద్దా అని కొద్దిసేపు ఆలోచించి చివరికి చెప్పడానికే నిర్ణయించుకున్నాడు.

దేవి విషయం చెప్పకుండా రాజుగారు ఆశ్రమానికి రావడం, ఆయన చెప్పినది అంతా చెప్పేసాడు. చివరన "శశికాంతగారూ రాజుగారి కోరిక తీరాలంటే మీరే ఏదైనా మార్గం చూడాలి" అన్నాడు.

"నేను ఇంకా మీరేదో చెప్తారనుకున్నాను. ఆయనిక్కడికి ఎప్పుడొస్తారు?"

"ఎల్లుండి వస్తారు. మీరేదో చెవుదామనుకున్నారనుకుంటా."

"ఇప్పుడు కాదులెండి. ఈ పని పూర్తి అయిపోయిన తరువాత చెవుతాను"

"అంకుల్‌కి ఈ విషయం చెవుతారా?"

ఇప్పుడే చెప్పడం అనవసరం. తరువాత ఎలాగూ చెప్పక తప్పదు" అంది.

చెప్పక తప్పని పరిస్థితులు ఏమున్నాయబ్బా, అనుకున్నాడు అదే అడిగాడు ఆమెని.

"తరువాత మాత్రం చెప్పాల్సిన అవసరం ఏముంది"

"ఉందిలెండి... అదేంటో తరువాత తెలుస్తుంది"

"ఎల్లుండి ఎలాగు వస్తున్నారుకదా అని లెటర్ పోస్ట్ చేయలేదు"

"ఎప్పుడు వాళ్ళ గురించేనా? మీ విషయాలు చెప్పండి"

"నా విషయాలు ఏముంటాయండీ. నాకోసం మా ఇంటిలో చూస్తూ వుంటారు. మా ఇంట్లో కనిష్టుడిని నేనే. మా అక్కకి, అన్నయ్యకి పెళ్లిళ్లయి పోయాయి. నాకు సంబంధాలు చూస్తున్నారు" అన్నాడు.

"ఎవరైనా నచ్చారా మీకు?" అడిగింది మామూలుగానే.

"ఒకమ్మాయి నచ్చిందండి. ఇంట్లో ఇంకా చెప్పలేదు అన్నాడు" దేవిని దృష్టిలో పెట్టుకొని. ఇంటిలో ఒప్పుకున్న ఆ విషయం చెప్పకుండా దాచాడు.

"ఎవరా అమ్మాయి"

"ఉందిలెండి ఒక అమ్మాయి"

"అందంగా వుంటుందా"

"ఏమందంలెండి ఏదో పల్లెటూరిదైవు" ఊ

'విపుల' 'చతుర'లకంటే ఎక్కువగా అమ్ముడయ్యే ఇతర తెలుగు, మాస పత్రికల పేర్లు.....

ఇట్లు

'విపుల' 'చతుర'లకంటే ఎక్కువ రంగుల పేజీలు గల ఇతర తెలుగు మాసపత్రికల పేర్లు......

ఇట్లు



"అన్నట్టుంది"

"అంటే నాలా వుంటుందన్నమాట"

"ఛఛ... మీకు దానికి పోలికెక్కడండి. మీరు అప్సరసలావుంటారు"

"ఇంతకీ ఆ అమ్మాయి ఎవరో చెప్ప నంటారా"

"ఈపని అయిపోనివ్వండి. చెప్పడమేమిటి ఆమెనే చూపిస్తాను" అన్నాడు.

తనని శశికాంత ప్రేమించకుండా ఉండటానికే తను ఒకరిని ఇష్టపడుతున్నానని చెప్పాడు. కాని శశికాంత ఆ అమ్మాయి తనే అనుకుంటుందని ఊహించలేకపోయాడు.

అయినా తనకి ఆమెతో పరిచయమై మూడురోజులైనా కాలేదు. అప్పుడే ఆమె తనని ప్రేమిస్తుందనుకోవడమేమిటి? అంతా తన భ్రమ అనుకున్నాడు. తను దేవిని చూసిన మరుక్షణమే ప్రేమించడం ప్రారంభించానని మరిచిపోయాడు.

ఇద్దరూ ఎవరి ఆలోచనలతో వాళ్లు తమ గదులలోకి వెళ్ళి పడుకున్నారు. మర్నాడు రొటీన్‌గా గడిచిపోయింది.

ఆ తరువాత రోజు ప్రొద్దున్న– "రేపు నాకు బాబుగారిని దర్శించుకోడానికి పర్మిషన్ తీసుకున్నారా?" అనడిగాడు.

"తీసుకున్నాను. నిన్న సాయంత్రం ఆ విషయమై కేశవరావుగారిదగ్గరకి వెళ్లాను"

"ఆయన కమిటీ మెంబరా?" రాజుగారికి కమిటీ అంటూ రాసిన ఉత్తరం గుర్తుతెచ్చుకొని అడిగాడు.

"కమిటీ అంటే ఎంతోమంది ఉన్నారనుకుంటున్నారా. ఆయనొక్కడే కమిటీ. తెలియని వాళ్లు చాలామంది ఉన్నారనుకుంటారు"

"కమిటీ అంటే ఛైర్మన్లు, ప్రెసిడెంట్‌లు ఉండరా"

"ఉంటారు అందరు నామమాత్రమే. మీవాళ్లు ఈరోజు వచ్చేస్తారా?"

"వచ్చేస్తారు"

"నాకు టైమ్‌అయింది నే వెళతాను" అంది.

"మధ్యాహ్నానికి రాజుగారు, నరేంద్ర రాలేదు. శశికాంతవచ్చి మీవాళ్ళింకా రాలేదా?" అని అడిగింది.

"రాలేదు సాయంత్రానికల్లా వచ్చేస్తారు" అన్నాడు.

భోజనంచేసి వెళ్లిపోయింది శశికాంత.

కృష్ణమూర్తి, నాగేశ్వరరావుగారికి బాబు దర్శనానికి మా చుట్టాలొస్తున్నారు అని చెప్పాడు.

"ఎప్పుడొస్తారు?" అడిగారాయన.

"మధ్యాహ్నానికి రావాలి... ఇంతవరకు రాలేదు"

"మన ఇల్లు వాళ్లకి తెలుసా?" అడిగారాయన.

అప్పుడు జ్ఞాపకం వచ్చింది కృష్ణమూర్తికి, తను వాళ్లకి ఇంటి అడ్రసు ఇవ్వలేదని. వెంటనే తను మొదట దిగిన హొటల్‌దగ్గరికి వెళ్లాడు. అక్కడ ఇద్దరిని కలిసి నాగేశ్వరరావు గారింటికి తీసుకొచ్చేశాడు. మార్గంలోనే ఇక్కడికి వచ్చితను చేసిందంతా చెప్పేసాడు.

ఇంటికి వెళ్లగానే ఇద్దరినీ నాగేశ్వరరావుగారికి పరిచయంచేశాడు. కొద్దిసేపువాళ్లతో మాట్లాడి తన కోసం ఎవరో రావడంతో బయటకి వెళ్లిపోయారు నాగేశ్వరరావుగారు.

రవికుమార్ శశికాంత్‌కి రాసి ఇచ్చిన కాగితన్ని రాజుగారికి ఇచ్చాడు కృష్ణమూర్తి.

రాజుగారు ఒక పేపరు తీసుకొని ఆ కోడ్‌లు నోట్‌చేసారు. తండ్రి, కొడుకులు సరదాగా ఉత్తరాలు అదే కోడ్‌లో రాసుకునేవారు.

"నరేంద్రా, నాగలక్ష్మి బతికే ఉందంట. వీడి దగ్గరే ఉందంట" అన్నారాయన. డీ కోడ్ పూర్తిచేసి ఉత్తరం చదివాక.

నరేంద్ర, కృష్ణమూర్తి కూడా చదివారు డీ కోడ్ చేయగా వచ్చినమాటలు.

"రవికుమార్‌ని బయటకి తీసుకురావడానికి ఒక మంచి ప్లాను ఆలోచించండి" అన్నాడు కృష్ణమూర్తి.

"మనకి ఆ బిల్డింగ్ వివరాలు తెలియకుండా ఏ ప్లాను వేయగలం. శశికాంత వచ్చిన తరువాత అన్ని విషయాలు తెలుసుకొని అప్పుడు ప్లాన్ చేద్దాం" అన్నారాయన.

వాళ్లు అలా మాట్లాడుకుంటుండగానే వచ్చే

సింది శశికాంత. పరస్పర పరిచయాలు టిఫిన్లు, కాఫీలు పూర్తయిపోయాయి.

రాజుగారు అన్ని విషయాలు శశికాంతనడిగి తెలుసుకొని, ఒక ప్లాను వేశారు. ఆ ప్లానులోవున్న లోటుపాట్లని అందరు కూర్చొని డిస్కస్‌చేసి దానికొక రూపాన్నిచ్చారు.

భోజనం పూర్తిచేసి హాయిగా ఆరుబయట మంచాలువేసుకొని పడుకున్నారు రాజుగారు, కృష్ణమూర్తి, నరేంద్ర. నాగేశ్వరరావుగారు, శశికాంత లోపల పడుకున్నారు.




మర్నాడు శశికాంత తనతోపాటు కృష్ణమూర్తిని ఆశ్రమానికి తీసుకువెళ్లింది. కృష్ణమూర్తి చేతిలో బ్రీఫ్‌కేస్‌తోసహా బయలుదేరాడు.

ఆశ్రమంనుంచి బయటకి వస్తున్న ఒకవ్యక్తిని చూపించి-- "అదిగో ఆయనే కేశవరావుగారంటే" అంది శశికాంత.

"అయితే ఇంకేం... వెదకబోయిన తీగె కాలికితగిలినట్లే! పరిచయంచేసెయ్యి" అన్నాడు.

వెళ్లిపోతున్న కేశవరావుగారు-- "ఎవరికో పర్మిషన్ అడిగావు. అతనేనా ఇతను" అన్నారు.

"అవునండీ... మాబావ కృష్ణమూర్తి" అని కృష్ణమూర్తివైపు తిరిగి నేను చెప్పానే కేశవరావుగారని ఆయనే అంది.

"నమస్తే సర్" అన్నాడు.

"నమస్తే" అన్నారాయన.

"రేపు ఇంటర్వ్యూకి వెళుతున్నాడండి. బాబుగారిని దర్శించుకుందామని వచ్చాడు" అంది శశికాంత.

"బాబుగారి ఆశీర్వాదం ఉంటే నీకిక తిరుగు ఉండదబ్బాయ్" అని "వెళ్లమ్మా... వచ్చేస్తున్నట్టున్నారు జనాలు" అన్నారాయన.

లోపలికి వెళ్లారు ఇద్దరూ. ఆయన వెళ్లిపోయారు. శశికాంత తన స్థానంలో కూర్చుంది.

"ముందు మీరే వెళతారా దర్శనానికి?" అడిగింది శశికాంత.

"అదే ఆలోచిస్తున్నాను".

"ఒక పనిచేయండి,ఆశ్రమం అంతా ఒకసారి తిరిగిరండి.అలాగే బిల్డింగ్‌ని అన్ని కోణాలలో నుంచి చూడండి. భక్తులకి కట్టించిన కాటేజీలు ఇక్కడికి దూరంగావుంటాయి. వాటిని కూడా చూసి రండి అప్పటికి కొద్దిగా టైమ్ గడుస్తుంది" అంది.

కృష్ణమూర్తి ఆశ్రమం అంతాతిరిగి ఒక అరగంట తరువాత శశికాంత దగ్గరికివచ్చాడు. వచ్చేవాళ్లు ఎక్కువగా ఉండటంతో బిజీగా వుంది శశికాంత. ఆమెకి వీలుచిక్కేంతవరకు అక్కడే నిలబడిపోయాడు.

"వెళ్లండి... ఇక్కడనే నిలబడిపోయారే" అంది.

"మీకు చెప్పి వెళదామని ఉండిపోయాను. వెళుతున్నాను" అని బ్రీఫ్‌కేస్ ఎవరికి కనబడకుండా లోపలకితోసి బాబు దగ్గరికి వెళ్లడానికి ఉద్యుక్తుడయ్యాడు.

లోపలికి బాబు గదిలోకి వెళ్లగానే అక్కడి ప్రశాంతతకి ముగ్ధుడయ్యాడు కృష్ణమూర్తి. రవినిచూడగానే, తనతోటి వ్యక్తిని చూస్తున్నట్టుగా కాక, ఎవరో దైవాంశ సంభూతుణ్ణి చూస్తున్నట్టుగా అనిపించింది. దైవత్వం మూర్తీభవించినట్టున్న ఆయన వదనాన్ని చూస్తుంటే ఎన్నో జన్మల పాపం పటాపంచలు అయిపోయిన భావం. కృష్ణమూర్తి రవి పాదాలమీద సాష్టాంగ పడిపోయాడు.

"లేనాయనా" అని వంగాడు రవి.

"మీరు పంపిన ఉత్తరం అందింది. రాత్రికి వస్తాం మిమ్మల్ని బయటకు తీసుకువెళ్లడానికి" అని పైకిలేచాడు కృష్ణమూర్తి.

రవి ప్రశాంతవదనంలో తేడాలేనేలేదు. కృష్ణమూర్తికి తనేమి చెప్పకుండానే లేచిపోలేదు కదా అని అనుమానం వచ్చింది.

రవి తనచేతిలో నీటిని సృష్టించి– "గంగా జలం స్వీకరించు నాయనా" అన్నాడు.

నీటిని పవిత్ర గంగాజలంగా భావించి, కళ్ళకద్దుకొని నోటిలో పోసుకున్నాడు కృష్ణమూర్తి.

"నువ్వు అనుకున్న పనిలో విజయం సాధిస్తావు వెళ్ళు నాయనా" అన్నాడు రవి.

"వెళ్ళొస్తాను స్వామీ" అని బయటకు వచ్చేసాడు కృష్ణమూర్తి. అక్కడి నుంచి శశికాంత దగ్గరకి వచ్చాడు "బాగా అయిందా దర్శనం" అడిగింది శశికాంత.

"అయింది... నేను వెళ్ళిరానా"

"ఓకే. వెళ్ళిరండి మధ్యాహ్నం కలుద్దాం"

ఇంటికొచ్చేసాడు కృష్ణమూర్తి. రాజుగారు, నరేంద్ర అతని కోసమే ఎదురు చూస్తున్నారు.

"ఏమైంది. అంతా సవ్యంగానే జరిగిందిగా?"

"ఇప్పటివరకు అంతా సవ్యంగానే జరిగింది. ఇకముందు జరగాల్సిందే చూసుకోవాలి" అన్నాడు కృష్ణమూర్తి.

"సాయంత్రం వరకూ మనకేం పనిలేదుగా" అడిగాడు నరేంద్ర.

"రాత్రి వరకూ లేదు" అన్నాడు కృష్ణమూర్తి.

★ ★ ★

రాత్రి పదకొండు అయింది. కృష్ణమూర్తి, శశికాంత బయటికి వచ్చారు. శశికాంత మొహం చిన్నబోయినట్టుగా ఉండటం కృష్ణమూర్తి గ్రహించాడు కాని ఎందుకో అర్థంకాలేదు అతనికి.

ఇద్దరూ కేశవరావుగారింటికి వెళ్ళారు. లోపల ఎవరితోనో మాట్లాడుతున్నారని చెప్పి డ్రాయింగ్‌రూమ్‌లో కూర్చొపెట్టాడు ఒక వ్యక్తి. లోపల జరుగుతున్న సంభాషణ స్పష్టంగా వినబడుతోంది అక్కడికి.

"ఇప్పుడెలాగో చెప్పండి?" అన్న స్త్రీ కంఠం వినబడింది కృష్ణమూర్తికి. ఆ కంఠం చిరపరిచితమైనదేననిపించింది.

"ఇప్పుడెలా అని అడిగితే ఎలా నన్నుకాదని నీకు తోచినట్లుగా నడుపుతానన్నావుగా" కేశవరావుగారి కంఠం.

"తప్పు ఒప్పుకుంటున్నానుగా. రాజుగారు ఫొటోలు తీయకుండా ఉండి ఉంటే ఎవిడెన్స్ ఉండేదికాదు. ఫొటోలు ఇప్పుడు పెద్దప్రాబ్లెం అయికూర్చున్నాయి" అంది స్త్రీ కంఠం.

అప్పుడు అర్థం అయింది కృష్ణమూర్తికి మాట్లాడుతున్నది "దేవి" అని. "ఇక్కడికి ఎందుకు వచ్చిందబ్బా?" అనుకున్నాడు.

"ఆ ఫొటోలు సంపాదించగలవా?" కేశవరావుగారు అడిగారు.

"కష్టం.పోలీసు స్టేషనులో ఉన్నాయి అవి"

"అయితే జైలుశిక్ష తప్పదు. అయినా ఏమైనా మంచిచేసి పేరు సంపాదిస్తే నిలబడుతుంది. కాని జనాన్ని పైకి పంపేయడమే కార్యక్రమంగా పెట్టుకుంటే ఎలా?"

"అప్పుడు తెలియక జరిగిపోయింది. క్షమించి జరగాల్సింది చూడు?"

"ఏదో మామ కూతురువికదా అని మార్గం చెపితే నాతో మాటమాత్రమైనా చెప్పకుండా నీఇష్టం వచ్చినట్టు చేసావుగా. అనుభవమొచ్చాక తప్పదు"

"అంతేనా నువ్వు చేయగల్గింది ఏమి లేదా?"

"అయినా నీకు బెయిల్ ఎలా ఇచ్చారు?"

"అదంతా నీకెందుకుగాని ఈ ఊబిలో నుండి నన్ను బయటకు లాగుతారా లేదా?"

"పీకలదాక కూరుకుపోయి ఇప్పుడు వస్తే ఎలా?"

"కేసుని డీల్ చేస్తున్న జడ్జిగారు బాబుగారి భక్తుడు" అని ఆపేసింది.

అర్థమైంది కేశవరావుగారికి.

"పేరేంటి" అడిగారాయన.

చెప్పింది.

"అయితే చెప్పిస్తాను. కొద్దిగా తగ్గించే ఏర్పాటు చేస్తాను" అన్నారు.

"వెళ్ళొస్తాను" అన్న మాటలు వినబడగానే మొహానికి పేపర్‌ని అడ్డుపెట్టుకున్నాడు కృష్ణమూర్తి. ఆమె బయటకి వెళ్ళిపోయిన తరువాత వీళ్ల దగ్గరకి వచ్చారు ఆయన.

"ఏమిటమ్మా విశేషం. అర్ధరాత్రిపూట ఇలావ

చ్చారు''

''ఈయన తెల్లవారుఝామున మూడింటికి హైదరాబాద్ బస్సు ఎక్కాలి. ఇంటర్వ్యూకెళ్ళాలి కదా'' అంది శశికాంత.

''పొద్దున్న చెప్పావుగా. దర్శనం బాగా అయిందా'' కృష్ణమూర్తి వైపు తిరిగి అడిగారు.

''అయిందండి''

''దర్శనం చేసుకొని బ్రీఫ్‌కేస్ అక్కడ వదిలేసి వచ్చారు. అందులోనే ఒరిజినల్స్ అన్నీ ఉన్నాయి. సినిమాకి వెళ్ళి వచ్చిన తరువాత బట్టలుసర్దుకుందామని బ్రీఫ్‌కేస్ కోసం చూస్తే



లేదు. అప్పుడు ఆయనకి జ్ఞాపకం వచ్చింది. బ్రీఫ్‌కేస్ ఆశ్రమం బిల్డింగ్‌లో మర్చిపోయానని. వెంటనే మీరు నిదురపోయారేమోనని ఆదరాబాదరా పరిగెత్తుకుంటూ వచ్చాం. బిల్డింగ్ తాళాలు ఇప్పిస్తే బ్రీఫ్‌కేసు తీసుకుంటాము'' అంది శశికాంత.

కేశవరావుగారికి పొద్దున కృష్ణమూర్తి బ్రీఫ్‌కేసు పట్టుకొని లోపలికి వెళ్ళడం జ్ఞాపకం వచ్చింది.

''దానిదేముందమ్మా... అలాగే తీసుకువెళ్ళండి. మీతోపాటు మస్తాన్ కూడా వస్తాడు. తీసుకు వెళ్లండి'' అని ''మస్తాన్'' అని పిలిచారు.

బలిష్టంగావున్న మధ్యవయస్కుడు వచ్చి వాళ్ళ ఎదుట నిలబడ్డాడు.

''ఆశ్రమంలో ఈయన బ్రీఫ్‌కేసు మర్చిపోయారంట. వాళ్ళతోపాటు నువ్వుకూడా వెళ్ళి వాళ్లకి బ్రీఫ్‌కేసు దొరికిన తరువాత తాళాలు తీసుకొచ్చెయ్యి'' అని లోపలకి వెళ్ళి తాళాలు తెచ్చి ఇచ్చారు.

''థాంక్యూ సర్. థాంక్యూ వెరీమచ్'' అన్నాడు కృష్ణమూర్తి.

ఆయన నవ్వేసి ఊరుకున్నారు. కృష్ణమూర్తి, శశికాంత తాళాలు తమ చేతికే ఇస్తారనుకున్నారు. వాళ్ళతోపాటు ఇంకొకడిని పంపడంతో ఎలా రవిని బయటకి తీసుకురావాలా అని ఆలోచిస్తున్నారు.

శశికాంత మనసేమీ బావుండలేదు! సాయంత్రం రాజుగారు, నరేంద్ర మాట్లాడుకున్న మాటలు పదేపదే జ్ఞాపకం వస్తున్నాయి ఆమెకి. కృష్ణమూర్తిని ఇంకొకరి పక్కన ఊహించుకుంటుంటేనే ఒంటికి కారం రాసుకున్నట్టు భగ్గుమంటోంది. కృష్ణమూర్తికి, దేవి అనే అమ్మాయితో వివాహం ఫిక్స్ అయిపోయింది అన్న మాటలు ఆమెకి మింగుడుపడటంలేదు. ఆమె మనసు భగభగమండిపోతోంది. ముందు వాళ్ళకసలు హెల్ప్ చేయకూడదు అనుకుంది. మళ్ళీ మనసు మార్చుకుంది.

తాళాలు తీసుకొని వాళ్ళిద్దరే వస్తారని ఆశ్రమం దగ్గర ఎదురు చూస్తున్న రాజు, నరేంద్ర వాళ్ళిద్దరితోపాటు ఇంకెవరో వస్తూ ఉండటంతో చీకట్లోకి తప్పుకున్నారు.

ఆశ్రమం దగ్గరికి రాగానే కృష్ణమూర్తి- ''మీరెళుతూ ఉండండి ఇప్పుడే వచ్చేస్తాను'' అని పక్కకి తిరిగాడు.

అతనివైపు అనుమానంగా చూస్తున్న మస్తాన్‌కి చిటికెన వేలు చూపించాడు. మస్తాన్ ఆశ్రమం లోపలికి శశికాంతతో వెళ్ళిపోయాడు.

నరేంద్రని, రాజుగారిని కలుసుకొని- ''మీరు మా వెనకాలే వచ్చేయండి. నేను వాడిని అలా వెనక్కి తీసుకువెళతాను. మీరు ఈలోపుగా పని కానిచ్చేయండి'' అని పరిగెత్తుకొని వెళ్ళి మస్తాన్ని, శశికాంతని చేరుకున్నాడు. మస్తాన్ దగ్గర తాళాలు తీసుకొని తాళం తీసి తాళాలతోసహా కప్పని శశికాంత కూర్చొనే కుర్చీముందు టేబుల్‌మీద పెట్టాడు. రాజు, నరేంద్రలు తలుపుల దగ్గరికి అలైడి వచ్చేసి ఉండటం కనిపెట్టి, అక్కడ కొద్దిసేపు వెతుకుతున్నట్టు నటించి- ''ఇక్కడ కాదు బిల్డింగ్ వెనక్కి వెళ్ళానుకదా ఈ పక్కనుంచి మధ్యలో ఏమైనా పెట్టానేమో చూద్దాంపదండి'' అన్నాడు కృష్ణమూర్తి. మస్తాన్, శశికాంతలని ఉద్దేశించి.

మస్తాన్ కదలకపోవడంతో ''రా మస్తాన్... మీరు అటువైపు వెతికితే నేనిటువైపు వెతుకుతాను తొందరగా అయిపోతుంది'' అన్నాడు. తప్పదన్నట్టు కదిలాడు మస్తాన్. వాళ్ళ వెనుక శశికాంత.

మస్తాన్ అలా వెళ్ళిన మరుక్షణం లోపలకి అడుగుపెట్టారు నరేంద్ర, రాజుగారూ! తాళాలు తీసుకొని దానిని ఉంచిన గదివైపు పరుగు తీశారు. చకచక తాళాలు తీసారు. లోపల లైటు వేసేవుంది. ''మీ కోసమే చూస్తున్నాను. తలుపు గెడ చప్పుడు అవగానే రెడీ అయిపోయాను'' అంటూ బయటికి వచ్చేశాడు రవి. తాళాలు మళ్ళీ వేసేసి అదేవేగంతో పరిగెత్తుకొచ్చి తాళాలు యథాస్థానంలో పెట్టి బయటికి పారిపోయారు, ముగ్గురూ.

వాళ్ళు బయటికి వెళ్ళిపోయిన రెండుని ముషాలకి ఇంకో వైపునుంచి టేబిల్ దగ్గరకి వచ్చారు వీళ్ళు. ''ఎక్కడ వదిలేసానబ్బా'' అని తనలో తాను అనుకున్నాడు కృష్ణమూర్తి. టేబుల్ కిందకు యథాలాపంగా చూసి ''ఇది

గో ఇక్కడుంది'' అని బయటికి లాగాడు. మస్తాన్ తాళాలు తీసుకొని ''పదండి ఇంక వెళదాం'' అన్నాడు.

ముగ్గురూ బయటికి వచ్చారు. తాళాలు మళ్ళీ వచ్చేసరికి అక్కడుండటంతో రవిని తీసుకొని వెళ్ళిపోయుంటారు అనుకున్నాడు.

ముగ్గురూ ఆశ్రమం దాటి వచ్చేసారు. ''వస్తాం మస్తాన్‌గారూ'' అని విడిపోయారు కృష్ణమూర్తి, శశికాంతలు.

''మీకు మారేజి ఫిక్స్ అయిపోయిందటగా'' అడిగింది శశికాంత.

''ఎవరన్నారు'' ఆశ్చర్యంగా అడిగాడు.

''నేనడిగిన ప్రశ్నకి జవాబు చెప్పండి''

''అయినట్టే... మొన్న మీకు చెప్పానుగా నాకు నచ్చిన అమ్మాయి ఉంది. ఇంటిలో చెప్పాలి ఆ విషయం అని'' అన్నాడు.

''ఆ అమ్మాయిని నేననుకున్నాను. ఆకాశంలో హర్మ్యాలు కట్టాను. అన్నీ కూలిపోయాయి. ప్రేమించినవాడు అప్పటికే ఇంకొకళ్ళ సొత్తు అయిపోయాడు'' అనుకుంది మనసులో శశికాంత.

''ఏమిటి కామ్‌గా ఉండిపోయారు''

''ఏమి మాట్లాడాలో తెలియక''

''ఈ పని పూర్తిచేసిన తరువాత నాకేదో విషయం చెపుతానన్నారు?''

కొన్నిక్షణాల మౌనం తరువాత, ''కొన్ని విషయాలు చెప్పడంకంటే మనసులో దాచుకుంటేనే బాగుంటుంది'' అంది శశికాంత.

కృష్ణమూర్తికి ఏమనాలో తెలియలేదు.

కొద్దిసేపటి తరువాత శశికాంతే, ''ఇక్కడి నుంచి వెళ్ళిన తరువాత నన్ను మరచిపోతారా?'' అని అడిగింది.

''ఛ ఛ ... మిమ్మల్ని ఎలామరచిపోతాను! ప్రత్యుపకారం ఆశించకుండా నాకెంతో వుపకారం చేశారు. ఒక మంచి స్నేహితురాలిగా నా మనసులో ఎప్పుడూ వుండిపోతారు'' అన్నాడు.

'ప్రత్యుపకారం ఆశించాను కృష్ణమూర్తిగారూ! కాని ప్రత్యుపకారం పొందడానికి నేనర్హురాలినికాను' అనుకుంది మనసులో

''నేను మిమ్మల్ని మరచిపోతానేమోనని అనుమానం వ్యక్తంచేశారు. మీరుకాని నన్ను మరచిపోరుగా?''

ఆ మాటలు శూలపు పోటుల్లా ఆమె మనసులో గుచ్చుకున్నాయి. 'ఎంతమాట అన్నారు. నేను మిమ్మల్ని మరచిపోవడమా ... అది ఈ జీవితకాలానికి జరగదు. వచ్చే జన్మలోనైనా మిమ్మల్ని మరచిపోవడానికి ప్రయత్నించాల్సిన అవసరం కల్పించవద్దని దేవుణ్ని ప్రార్థిస్తాను' అనుకుంది మనసులో. పైకిమాత్రం, ఈ ''జన్మలో మిమ్మల్ని మరచిపోవడం కష్టం. మిమ్మల్ని మరచిపోదామన్నా మీరిచ్చిన పజిల్స్ మిమ్మల్ని జ్ఞాపకం చేస్తాయి''అంది.

మళ్ళీ మౌనం.

''మీ చేయి ఇటివ్వండి'' అంది శశికాంత.

''పామిస్ట్రీయా?'' అంటూ, అందించాడు.

సునుమెత్తని ఆమె చేతిస్పర్శ కృష్ణమూర్తిని మత్తులోకి దింపేసింది. అతను బలహీనమవకూడదు అనుకుంటున్నాడే కాని అవకుండా వుండలేకపోతున్నాడు.

ముందుమెల్లగా, తరువాత గట్టిగా నొక్కింది అతని చేతిని. అతని చేతిని వదలకుండా ''అలా కొద్దిసేపు కూర్చుందామా'' అడిగింది పచ్చిక బయలుకేసి చూపించి.

''మీ ఇష్టం'' అన్నాడు. ''వెళ్ళిపోదాం'' అని నాలుక చివరివరకు వచ్చి, చివరిక్షణంలో మీ ఇష్టంగా మారిపోయింది.

అతని చేతిని అలా పట్టుకునే ఆ పచ్చిక మీద కూర్చుంది. ఆమెకి అతని ఒడిలో తలపెట్టుకుని పడుకోవాలనివుంది. కాని ఏదో అదృశ్యశక్తి ఆమెని ఆపేస్తోంది.

అతని చేతినిపైకి లేపి ''ముద్దు పెట్టుకోవచ్చా?'' అని అడిగింది.

కృష్ణమూర్తికి అంతా అర్థమైపోయింది, ''నన్ను క్షమించండి శశికాంతగారు! మీలో లేనిపోని ఊహలు కల్పించినట్టున్నాను'' మనస్ఫూర్తిగా అన్నాడు.

''అందులో మీ తప్పేంవుంది'' అని అతని చేతిని పెదవులకి ఆనించుకుంది. మధురమైన పెదవుల స్పర్శ అతని మనసుని మూ

గగా మార్చాయి. ముందు నెమ్మదిగా మెత్తగా ఆనించుకున్న చేతిని తరువాత గాఢంగా చుంబించింది. ఇక వదిలిపెడితే ఆ చేయి మరికదొరకదన్నట్టు గాఢంగా ... మరింత గాఢంగా పెదవులకి ఆనించుకుంది. కృష్ణమూర్తి తనకితాను కంట్రోల్ చేసుకోలేక ఆమెని తన హృదయానికి గాఢంగా హత్తుకున్నాడు. అతని పరిష్వంగంలో ఆమెకి ఎంతో హాయిగావుంది. మనసు దూదిపింజలా ఆకాశంలో ఎగురుతోంది. ఆమె కళ్ళు మత్తుగా మూసుకున్నాయి. పెదవులు వణుకుతున్నాయి.

అతని పెదవులు దేనికోసమో కిందికి దిగాయి. వణుకుతున్న ఆమె పెదవుల దగ్గర ఆగిపోయాయి. నాలుగు పెదవులు మృదువుగా స్పృశించుకున్నాయి. అతని పెదవులు ఆమె పెదవులని గాఢంగా నొక్కిపెట్టాయి. ఇద్దరూ తమ శరీరాలు ఒకటైపోవాలని అన్నంత గాఢంగా ఒకరినొకరు హత్తుకుపోయారు. ఆమె పందిరికి అల్లుకునే తీగెలా అతన్ని అల్లుకుపోయింది. అతను ఆమె శరీరాన్ని తన బాహువులలో ఇముడ్చుకున్నాడు. అతని పెదవులు అలాపైకి ఆమె బుగ్గలపై నుంచి మూసివున్న ఆమె కనురెప్పలపైకి చేరుకున్నాయి. అక్కడినుంచి నుదురుమీదకి వెళ్ళాయి. ఆమె మొహం అంతా ముద్దులతో నింపేశాడు.

ఇద్దరిలోను మైకం మూడు నిముషాల తరువాత దిగింది. అతను జరిగింది తలచుకొని సిగ్గుతో తలవంచుకున్నాడు. ఒకపక్క మేరేజి ఫిక్స్ అయిందని చెప్పి, మరోపక్క ఆమెతో...

"నేను మిమ్మల్ని ప్రేమించాను"

"తెలుసు"

"నాకు చాలా బాధగావుంది. పవిత్రమైన గంగానదిని అపవిత్రం చేశానని పిస్తోంది"

"నన్నేమీ చేయకుండానే"

"ముద్దు పెట్టుకున్నానుగా"

"దేవిని మీరింతవరకు ముద్దుపెట్టుకోలేదా?"

"లేదు"

"థాంక్‌గాడ్ ... మీ జీవితంలోకి ప్రవేశించిన మొదటి స్త్రీని నేనే. ముద్దు పెట్టుకున్నంత మాత్రాన అపవిత్రం అయిపోరు"

అతను ఆమె భుజంచుట్టూ తన చేతిని వేశాడు. ఆమె అతని ఛాతీపై తలపెట్టి, అతని అడుగులో అడుగువేస్తూ నడుస్తోంది.

ఇల్లు దగ్గర అవడంతో దూరంగా జరిగారు.

★ ★ ★

"దేవుడు అన్నపదం మనం సృష్టించుకున్నదే. రాముడు, కృష్ణుడు, శివుడు మొదలైన వారు ఒకప్పుడు ఈ భూమిమీద జీవించి ఉండవచ్చు. వాళ్ళు మానవులు మాత్రమే. ఒకమనిషి చనిపోయినా అతనికి మనలో ఎంతవిలువ ఉంటుందో వీళ్ళకీ అంతే విలువ ఉండాలి. కాని మనం వీళ్ళని దేవుళ్ళు అని పూజిస్తున్నాం."

"మనం మనకితెలియని, ఎప్పుడూ చూడని వారెవరినో దేవుడు అని భావించి వాళ్ళని ఎందుకు పూజిస్తున్నాం? వాళ్ళకి ఏవో శక్తులున్నాయని, వాళ్ళని పూజిస్తే మనకి ఏదో మంచి జరుగుతుందనీ, మనకున్న కష్టాలు పోతాయనీ మనం అనుకోవడంవల్లనే.

నేరాలు, పాపాలు పెరిగిపోతున్న సమయంలో, బలవంతులు బలహీనులని బాధిస్తున్న తరుణంలో బలహీనుడైన తెలివైన మానవుడు మనుషులలో పాపభీతి కలిగించడంకోసం, పెచ్చుపెరిగి పోయిన నేరాలను అరికట్టడంకోసం, తన ఆత్మరక్షణకోసం "దేవుడు" అనేపదాన్ని సృష్టించాడు. ఆ దేవుడిగా ప్రజలలో అప్పటికే గొప్పవాడిగా పేరుపొందిన వ్యక్తిని, రాముడవ్వచ్చు, కృష్ణుడవ్వచ్చు ఎవరో ఒకరిని చూపించాడు. అప్పటికే ఏవో కొన్ని గొప్పకార్యాలు చేసి ఉన్న ఆ దేవుడు ఇంకా ఎన్నో గొప్ప కార్యాలు చేసినట్టుగా ఇతిహాసాలు రాసాడు. ఆ తెలివైన వాళ్ళని ప్రజలు గొప్పవానిగా భావించారు. ఎన్నో సుఖాలను అనుభవిస్తున్నవాణ్ణిచూసి, ఇంకొందరు, ఇంకొంతమంది దేవుళ్ళని సృష్టించారు. ముందు ఉన్న దేవునికి, ఈయనకి ఏదో సంబంధం ఉందని వాళ్ళు కొన్నికొత్తకథలు పుట్టించారు. ప్రజలని బాగా నమ్మించడంకోసం కొన్ని అద్భుత ప్రక్రియలు ఆ దేవుని భక్తులమైన మాకు నేర్పాడని చెప్పి వాళ్ళముందు ప్రదర్శించారు. ప్రజలు




పమ్మారు.

అలా అలాకొన్ని తరాలు గడిచేసరికి, ఆ దేవుళ్ళందరూ పురాణ పురుషులయిపోయా రు. తరాలు గడుస్తున్నకొద్దీ వాళ్ళ ప్రాచుర్యం పెరిగిపోయింది.

కొన్ని సంవత్సరాల క్రితం మనముందు తరంవాళ్ళతో జీవించిన వ్యక్తిని, కొన్ని అద్భుత ప్రక్రియలుచేసి, ఆశ్చర్యం కలిగించే విషయా లు చెప్పడం వలన మనం ఇప్పుడు తనని దేవునిగా పూజిస్తున్నాము. ఆ వ్యక్తి హస్తస్పర్శతో రోగాలు నయంచేసి ఉండవచ్చు! వనమూలిక లతో దీర్ఘకాలం జీవించి ఉండివుండవచ్చు. అంత మాత్రాన అతను దేవుడైపోడు.

మానవుడు చనిపోయిన తరువాత అతని కి ఈ ప్రపంచంతో సంబంధం ఉండదని మనకితెలుసు. అయినప్పటికీ మనం అతనికి గొప్పతనాన్ని ఆపాదించి పూజిస్తున్నాం. కొంద రు స్వార్థపరులు మనం దేవుడు అని పూజిస్తు న్న ఆ వ్యక్తిని అడ్డుపెట్టుకొని డబ్బు సంపా దించుకుంటున్నారు. ఎవడు ఏవింతపని చే సినా అది దేవుని ఆశీర్వాదాలు అతనికి ఉండడంవల్లే చేయగల్గాడని మనం భావించి నంతకాలం ఈ దేవుళ్ళ సంఖ్య పెరిగిపోతూనే ఉంటుంది.

దైవ ప్రతినిధులమంటూ మనదగ్గర డబ్బు గుంజేవీళ్ళ అసలు స్వరూపాలు తెలు సుకోండి. దేవుణ్ణి పూజించడంవల్ల మనకి కే వలం సమయం మాత్రమే ఖర్చవుతుంది. దేవునిపేరు చెప్పుకొనే ఈ దైవప్రతినిధులవల్ల అటుసమయం, ఇటు డబ్బు రెండూ వృ థాయే.

"వీళ్ళు దైవప్రతి నిధులు కారు డబ్బుని ధులు. మిమ్మల్ని కొల్లగొట్టే పిశాచులు. తెలిసి మసలుకోండి. మీ ముందు అన్యాయంగా, అక్రమంగా మీ డబ్బుతోకోట్లు గడిస్తున్నవాళ్ళ పనిపట్టండి" అని ఆగాడు ఆవేశంగా మాట్లా డుతున్న రవిబాబు

"మా అత్తయ్య ఒక బాబావల్లనే చనిపో యింది. అప్పటినుంచి మా నాన్నగారికి బాబా లన్నా దేవునిపేరు చెప్పుకొనే వాళ్లన్నా ము ఖ్యంగా అడవాళ్ళని మోసంచేసి బతికే వాళ్ళ న్నా కోపం"

"మీ అత్తయ్య ఎలా చనిపోయింది?"

ఒకసారి దీర్ఘంగా నిశ్వాసించాడు రవి. "మా అత్తయ్యకి అసలు పిల్లలు పుట్టలేదు. మా నాన్నగారి కంటేముందే పెళ్ళయిపోయింది. ఆరు సంవత్సరాలైనా పిల్లలు పుట్టకపోవ డంతో అత్తగారింట్లో గొడ్రాలుగా పేరుపడిపో యింది. మా నాన్నగారు అత్తయ్యని డాక్టరు దగ్గిరకి తీసుకువెళ్ళారు. ఆమెలో ఏలోపం లేదన్నారు. మామయ్యకి అత్తయ్యంటే ఎంతో ప్రేమే. ఇంట్లో ఇంకొక అమ్మాయిని పెళ్ళిచేసు కోరా అని ఎంతగోల చేసినా చేసుకోలేదు. ఒకసారి మా అత్తయ్యవాళ్ళుంటున్న ఊరికి సంతానబాబా అని ఒకబాబా వచ్చాడు. అతని కి మొక్కుకుంటే సంతానవతి అవుతుందని అందరూ అనడంతో అత్తయ్య, మామయ్య ఇద్దరు ఆ సంతానబాబాని దర్శించుకున్నారు.

నీకు తప్పకసంతానం కలుగుతుందని అభ యమిచ్చి రాత్రికి ఆమెచేత సంతాన వ్రతం చేయించాలి తీసుకురండి అని మామయ్యకి చెప్పాడంట. ఆయన చెప్పినట్టుగానే పట్టుచీర కట్టించి, ఒంటినిండా నగలు వేయించి తీసు కువెళ్ళారు.

నగలు దేవికి వేయాలనీ, కంఠసీమని అలంకరించిన ఆరుపేటల గొలుసు, వడ్డాణం దేవికే ఉంచేయాలనీ చెప్పాడట ఆ సంతాన బాబా. వంశోద్ధారకుడు పుట్టేట్టయితే, నగలు పోతేమాత్రమేమి, మళ్ళీ చేయించుకోవచ్చు అనుకొని ఒప్పుకున్నారు.

అత్తయ్యని ఒక్కదానినే గదిలోకి పంపారు సంతాన బాబాగారు. మా అత్తయ్య చేత సంతా నవ్రతం చేయిస్తున్నారని తెలిసి ఊరంతా అక్కడే పోగయ్యారు. మా అత్తయ్యకి లోపలకి వెళ్ళిన రెండు నిముషాలకే స్పృహపో యిందంట. పూర్తిగా కాకుండా కొద్ది కొద్దిగా అర్ధమవుతూ వుందంట. సంతానబాబా చే సిందంతా లీలగా ఆమెకి తెలుస్తూనే ఉంది. మత్తుగా ఉండి అసలు ప్రతిఘటించలేకపో యింది.

వ్రతం పూర్తి అయిన తరువాత మామయ్య అత్తయ్యని తీసుకొని ఇంటికి వచ్చేసారు. ఇంటి కొచ్చిన అరగంటకి మత్తు పూర్తిగా వదిలింది.

మత్తువదిలిన వెంటనే సంతానబాబా చేసింది అర్థమైంది. కాగితం పెన్ను తీసుకొని సంతాన బాబా చేసినపని రాసిబావిలో దూకి ఆత్మహత్య చేసుకుంది. మా అత్తయ్య ఆత్మహత్య ఎందుకు చేసుకుందో ముందెవరికి అర్థంకాలేదు. ఉత్తరం చూసిన మామయ్యకుతప్ప. శవాన్ని దహనంచేసిన తరువాత మామయ్య ఆ గదిలోకి వెళ్ళాడు. అంతవరకు ఎవరికీ ఆ సంతానబాబా మీద అనుమానంరాలేదు. ఉత్తరం చదవగానే ఆ ఆవేశంలో కత్తి పట్టుకుని వెళ్ళి ఒకేదెబ్బతో ఆ సంతానబాబా కంఠాన్ని నేలరాల్చాడు" అని ఆపాడు రవి.

"అదిసరే... నువ్వు దేవుడివెలా అయ్యావు?" అడిగాడు నరేంద్ర

"అదోపెద్ద కథ. ఓసారి మా కాలేజీ కుర్రాళ్లం కబుర్లాడుకుంటున్నాం. 'ఒక రాత్రంతా లేడీస్ హాస్టల్‌లో ఉండగలమా' అన్నాడు సుబ్రహ్మణ్యం అనేస్టూడెంటు.

'ఒక రాత్రంతానే... అదేమైనా మెరకవీధిలో కొంపఅనుకున్నావేంటి. పగలే లోపలకి వెళ్ళడానికి కుదరదు. మాట్లాడాలంటే బయటకిపిలిచైనా, లేదా విజిటర్స్ రూమ్‌లో నైనా మాట్లాడుకోవాలి' అన్నాడు కుమార్.

"పగలే విజిటర్స్ రూమ్‌దాటి లోపలకి వెళ్ళలేము. అటువంటిది రాత్రంతా గడపడం కష్టమేకాదు... అసాధ్యం" అన్నాడు రంగారావు.

"ఒకరాత్రెందుకు పగలైనా సరే కాసేపు ఆ హాస్టల్లోని ఏ రూమ్‌లో ఉండగలిగినా వందరూపాయలిస్తాను" అన్నాడు కుమార్.

"నేనింకో వందిస్తాను" అన్నాడు రంగారావు.

"నేను మణిరూమ్‌లో ఒక నిముషం ఉంటాను ఏమిస్తారు మీరందరూకలసి" అన్నాను నేను.

"వెయ్యి రూపాయలిస్తాం తలావందచొప్పున. నువ్వువెళ్ళలేకపోతే ఏమిస్తావు" అన్నారు వాళ్ళు.

"ఏమీ ఇవ్వను మీదగ్గిర వెయ్యి రూపాయలుకూడా తీసుకోను"

"ఏమీ ఇవ్వకపోతే పందెం ఎలాఅవుతుంది?"

"నేను పందెం అని అనలేదే"

అందరూకలసి తర్జనభర్జనలు జరుపుకొని "నువ్వు లేడీస్‌హాస్టల్లో పదినిముషాలుండేటట్టయితే వెయ్యి రూపాయిలిస్తాము. ఉండలేకపోతే నువ్వు వందఇవ్వాలి" అన్నారు.

కొద్దిసేపు ఆలోచించి "సరే" అన్నాన్నేను.

"ఎన్నిరోజులు టైమ్‌కావాలి?"

"వచ్చేవారంలోగా చేసేస్తాను" అన్నాను ధీమాగా.

ఫస్ట్‌అవర్ అయిపోవడంతో సెకండ్ అవర్ లెక్చరర్ వచ్చేయడంతో ఎవరిసీట్లలోకి వాళ్ళు వెళ్ళికూర్చున్నాం.

"ఎలా ఉంటావురా పదినిముషాలు అక్కడ!" అడిగాడు రంగారావు ఆశ్చర్యంగా.

"ఇంకా ఆలోచించలేదు ఎలాగైనా సరే సాధించాలిరా లేకపోతే థ్రిల్ ఉండదు" అన్నాను.

"మరి తొందరగా ఆలోచించు ఏదో ఒకప్లాను... సాధించేద్దాం"

పందెం వేసి రెండురోజులు గడిచిపోయాయి. నాకు ఎటువంటి ఆలోచన రాలేదు.

మూడోరోజు నేను, రంగారావు కలసి బజారులో నడుస్తున్నాం. మా ముందే శర్మగారు వెళుతున్నారు.

"ఏమిటోరా రోజురోజుకి బాబాల సంఖ్య పెరిగిపోతోంది. నిజంగా దేవుడేగాని ఉంటే ఇలాంటి వాళ్ళందరినీ నామరూపాలు లేకుండా చేసి ఉండేవాడు" అన్నాన్నేను.

"దేవుడున్నాడు రా. కాకపోతే ఆయనకి వేరే పనులేవో ఉండివుంటాయి. అవి అయిపోగానే ధర్మసంస్థాపనానికి మళ్ళీ పుడతాడురా" అన్నాడు రంగారావు.

"నిజంగా దేవుడు ఈ బాబాలతో మాట్లాడతాడంటావా?"

"నిజమైన భక్తునితో తప్పక మాట్లాడతాడు"

"నిజమైన భక్తుడంటే?"

"నిజమైన భక్తుడనేవాడిని నిర్వచించడం కష్టం. ఆయన ప్రేమకి ఎవరు పాత్రుడైతే వాడే

నిజమైన భక్తుడు''

అప్పుడనిపించింది నాకు దేవుడిపేరు చెప్పి ఈ పందెం ఎందుకు నెగ్గకూడదు అని- అప్పటికప్పుడు ప్లాన్ చేసేసాను.

మర్నాడు పొద్దున్నే లేచి చకచక స్నానం చేసి, రంగారావుకి చేయాల్సిన పని చెప్పాను.

''అమ్మో... దేవుడిని అడ్డుపెట్టుకొని చెయ్యడమా! బెడిసికొట్టిందా మనకి టి.సి.లు ఇచ్చి పంపేస్తారు'' అన్నాడు వాడు.

''ఎందుకు బెడిసి కొడుతుందిరా. చాలా పకడ్బందీగా ఉంటేనూ... ప్లీజ్. నేను చెప్పినట్టు చేయరా బాబు'' అని గెడ్డం పట్టుకొని బతిమాలాను.

''సరే... మామిడి చెట్టు దగ్గిరవుంచేసి వచ్చేస్తాను'' అన్నాడతను.

''ఎక్కడో ఒకచోట. అదే నాకు కావలసినది''

''ఒకవేళ అటుది ఇటైనా నా పేరు చెప్పకూడదు''

''చచ్చినా చెప్పను. నువ్వు త్వరగా వెళ్ళు''

''వెళతానులే''

''ఇంకెప్పుడూ? నేను శర్మగారి దగ్గరకి ఇపుడే వెళుతున్నాను. మరో గంటలో ఆయనని తీసుకొని వచ్చేస్తాను'' అన్నానేను త్వరపెడుతూ.

''ఇదిగో నేనూ వెళుతున్నాను. పావుగంటలో లింగాన్ని కొనుక్కొళ్ళి అక్కడ పెట్టడం కష్టం. ఒక గంట టైమ్ తీసుకుంటుంది''

ఇద్దరూ కలసి బజారుకెళ్ళి కొనుక్కొచ్చాం. అది ఓ చిన్న శివలింగం. నేను నుదుటిన శివనామాలు పెట్టుకొని శర్మగారింటికి వెళ్ళాను. శర్మగారు లేడీస్ హాస్టల్ వార్డెన్.

పొద్దున్నే వచ్చిన నన్ను చూసి ''ఏమిటోయ్ ఇలా వచ్చావు?'' అని అడిగారు.

''మీరు నాకో సహాయం చెయ్యాలి సర్'' అన్నాను.

''ఏం చెయ్యాలి?''

''రాత్రి నాకు కలలో శివలింగం కనబడింది సర్! చిన్న శివలింగం. లింగం చిన్నదైతేనేం ఎంతో మహత్తుగలది. దానిని చూసినంతనే నా పెదవులు నిదురలోనే శివనామస్మరణ చేశాయి. దానిని చూసిన మరుక్షణమే మైమరచిపోయాను'' తన్మయత్వాన్ని మొహంలో కనిపింపచేస్తూ అన్నానేను.

శివుడు కలలో కనబడ్డాడు- అనగానే ఆయనలో చిన్న కదలిక కలిగింది. తరువాత నేను చెప్పింది వినగానే ఆశ్చర్యంతో ఆయన కనులు పెద్దవయ్యాయి తన్మయత్వంతో. ఆయన నాలుక శివనామస్మరణ చేయడం ప్రారంభించింది.

''చూసారా... అప్పుడే మీరు కూడా శివున్ని స్మరించడం ప్రారంభించారు. మహత్తుగల లింగంఅది'' అన్నానేను.

''ఏమండీ, ఒకసారిటురండి. వీడు చెప్పిన మాట వినడంలేదు'' అంటూ శర్మగారి భార్య పిలుపు.

ఆయన ''ఇప్పుడే వస్తాను'' అని లోపలికి వెళ్ళారు.

నాకు కావాల్సిన ఎఫెక్టు ఆయనలో కలిగించానని సంతోషించానేను. నేను చెప్పిందంతా ఆయన తన భార్యకి చెప్పారు. అప్రయత్నంగా ఆవిడ నోటినుండి ''శివ శివ'' అని వచ్చింది. దానితో ఆయనకి ఆ శివలింగం మీద నమ్మకం మరింత పెరిగింది.

''చూసావా దాని మహత్యం. ఆ లింగం గురించి వినగానే శివుని నామస్మరణ చేస్తున్నారు'' అన్నారాయన.

''అవునండి. మీరు చెపుతున్నది వింటున్నప్పుడు భగవంతుడు ఎదర కనిపించినట్లే అనిపించింది''

''నీకు అలా అనిపించిందా? నాకూ అనిపించింది. తన్మయత్వంతో నోట మాటరాలేదు''

''ఎవరండీ అతను... ఒకసారి చూస్తాను'' అని బయటకి వచ్చారావిడ.

నాలో దేవుడు కనిపించాడట ఆవిడకి. అంతే... ఆవిడ హిప్నటైజ్ అయిపోయినట్టు అయిపోయింది.

దైవాంశసంభూతునిగా అనిపిస్తున్న నాకు చేతులెత్తి నమస్కరించింది. నేను తడబడిపోయాను. శర్మగారికి ముందు ఈగో అడ్డొచ్చినా

భార్య దండం పెట్టడంతో తానూ రెండు చేతులూ జోడించాడు.

నాకు అప్పుడు అర్థమయింది దేవుని పేరు చెప్పగానే ప్రజలు ఎలా మారిపోతారో.

"మీరు నాకో సహాయం చెయ్యాలి సర్" అన్నాను శర్మగారికి చేతులు జోడించి.

"శివుని దర్శించిన పుణ్యాత్ములు మీరు... ఆజ్ఞాపించండి స్వామీ" అన్నారావిడ. మరీ పాతకాలం మనిషిలా ఉందామె.

"చెప్పండి" శర్మగారి కంఠంలో కూడా వినమ్రత.

"నేను స్వప్నంలోగాంచిన శివలింగం మన లేడీస్ హాస్టల్లోనే ఉంది. మీ సెలవైతే వెదికి నా దేవుడిని తెచ్చుకుని పూజించుకుంటాను" అన్నాను భక్తిగా.

"శివలింగం దొరికితే మాకు దర్శనభాగ్యం కలుగచేయండి స్వామి" అన్నారావిడ.

"తప్పకుండా... దేవుడిని సేవించుకుంటానంటే ఎందుకు కాదంటాను?"

"వెళ్ళండి. ఆయనతోపాటు వెళ్ళి శివలింగాన్ని దర్శించుకొని రండి" అన్నారావిడ.

శర్మగారు బట్టలేసుకుని "పదండి" అన్నారు.

ఇద్దరం కలసి లేడీస్ హాస్టల్‌లోకి వెళ్లాం. ప్రతి గదిని నిశితంగా వెదికాను. ఎక్కడా ఆ లింగం కనబడలేదు. తరువాత హాస్టల్ ప్రాంగణంలో వెదకడం ప్రారంభించాను. నా వెనకాలే శర్మగారు, ఆయన వెనకాల అమ్మాయిలంతా పోగయ్యారు.

'ఆహా... ఏమి నా భాగ్యం, మాట్లాడితే టెక్కు చూపించే ఈ ముద్దుగుమ్మలంతా నా వెనుక నుంచున్నారే. ఓ దేవా... నీకు నిజంగా మహిమవున్నది. ఒక్కరోజులో నన్నెంత గొప్పవాణ్ణి చేశావు' అనుకున్నాను.

అలాగే మామిడి చెట్టు దగ్గరకి వెళ్ళాను. అక్కడ శివలింగం కనబడలేదు. నాలో కంగారు మొదలైంది. ఇప్పుడుగాని అది దొరకకపోతే మొత్తం నేను అంతా అభాసుపాలైనట్టే అనుకున్నాను. ఆ రంగారావుగాడు ఇక్కడే ఎక్కడో వదిలేసి ఉంటాడు అనుకొని జాగ్రత్తగా మట్టిని కదుపుతూ వెదకనారంభించాను.

అలా మట్టిలో వెదుకుతుంటే లోపల రాయి లాంటి ఏదో నునుపుగా ఉన్నది తగిలింది. వెంటనే మట్టిని తొలగించాను. పైన నల్లగా ఉన్న రాయి కనిపించింది. కదిలిస్తే నల్లగా గుండ్రంగా ఉన్న రాయి పైకి వచ్చింది. వెంటనే శర్మగారు శివనామస్మరణ ప్రారంభించారు.

ఆ విషయం శర్మగారి భార్యగారి నోటివెంట అందరికీ తెలిసిపోయింది. కాలేజీ ప్రాంగణంలో ఉన్నవాళ్ళందరు అక్కడికి చేరుకున్నారు.

శివలింగాన్ని బయటికి తీశాను. శర్మగారితో సహా అందరూ అప్పటికప్పుడు తెప్పించిన కొబ్బరికాయలు కొట్టడం ప్రారంభించారు. కొందరు నాకు దండం పెట్టడం మొదలెట్టారు.

ఎవరెవరో ఏదేదో చేసేస్తున్నారు.

కొద్ది నిముషాల్లో ఆ విషయం ఊరంతా పాక్కిపోయింది. జనాలు తండోపతండాలుగా రావడం ప్రారంభించారు.

ఆ విషయం కేశవరావుగారికి కూడా తెలిసింది. ఆయన దేవాంతకుడు.

శిలలా నిలబడిపోయిన నన్ను రంగారావే బయటకు తీసుకువచ్చాడు. అలాగే రూమ్‌కి తీసుకొనివెళ్ళాడు. జరిగింది అంతా జ్ఞాపకం వచ్చింది. జనాలు తండోపతండాలుగా రావడం, నా కాళ్ళకి, కొందరు దండం పెట్టడం అంతా జ్ఞాపకంవచ్చి వాళ్ళ అజ్ఞానానికి నవ్వు తెరలుతెరలుగా వచ్చింది. దానితోపాటే దగ్గు. రంగారావు వచ్చి పట్టుకొని "ఏమైందిరా" అని అడిగాడు.

"నవ్వు వస్తోందిరా. నాకాళ్ళకి వాళ్ళు నమస్కారం చేయడం జ్ఞాపకం వచ్చి నవ్వు వస్తోంది" అన్నాడు.

"అంతా ఎగతాళిగా తీసేయకురా. నువ్వు నిజంగా దైవాంశకలిగినవాడివే. లేకపోతే ఆ శివలింగం నీకు అక్కడుందని ఎలా తెలిసింది?"

"మతిలేకుండా మాట్లాడకు. నువ్వే గదా దాన్నక్కడ పెట్టింది"



''నువ్వైన్నైనా చెప్పరా. దేవుడు నీయందు
న్నాడు నేను పెట్టింది అక్కడ కాదు. పైగ
మనం కొన్నది చాలా చిన్నది, గుర్తులేదా?''

షాక్ తిన్నాన్నేను.

అప్పుడే అక్కడకి వచ్చిన ఒకతను నాతో-
''రవికుమార్ మీరేనా'' అని అడిగాడు.

''అవునండి'' అన్నాను.

''ఒకసారి నాతో వస్తారా?'' అని అడిగాడ
అగంతకుడు.

''పదండి'' అన్నాను తిన్నగా కేశవరా
గారి దగ్గరికి తీసుకువెళ్ళాడతను. నాకిదంత
థ్రిల్లింగ్‌గా ఉంది. ఒక్కరోజులో ఊరంత
పాక్కిపోయింది నా పేరు.

కేశవరావుగారు ఎదురొచ్చి-- ''రండి'' అ
నన్ను లోపలికి తీసుకువెళ్ళారు.

''మీకు రాత్రి దేవుడు కనిపించాడంటగా
అడిగారాయన.

ఎవరుచూసినా అదే అడగటంతో విసిగి పోయి ఉన్నాన్నేను. పైగా ఈయన పెద్దవాడు. ఇంక ఆగలేక నిజం చెప్పేసాను.

"మీరు నిజంగా అదృష్టవంతులు. సమయానికి దేవుడు అందరికీ కనబడి మీ పేరు ఆకాశం అంత ఎత్తు పెంచేసాడు" అని కొద్ది సేపు ఆగి-- "మీరు నాకో హెల్ప్ చేయాలి" అని అడిగారు.

"ఏమిటో చెప్పండి... నాకు చాతనైతే తప్పకుండా చేస్తాను" అన్నాను.

"మీరీపనిచేస్తే ఇరవై వేలిస్తాను!" అన్నారాయన.

"ముందు విషయం చెప్పండి. చాతనైతే చేస్తాను గదా"

"ఈరోజు పొద్దున్నలాగే మళ్ళీ అబద్ధమాడాలి"

"ఏమిటో చెప్పండి"

"మీకు ఈరోజు శివుడు కలలో కనిపించాడనీ, తనకి ఆలయం రాజ్‌నగర్‌లో ఖాళీ స్థలంలో కట్టాలని ఆజ్ఞాపించాడనీ చెప్పాలి. అలా చెప్పితే మీకొక ఇరవైవేలు".

"ఎందుకు అలా చెప్పడం. అలా చెపితే మీకొచ్చే లాభం ఏమిటి?"

"అలా వివరాలు అడక్కుండా చేసిపెట్టండి"

రెండు నిముషాలు మౌనంగా ఆలోచిస్తూ గడిపేశాను. ఎందుకు అక్కడ కట్టించాలి అంటున్నారో అర్థమైపోయింది. అక్కడి రోడ్‌ని వైడెన్ చేయాలి అని అనుకుంటున్నారు. రోడ్ గాని పెంచితే అక్కడి షాపులన్నీ ఎగిరిపోతాయి. అలా ఎగరకుండా ఉండాలంటే అక్కడ గుడి ఉండాలి. గుడి ఉంటే రోడ్‌వైడెన్ చేయలేరు. భక్తులు ఊరుకోరు పైగా అక్కడే ఈయనకు ఖాళీ స్థలం చాలావుంది. "ఒక్కొక్క షాపుదగ్గర ఐదువేలు తీసుకున్నా మీకు లక్ష రూపాయలు వస్తాయిగదూ?" అన్నాన్నేను.

"తెలివైనవాడివే. సరే... ఫిఫ్టీ ఫిఫ్టీ. ఓకే"

"సారీ... ఆ పని నేను చేయలేను. ట్రాఫిక్ ఎక్కువై ఇప్పటికే ఏక్సిడెంట్స్ జరుగుతున్నాయి. పోనుపోను ట్రాఫిక్ ఇంకా పెరుగుతుంది. వారానికో ఏక్సిడెంట్ జరిగినా ఆశ్చర్యపోనక్కర్లేదు".

"నామాట వినకుండా ఎవరూ బయటకి వెళ్ళలేరు. నువ్వైనా సరే. మర్యాదగా నామాట వింటే యాభైవేలు. లేకపోతే స్వర్గానికి టికెట్-- ఆలోచించుకో"

"దిసీజ్ టూమచ్"

"ఇంకొద్దిసేపయితే త్రీమచ్ అవుతుంది"

"వాట్డూయు మీన్"

"నీ ఫ్రెండ్ రంగారావు మా చేతులలో బందీగా ఉన్నాడిప్పుడు. ఒప్పుకుంటే యాభైవేలు, లేకపోతే మీరిద్దరూ బొంగుస్వారీ చేయాల్సివుంటుంది. అన్నట్టు బొంగు స్వారీ అంటే తెలియదుగా. చచ్చిపోయిన మనిషిని బొంగులతో చేసిన పడకమీద ఊరేగిస్తారు. బొంగు స్వారీ అంటే పైకిపోవటం అన్నమాట" అన్నారాయన.

నేను ఇంకేం ప్రతిఘటించకుండా ఒప్పేసుకున్నాను.

మర్నాడు పొద్దున్న పత్రికావిలేకరులమధ్య కేశవరావుగారు చెప్పమన్నట్టుగా చెప్పాను. అదేరోజున చాలామందికి నూకాలమ్మలు, పోలేరమ్మలు ఇంకా ఎందరెందరో పూని శివాలయం అక్కడే కట్టాలి అని ఆదేశించారని కూడా ప్రచారమయింది.

ఆ వార్త ప్రముఖంగా ప్రచురించబడింది నా ఫోటోతోసహా పేపర్లలో. పేపరు చదివి ఆశ్చర్యపోయిన మా నాన్న హుటాహుటిన నా దగ్గరకి బయలుదేరారు. కానీ, నేను ఎక్కడున్నానో ఎవరు చెప్పలేకపోయారట! ఆరోజంతా అక్కడే గడిపి ఆరాతీసారు. నేను కాలేజీ టూర్‌లో వెళ్లానని చెప్పారట కొందరు.

దాంతో ఆయన ఊరెళ్లిపోయారు.

శివాలయానికి ఫౌండేషన్ స్టోన్ వేయడానికి మంత్రిని పిలిచారు. ఆయన తన సుదీర్ఘోపన్యాసంలో దేవాలయాలూ వాటి ప్రశస్తీ, మన ప్రాచీనుల గొప్పతనాన్ని తెలిపి శంకుస్థాపన చేసేశారు.

కేశవరావుగారికి ఇంకొక దివ్యమైన ఆలోచన




వచ్చింది. నన్ను దేవుని ప్రతినిధిగా, రవిబాబుగా ఎందుకు మార్చకూడదూ అని. బోల్డంత డబ్బు, పేరు ప్రఖ్యాతులు వస్తాయి అనుకొని నాతో చెప్పారు. నేను ససేమిరా ఒప్పుకోలేదు. నాకు బాబాలన్నా, దేవునిపేరు చెప్పి మోసం చేసేవాళ్ళన్నా అసహ్యం. నన్ను చంపి పోగులుపెట్టినాసరే ఒప్పుకోను అన్నాను. కేశవరావు గారిది ఉడుంపట్టు. రెండు మూడుసార్లు అడిగిచూశారు. ప్రాణాలు తీసేస్తానని బెదిరించారు. అయినా ఒప్పుకోలేదు నేను. లాభంలేదనుకొని ఎవరికైనా తల్లి అంటే ఎక్కువ అభిమానం ఉంటుంది కాబట్టి ఆవిడని రప్పించాలి అనుకున్నారు. అనుకున్నదే తడవు నా పేరుతో మా అమ్మగారికి ఉత్తరం రాసారు. ఆవిడని ఒక్కత్తెనే రమ్మని మరీ మరీ రాసారు.

ఆవిడ నిజంగా కొడుకే రాసాడనుకొని అమితానందంగా బయలుదేరింది. ఇక్కడికి రాగానే కేశవరావు తన మనుషులని పంపి తీసుకొచ్చి ఆవిడని ఒక గదిలో బంధించారు.

నేను మా నాన్నకి, కోడ్‌లో లెటర్ రాయడానికి ప్రయత్నించాను కాని ప్రయత్నం ఆదిలోనే ఆగిపోయింది కాగితాలు నాకు దొరకకుండా చేయడంతో. మర్నాడు నా దగ్గరికి వచ్చారు కేశవరావుగారు.

''ఇప్పటికైనా మనసు మార్చుకున్నావా?''

''నా మనసు మారదు. నేను చచ్చినా ఒప్పుకోను''

''నువ్వు చచ్చినా ఒప్పుకోవు, సరే... మీ అమ్మగారు చచ్చిపోయేటట్టయితే ఒప్పుకుంటావుగా''

''మా అమ్మగారా... ఆవిడ ఇక్కడికెలా వస్తుంది. చావు బతుకుల్లో ఉండటానికి''

''రప్పిస్తే వస్తారు నాయనా'' అని కాసెట్ వి.సి.ఆర్.లోఉంచి ఆన్ చేశాడు.

టి.వి. స్క్రీన్‌మీద మా అమ్మనుచూసి అదిరిపోయాను. వణకిపోయాను. కదలిపోయాను.

''మా అమ్మనేం చేయకు... ప్లీజ్'' అన్నాను.

''ఇంకా ఏంచేయలేదులే నువ్వు ఒప్పుకోకపోతే ఏమైనా చేద్దామని స్పెషల్‌గా మీకోసం తేళ్ళు, మంత్రగబ్బలు తెప్పించాను'' అన్నాడు.

''నువ్వు చెప్పినట్టు చేస్తానుగాని మా అమ్మని మాత్రం వదిలెయ్యి''

''అమ్మ! ఎంతమాట ఆవిడని వదిలేసిన తరువాత నువ్వు మళ్ళీ మొదటికొస్తే నాగతేమిటి?''

''నువ్వు చెప్పినట్టే వింటాను... అమ్మని వదిలెయ్యి''

''మీ అమ్మకి ఇక్కడ ఏలోటు జరగదులే. నువ్వు సంపాదించిన దానిలో సగం ఎప్పటికప్పుడు నీ పేరన బ్యాంక్‌లో వేస్తాను'' అన్నారాయన. నేను ఒప్పుకోకతప్పలేదు.

కేశవరావు నాకు పవిత్ర గంగాజలాన్ని గాలిలోనుంచి సృష్టించడం ఎలాగో నేర్పాడు. అప్పటినుంచి ఆశ్రమం కట్టినచోటనే ఉంటున్నాను. గెడ్డాలు, మీసాలు తమ ఇష్టం వచ్చినట్టు ఒకదానికొకటి పోటీపడి పెరిగిపోయాయి. నేను మాత్రం తక్కువ తిన్నానా అని జుట్టుకూడా బారెడు పెరిగిపోయింది.

రవికుమార్‌నల్లా రవిబాబునయిపోయాను. అనేకమంది భక్తులైపోయారు. బ్యాంక్‌లో డబ్బు పెరిగింది. ఏలోటు లేకుండాపోతోంది జీవితం. ఏమికావాలంటే అది కాళ్ళదగ్గరకి వస్తోంది. అయినా ఆ జీవితం నాకు నచ్చలేదు. అదో దొంగబతుకు. ఎలాగైనా అక్కడినుంచి తప్పించుకోవాలనే కోరిక ఎంతకీ తీరలేదు.

ఎలాగోలా ఒక కాగితాన్ని సంపాదించి మా నాన్నకు తప్ప మరెవరికీ అర్థంకాని కోడ్‌లో రాసి దానివెనక రాజుగారి అడ్రసురాసి కాగితాన్ని అడ్రసు కనబడకుండా అతికించేశాను. ఆరోజు నా దర్శనానికివచ్చిన శశికాంతకి ఆ కాగితం ఇచ్చాను. లోపల అడ్రసు ఉందని చెప్పేలోగానే వింజామరలు వీచే నెపంమీద అక్కడ కాపలా ఉంచిన వ్యక్తి రావడంతో చెప్పలేకపోయాను. ఆమెకి అందులో విషయం అర్థంకాలేదనీ, అడ్రసు చూడలేదనీ తరువాత రెండు రోజులకే ఆమె మొహంలోని ప్రశ్నార్థకాన్నిబట్టి తెలుసుకున్నాను. ఆమెకి

విషయం చెపుదామంటే ఆమె మళ్ళీ రాలేదు. ఇంక తప్పించుకునేయోగమే లేదనుకున్నాను."

"గాలిలో నీళ్ళు సృష్టించడం ఎలాసాధ్యం అయ్యేది?"

అడిగాడు నరేంద్ర

"వెరీ సింపుల్. ఒక పాలిథిన్ కవరులో నీటిని తీసుకొని దానిని ఛాతీకి కట్టుకొని, దానిపైన ఇంకొక ఇనుప కవచంలాంటిది పెట్టుకోవాలి. నీరుపోసిన పాలిథిన్ కవరుకి ఒక చివర ఓపెనింగ్ ఉంటుంది. అది మామూలు కండిషన్లోనైతే మూసుకొని ఉంటుంది. ఆ ఓపెనింగ్ దగ్గర నుంచి చిన్న ట్యూబ్ అరచేతి దగ్గరవరకు... అంటే భుజందగ్గర నుంచి అర చేతివరకు ఉంటుంది. ఎవరైనా వచ్చి దోసిలి పట్టగానే గట్టిగా ఊపిరి తీసుకుంటే పాలిథిన్ కవరు ఇనుప కవచానికి నొక్కుకుంటుంది. ఆ ప్రెష్షర్‌కి భుజందగ్గరవున్న ఓపెనింగ్ తెరుచుకుంటుంది. అక్కడినుంచి నీరు చిన్న ట్యూబ్ ద్వారా అరచేతిలోకి వస్తుంది. ఆ నీటినే దోసిలి పట్టిన వ్యక్తి చేతిలో పోస్తాను"

"వండర్‌ఫుల్. మరి యజ్ఞం చేస్తే వర్షం ఎలాపడింది?"

"మాకు అక్కడ ఒకవారం రోజులలో వర్షంపడుతుందని వాతావరణ పరిశోధనలవల్ల తెలిసింది. అదీగాక యజ్ఞానికి వాడే ఒక పదార్థాల్లోంచి వెలువడే పొగలు మేఘాలని చుట్టుముట్టి వర్షంపడేలా చేసే అవకాశం ఉందని కూడా తెలిసింది. అందుకే యజ్ఞానికి సిద్ధపడ్డాం"

"భలే న్యూస్ దొరికిందిలే ఎల్లుండికి" అన్నాడు అంతసేపూ ఆసక్తిగా వింటూ రాసుకుంటున్న నరేంద్ర.

"మీరు న్యూస్ రిపోర్టరా?" అడిగాడు రవి.

"అవునండి"

"అయితే ఈ విషయాలు అప్పుడే బయటకి రాకూడదండి"

"ఎందుకని?"

"తరువాత చెబుతాను. ముందు మనం ఇక్కడినుంచి వెళ్ళిపోవాలి. సరేగానీ నన్ను ఎలా తప్పించారు?" అడిగాడు రవి.

ఎలా తప్పించింది చెప్పారు రాజుగారు.

"అయితే ఇక్కడ శశికాంతనీ, నాగేశ్వరరావు గారినీ ఉంచడం మంచిదికాదు"

"ఎందుకని?"

"వీళ్ళు ఇక్కడుంటే వెంటనే బంధించేసి తీసుకుపోతారు"

"అంత సమర్థులా వాళ్లు"

"నేను ఈ ఊళ్ళోనే ఉంటే నేను లేనని తెలిసిన అరగంటలోగా నన్ను బంధిస్తాడు"

"అయితే తట్టబుట్ట అన్నీ సర్దుకోండి. మూడింటికి బస్సుందిగా దానికి వెళ్ళి పోదాం" అన్నాడు నరేంద్ర.

అన్నీ చకచక సర్దేసుకొని మూడుకి పావు గంట ఉందనగా బస్‌స్టాప్ చేరుకున్నారు. కరెక్టుగా మూడింటికి బస్సువచ్చింది. ఆరింటికి వాళ్ళని చేర్చాల్సిన చోట చేర్చింది. నరేంద్ర అందరినీ తన ఇంటికి తీసుకువెళ్ళాడు.

నాగేశ్వరరావుగారికి విషయం అంతా పూసగుచ్చినట్టు బస్సులో చెప్పారు.




నరేంద్ర రూమ్‌కెళ్ళి తలుపుకొట్టగానే ప్రదీప్ తలుపు తీశాడు.

"ఎక్కడకి పోతున్నావ్‌రా? ఈమధ్య చెప్పాపెట్టకుండా పోవడం ఎక్కువైంది" అని వెనకవున్న పటాలాన్ని చూసి, "ఏంటి... అందరినీ వెంటబెట్టు కొచ్చేసావ్" అన్నాడు. అందరినీ ప్రదీప్‌కి పరిచయంచేసి "రాజుగారు. రవికుమార్‌గారు నా దగ్గర ఉంటారు. వాళ్ళిద్దరిని నువ్వు తీసుకొని వెళ్ళు" అన్నాడు నరేంద్ర.

"అలాగే... తప్పకుండా" అని నాగేశ్వరరావు

గారిని, శశికాంతని తన ఇంటికి తీసుకొని వెళ్ళాడు.

వాళ్ళు వెళ్ళిపోగానే ''మరీన్యూస్ బయట ఎక్కడ ఎవరితో చెప్పకండి. ఇంకా మా అమ్మగారిని రక్షించుకోవాలి'' అన్నాడు రవి.

''మీ అమ్మగారిని ఎలా రక్షించుకుంటారు?''

''కేశవరావుతో ఒప్పించి చెప్పి''

''ఆయనని పోలీసులకి అప్పజెప్పమా''

''ఏ విధంగా అప్పజెబుతారు?''

ఏ విధంగానో తెలియక ఆగిపోయాడు నరేంద్ర.

''మనం చేయగల్గిందల్లా పేపరులో ఈ విషయం రప్పించడం. దాని ద్వారా అతనిని ఇరకాటంలో పడేయడం. అలాచేస్తే అమ్మని రక్షించుకునే ఛాన్సు దొరకదు. అదికాకపోయినా నాకు న్యూస్‌లో ఎక్కడం ఇక ఇష్టంలేదు''

''అయితే ఏం చేస్తావ్?'' అంతవరకు మౌనంగావున్న రాజుగారు అడిగారు.

''అతనికి నేనేమీ నష్టం కలిగించనని చెప్పి, అమ్మని నాకు అప్ప జెప్పమంటాను. లేకపోతే రేపు న్యూస్‌లో ఈ విషయమే వస్తుందని బెదిరిస్తాను'' అన్నాడు.

''బెదురుతాడంటావా?''

''బెదురుతాడనే అనుకుంటున్నాను''

''అయితే ఇంకేం... నీ ఇష్టం వచ్చినట్లే కానీ'' అన్నారు రాజుగారు.

ఒకగంటవరకు ఆ విషయం ఈ విషయం మాట్లాడుకొని గంట తరువాత కేశవరావుకి ఫోన్ చేశాడు రవి.

పొద్దున్నే నిద్రలేవగానే రవిబాబు తప్పించుకున్నాడని తెలిసి హతాశులైపోయి ఉన్నారాయన. ''ఈరోజు బాబుగారు భక్తులకి దర్శనమివ్వరు''అని ప్రకటింపజేసి కాలుగాలిన పిల్లిలా పచార్లుచేస్తూ, ఎలా మాయమయ్యాడా అని ఆలోచించడం ప్రారంభించారు. మస్తాన్‌ని పిలిచి శశికాంత ఇంటికి వెళ్ళి ఆమెని తీసుకొని రమ్మన్నారు.

మస్తాన్ ఉత్తచేతుల్తో రావడంతో ఆయనకి ఈ పని శశికాంత చేసిందేనని రూఢి అయిపోయింది. కరెక్టుగా అప్పుడే ఫోన్ రింగయింది. ఫోన్ ఎత్తి ''హలో...'' అన్నారాయన.

''ఈ పాటికి నా విషయం తెలిసిపోయి వుంటుంది''

''తెలిసింది. ఎందుకు పారిపోయావు. నన్ను అడిగితే నీకెక్కడ తిరిగిరావాలని ఉన్నా పంపేవాడినిగా?''

''కల్లబొల్లి మాటల్ని ఆపేసి అసలు విషయానికొద్దాం''

''ఎక్కడ నుంచి మాట్లాడుతున్నావ్?''

''ఎక్కడనుంచి మాట్లాడుతున్నానో నువ్వు ఊహించలేవులే గాని. మా అమ్మని వదిలిపెడతావా లేదా?''

''వదిలిపెట్టను. నువ్వు ఇక్కడకివచ్చి సరెండర్ అయిపోతే అప్పుడు పంపుతాను''

''ఎవరు సరెండరు అవ్వాల్సివస్తుందో రేపు పేపరులో తెలుస్తుంది''

''పేపరుదాక వెళ్ళడం ఎందుకు? మనలో మనమే ఏ విషయం తేల్చుకోవాలిగాని''

''నువ్వు మా అమ్మని పంపితే నీకు బిజినెస్ పోకుండా, నాబాధ లేకుండా నీకొక ఉపాయం చెపుతాను'' అన్నాడు.

''ఏంటది?''

''నువ్వు ఎవరినో ఒకడిని ఎంచుకొని రెడీగా ఉండు. వాణ్ణి నా స్థానంలో ప్రతిష్ఠించి నేను అక్కడి నుంచి తప్పుకుంటాను''

''ఎలా తప్పుకుంటావ్?''

''ఏముంది... వెరీ సింపుల్. నాకోసం ఒక సమాధి తవ్వండి. సజీవసమాధికి నాకు అక్కడ నుంచి వేరే మార్గం ఇంకొకచోటకి తవ్వండి. ప్రజల దృష్టిలో సజీవ సమాధి అయిపోయి బయట ప్రపంచంలోకెళ్ళి కొత్త జీవితాన్ని ప్రారంభిస్తాను''

''అయితే వెంటనే వచ్చెయ్యి. నా దగ్గర మనిషి ఉన్నాడు''

''నేను ఈరోజు రాత్రికి వస్తాను. మధ్యాహ్నానికి అమ్మనిక్కడికి పంపితే నేను అక్కడకి వస్తాను. లేకపోతే ఇక రామ్‌రామ్''

''ఎక్కడకి పంపాలి''

అప్పుడు రవికుమార్.

"బస్‌స్టాండ్‌లో మేము రిసీవ్ చేసుకుంటాం. అమ్మతోపాటు ఎవరినీ పంపకు... ఓ.కే."

"ఓ.కే... పంపుతాను"

ఫోన్ క్రెడిల్‌చేసి నరేంద్ర, రాజుగార్ల దగ్గరికి వచ్చాడు రవి.

"ఏంటిరా... నువ్వు మాట్లాడుతున్నది. మళ్ళీ వాడిదగ్గరికి వెళతావా?" కోపంగా అడిగారాయన.

"తప్పదు... అమ్మని తీసుకొచ్చుకోవాలిగా"

"ఎలా బయటికి వస్తావ్. అక్కడికి వెళితే నిన్ను అక్కడే వుంచేసుకుంటారు. బంగారుగుడ్లుపెట్టేబాతుని ఎవరు వదులుకుంటారు?"

"ఆ బంగారుగుడ్లు పెట్టే బాతు ఇప్పుడు చివరి గుడ్డుపెడుతుంది. అది బంగారందికాదు- బంగారుగుడ్లు పెట్టే ఇంకొక బాతుకి జన్మనిచ్చేగుడ్డు"

"అంటే?"

"నేను బయటికి వచ్చేసి నా స్థానంలో ఇంకొకరిని ఉంచుతాను. అప్పుడు నాకు స్వేచ్ఛ దొరుకుతుంది. అటు కేశవరావుకి నష్టం ఏమీ ఉండదు"

"దీనికి నేను ఒప్పుకోను. మనం వెంటనే పోలీసులదగ్గరికి వెళ్ళి రిపోర్టు ఇద్దాం కేశవరావుమీద"

"క్షమించండి నాన్నా! ఇప్పటికే చాలా విసిగిపోయాను, అలసిపోయాను. ఇంకా పోలీసులతో, లాయర్లతో, జర్నలిస్ట్‌లతో నేను బాధపడలేను"

"నువ్వు నీగురించే ఆలోచిస్తున్నావుగానీ, ప్రజల గురించి అసలు ఆలోచించడంలేదు"

"ఏ ప్రజలగురించి?"

"నువ్వు ఇంతకాలం మోసంచేసిన ప్రజలు. ఇప్పుడు ఇంకొకడిచేత మోసగించబడే ప్రజలు"

"దేవుడిపేరు చెప్పి ప్రజల్ని మోసగిస్తున్నవాళ్ళు ఊరుకొకళ్ళున్నారు. మరి వాళ్ళందరి మాట ఏమిటి? మనం ఇప్పుడు పోలీసు రిపోర్టు ఇస్తే ప్రజల్ని మోసంచేసేవాళ్ళ సంఖ్య ఒకటి తగ్గుతుంది గానీ మర్నాడే ఇంకో ఇద్దరు పుట్టుకొస్తారు. ఇలా మనం ఎంతమంది బండారం బయటపెట్టినా వాళ్ళ సంఖ్య నానాటికీ పెరిగిపోతుందేతప్ప తగ్గదు. మనదేశ ప్రజలు ఇలా ఉన్నంతవరకు, వాళ్ళకి ఏవిధమైన అర్థం ఉండదు"

"అంటే, ఏమిటి నీ ఉద్దేశం?"

"చెప్పానుగా"

"ఇప్పుడు నరేంద్ర నీవిషయం పత్రికలో ప్రకటిస్తే ప్రజలు ఇంతకాలం ఎలా మోసపోయారో అర్థం అవుతుంది. నువ్వు ఇందాక అన్నావే ప్రజలలో మార్పు అని... అదీ వస్తుంది"

"అసంభవం నాన్నా! ప్రజలు ఇలాంటి చిన్న చిన్న విషయాలకి మారిపోరు. కొంతకాలం ఆ వార్త పత్రికలకి మేతపెడ్తుంది. మీరు బయటపెట్టిన దేవి విషయం ఏమయింది? వాళ్ళు కొంతకాలానికి ఇంకొకచోటికి వెళ్ళి ఇదేపని ఇంకొంత పకడ్బందీగా చేస్తారు. మీరు అప్పట్లో నా విషయం బయటపెట్టినా అక్కడ నా దగ్గరికి వచ్చేవాళ్ళసంఖ్య ఒకటి కూడా తగ్గలేదు"

"అదివేరు. నీకు మంచిపేరు వచ్చింది. మంత్రిగారికి నీమీద మంచి గురికూడా కుదిరింది."

"ప్రధానమంత్రితో చాలా దగ్గరి సంబంధాలున్న బాబా తుపాకీల ఫ్యాక్టరీపెట్టి అవసరానికిమించి తయారుచేస్తే ఎవరు పట్టించుకున్నారు? ఎందరు మారారు. అంతెందుకండీ... మంగమ్మవ్వ కేసు ఒకప్పుడు సంచలనం సృష్టించింది. మరిప్పుడు అలాంటిది ఒకటి జరిగిందనే ప్రజలు మర్చిపోయారు. మీరు ప్రజలు ప్రజలు అంటూ వాపోవడం తప్ప ఏమాత్రం లాభం ఉండదు"

"అంతేనా?"

"క్షమించండి నాన్నా... మీమాట కాదంటున్నందుకు. మీరుకూడా క్షమించండి... మీకొచ్చే పేరు పోగొడుతున్నాను"

అప్పటివరకు తండ్రీకొడుకులమధ్య జరుగుతున్న సంభాషణ ఒక ప్రేక్షకుడిలా గమనిస్తున్న నరేంద్ర "మీలాంటి ఒక మంచి స్నే

హితుడికోసం ఏపనైనా చేస్తానండీ. అటు వంటిది ఆఫ్టరల్ పేరుకోసం మీ అమ్మగారి భవిష్యత్తునిలా నాశనం చేస్తానా? మనస్ఫూర్తిగా మీకు సహాయం చేస్తాను'' అన్నాడు.

ఆ అభిమానానికి కదలిపోయాడు. కృతజ్ఞతా భావం మొహంలో కదలాడింది. ''థాంక్స్... మీ సహాయం మరచిపోలేను'' అన్నాడు.

మధ్యాహ్నం రవి అమ్మగారు వచ్చారు. ఆమెనికూడా నరేంద్ర దగ్గరకే తీసుకువెళ్ళాడు రవి. ఎన్నో సంవత్సరాల తరువాత తల్లీకొడుకులు, భార్యాభర్తలు ఒకటైనారు. వాళ్ల భావాలు వర్ణించలేనివి.

తల్లితో ఎంత మాట్లాడుతున్నా ఇంకా మాట్లాడాలనే అనిపిస్తోంది. ఆవిడకి అయితే ఇక జన్మలో కొడుకుని చూడనని, భర్తని కలుసుకోననుకున్నారేమో సంవత్సరాలు తగ్గిపోయినట్టు, తాను చిన్నపిల్లనయిపోయినట్టు హుషారుగా ఉన్నారు.

రవి సాయంత్రానికి కార్యోన్ముఖుడై లేచాడు. లేచి కేశవరావుగారికి ఫోనుచేశాడు. అటువైపు నుంచి ''హలో'' అని వినిపించింది.

''ఎవరు మాట్లాడుతున్నది?'' అడిగాడు.

''కేశవరావు. మీరెవరు?''

''నేను రవిని. అమ్మ ఇక్కడకి క్షేమంగానే చేరుకుంది. నేను ఇప్పుడే బయలుదేరి వస్తున్నాను''

''అప్పుడే రావద్దు. ఇంకొక రెండుగంటలలో అక్కడికి కారు వస్తుంది. దాంట్లో వచ్చై?''

''రడీగా ఉంచావా?''

''అన్నీ రడీగా ఉన్నాయి''

ఫోన్ డిస్కనెక్ట్‌చేసి మళ్ళీ తల్లిదగ్గరికి వెళ్ళి కూర్చున్నాడు. రెండుగంటలు రెండు క్షణాల్లా గడచిపోయాయి. బయట కారుహారన్ మోతతో ఇహలోకానికి వచ్చారు. రవి బయటకెళుతూ ''నరేంద్రగారూ... ఇప్పటికే మీకెంతో రుణపడి ఉన్నాను. నేను వచ్చేంతవరకు మా అమ్మానాన్నగార్లని మీరే చూడాలి'' అన్నాడు.

''మీరు వాళ్ళిద్దరిగురించి బెంగపెట్టుకోకండి. తొందరగా వచ్చేయండి'' అన్నాడు.

అందరి దగ్గర కన్నీటి వీడ్కోలు తీస్కొని కదలిపోయాడు మళ్ళీ తన లోకానికి. ఆరోజు రాత్రికి అక్కడకి చేరుకున్నాడు. డైరక్టుగా కేశవరావుగారిదగ్గరకి వెళ్ళి ఒకగంట ఆయనతో మాట్లాడి, ఎవరికీ కనబడకుండా మళ్ళీ యధాస్థానానికి చేరుకున్నాడు.

ఆ మర్నాడే రవిబాబు శివసాయుజ్యం పొందడానికి సజీవసమాధి అవుతున్నారు అని ప్రచారంలోకి వచ్చింది. ఆయన ఆత్మత్యాగం చేసుకుంటారని తెలిసినప్పుడే నేల ఈనినట్టు భక్తులు వెళ్ళారు.

అది ఒక పెద్ద సంచలనం సృష్టించింది. ఎక్కడ చూసినా ఇదే విషయం చర్చించుకుంటున్నారు. రవిబాబుగారికి అనేక విజ్ఞాపన పత్రాలు వచ్చాయి- మీరిక్కడే ఉండవలసిందిగా కోరుకుంటున్నామని. అన్నిటినీ చిరునవ్వుతో తోసిపుచ్చారు. తను సజీవంగా సమాధి అయ్యే స్థలాన్ని ఎంచుకున్నారు. వేదపండితులు పెట్టిన ముహూర్తానికి అక్కడ సమాధికట్టడం ప్రారంభించారు. రవిబాబాగారు ప్రతి విషయాన్ని దగ్గరుండి పర్యవేక్షిస్తున్నారు. ఆయన సమాధి అయ్యేరోజు రానేవచ్చింది.

నేల ఈనినట్టు, జనాలు వచ్చారు. అందరి సమక్షంలోనే రవిబాబుగారు సజీవంగా సమాధి చేయబడ్డారు. జయజయధ్వానాలు మిన్నుముట్టాయి.

రవిబాబా సజీవసమాధి అయిపోయి రహస్యమార్గంగుండా కేశవరావుగారింటికి వెళ్ళాడు. అక్కడి పరిస్థితులని చూడగానే తనకి చావుతప్పదని అనిపించింది. బయట ప్రజలు ఇంకా జయజయధ్వానాలు చేస్తూనే ఉన్నారు. గొంతులు ఎండిపోయేలా, కంఠనాళాలు తెగిపోయేలా అరుస్తున్నారు.

తనకు ఎదురుగా మృత్యువుకి ప్రతిరూపంగా నిలబడిన కేశవరావుని చూడగానే రవి గొంతు ఎండిపోయింది.

పోలీసు రిపోర్టు ఇవ్వకుండా, తను తప్పుచేశానేమోనని తండ్రిమాటవినకుండా అప్పుడనిపించింది.

కాని, ఏ విధంగాను సరిచేసుకోలేని తప్పు అది.




మా క్రికెట్ బాల్ గోడలోంచి దూసుకువచ్చిందంటే అది మా తప్పెలా అవుతుంది! మీరు ఇంటిని నాగార్జున సిమ్మెంట్ తో కట్టించక పోడం మీ తప్పుగాని...
HAM 71

# చతుర ప్రపంచం



## పిల్లల్ని హింసించే తల్లిదండ్రులు

తల్లిదండ్రుల్లో ఎవరికి కోపం వచ్చినా ముందు పిల్లల్ని బాదటం మధ్యతరగతి కుటుంబాల్లో పరిపాటి. క్రమశిక్షణ పేరుతోనో, సరిగ్గా చదవటంలేదనే మిషతోనో కొట్టటం, శారీరకంగా, మానసికంగా పిల్లల్ని హింసించటం అన్యాయం, అమానుషం.

లండన్‌లో ఓ సవతితండ్రి తమ చిన్నారి "హైదీ" తనను అడగకుండా ఐస్క్రీం తిందన్న కారణంగా ఆ మూడేళ్లపాపను తిండీ నీళ్ళు ఇవ్వకుండా చీకటిగదిలో బంధించాడట. హైదీ అమ్మమ్మా, ఇరుగు పొరుగువారూ సాంఘికసంక్షేమం వారికీ సంగతి తెలిపినా ఎవరూ విన్పించుకోలేదు. అరిచి, ఏడ్చి ఆ పాప ఆకలికి ఆగలేక గోడకు అంటించిన కాగితాలు గీకి నమిలేది. అలా మూడునెలలు గడిచాక దుర్గంధం వ్యాపించటంతో పోలీసులు వచ్చారు. తలుపులు విరిక్కొట్టి లోపలికి చూస్తే ఎండిపోయిన హైదీ శవం కనిపించింది. ఈ విషయమై ఆ సవతి తండ్రిని పోలీసులు ప్రశ్నించినపుడు అతడు పిల్లని అదుపులో పెట్టటం కోసం అలా చేశానని కర్కశంగా జవాబిచ్చాడట.

ఒళ్ళు గగ్గుర్పొడిచే ఉదంతం మరొకటి జరిగింది. తన బిడ్డ మూడేళ్ళ లారిసాను అమ్మమ్మ దగ్గర విడిచిపెట్టి ఒక స్నేహితుడిని కలుసుకోడానికి వెళ్ళింది లారిసా తల్లి. అమ్మమ్మ ఆ పాపను మాట వరసకు అడిగింది నీ వయసెంత అని. ఆ పాప చెప్పనంది. దాంతో ఆ వృద్ధురాలికి కోపం వచ్చి పాపను విసురుగా తోయడంతో అక్కడికక్కడే తలపగిలి లారిసా మరణించింది. ముసలావిడ పరారైంది. లారిసా స్నేహితులు ఇదంతా గమనించి పిల్ల తల్లికి ఫోను చేశారు. కాని 18 రోజులు గడిచినా ఆ తల్లి రాకపోవడంతో స్నేహితులు ఒక పాలిథీన్ సంచీలో లారిసా శవాన్ని కూరి పబ్లిక్ డస్ట్ బిన్‌లో పారెయ్యాలని ప్రయత్నించారు. అప్పుడు పోలీసులు పిల్లల్ని పట్టుకుని జరిగిన ఉదంతాన్ని వెలుగులోకి తెచ్చారు.

ఒక తల్లి తన ఏడునెలల పసివాడిని చావగొట్టి, తర్వాత వాడిని ఆస్పత్రికి తీసుకు వెళ్లింది.

తమ నాలుగేళ్ళ పసివాడిని అయిదో అంతస్తునుండి కిందికి తోశారు ఓ అపార్టుమెంటులో నివసించే దంపతులు. ఇంగ్లాండులో ఒక సంస్థ నిర్వహించిన సర్వేలో ఏటా ఏడువేల కేసులు పిల్లల్ని



హింసించినవేనని తేలింది. ఈ సంఖ్య గత ఆరేళ్లలో 70 శాతం పెరిగింది. అమెరికా సంయుక్తరాష్ట్రాల్లో సంవత్సరానికి 15 లక్షల మంది పసివాళ్ళు హింసించబడుతున్నారు.

## చెత్తతో గ్యాసు

ధర్మేంద్రసింగ్ అనే యువసైంటిస్టు వంటిళ్ళలో పారవేసే వ్యర్థపదార్థాలతో ఓ కొత్తరకం గ్యాస్ తయారుచేశాడు. దీనిని ఇపుడు మనంవాడే లిక్విఫైడ్ పెట్రోలియంగ్యాసు బదులుగా వాడుకోవచ్చు. నాలుగేళ్ళు అవిరామంగా కృషిచేసి, పరిశోధనలు జరిపి ఈ విప్లవాత్మక ప్రక్రియను కనుగొన్నాడతను. ఈ వ్యర్థపదార్థాలు గతంలో దేశదేశాల్లో ఎందరో సైంటిస్టులకి పని కల్పించాయి. జర్మనీ, జపాన్ మున్నగు దేశాల్లో నగరాల్లోని చెత్తాచెదారాన్ని కుప్పబోసి, అధిక ప్రెషర్‌తో అణచి, ఇటుకల వంటివాటిని తయారుచేసి వీటిని భవన నిర్మాణాలకి వాడతారు. సింగపూర్లో వ్యర్థపదార్థాలని పొడిచేసి, కాల్చి విద్యుశ్చక్తి లాంటిదాన్ని ఉత్పత్తిచేస్తారు. ఆ శక్తినే కొంత మార్చి వీధిదీపాలు వెలిగించడానికి ఉపయోగిస్తారు. ప్రస్తుతం ఇద్దరు భారతీయ సైంటిస్టులు వ్యర్థపదార్థాలన్నిటితో ఎల్.పి.జి. గ్యాస్‌కు ప్రత్యామ్నాయం కనుగొన్నారు. ప్రభుత్వం ఈ ప్రత్యామ్నాయాన్ని సరిగ్గా వినియోగించుకుంటే వ్యర్థమయ్యే వస్తువులేమీ ఉండవు. డబ్బు ఆదా అవుతుంది. ఈ పథకాన్ని అభివృద్ధిపరచి ప్రతి నగరంలోను, పట్టణంలోను భారీ యెత్తున సద్వినియోగం చేసుకోవటం ప్రభుత్వాలకు, మునిసిపాలిటీలకు ఆర్థికంగా లాభసాటిగా ఉంటుంది.

## "కూతురు పిల్లల్ని కనబోతున్న తల్లి"

జోహన్సబర్గ్‌లోని నలభై ఎనిమిదేళ్ళ పాట్ ఆంథోని లోకంలో ఏ తల్లీ చేయని సాహసం తన కూతురు కారెన్ సుఖంకోసం చేస్తోంది.

కారెన్ వయసు 25 సంవత్సరాలు. ఆమె భర్త 33 ఏళ్ళ అల్సినోఫెరెరా రిఫ్రిజిరేషన్ ఇంజినీర్‌గా పనిచేస్తున్నాడు. వీరికి మూడేళ్ళ క్రితం ఓ మగశిశువు జన్మించాడు. ప్రసవ సమయంలో కారెన్ గర్భసంచి బాగా దెబ్బ



తింది. మరో కాన్పు రావటం సంభవిస్తే ఆమె ప్రాణానికే ముప్పని డాక్టర్లు చెప్పటంతో కారెన్ దంపతులు నిరాశపడ్డారు. కనీసం మరో బిడ్డ అయినా కావాలని వారు ముచ్చటపడేవారు. కాని ఆరోగ్యాన్ని దృష్టిలో ఉంచుకుని బల వంతంగా తమ ఇష్టాన్ని అణచుకున్నారు.

కాలప్రవాహంలో మరో మూడేళ్ళు కలిశాయి. ఒక్క పిల్లడితో సంతృప్తి కలగక, మరికొందరు పిల్లల్ని కనాలన్న ఆశ చావక మానసికంగా ఇద్దరూ కుంగిపోసాగారు. ఓరోజు హఠాత్తుగా వారికి టెస్ట్‌ట్యూబ్ ద్వారా పిల్లల్ని కనవచ్చును గదా అనే ఆలోచన వచ్చింది. కారెన్ అండాన్ని తమ గర్భంలో ప్రవేశపెట్టుకోడానికి ఆమె స్నేహితురాళ్ళెందరో సిద్ధమయ్యారు. కాని, పరులగర్భంలో తన పిల్లలు పెరగటం అనేది కారెన్‌కి నచ్చలేదు. దాంతో సమస్య మళ్ళీ మొదటికొచ్చింది. వీరి సమస్యని మొదటి నుండీ చూస్తున్న కారెన్ తల్లి 'పాట్' తన కూతురు అండాన్ని తన గర్భంలో పెంచి కారెన్ సంతానానికి మీడియేటర్‌గా ఉంటానంది. వెంటనే పాట్, కారెన్ డాక్టరు దగ్గరకు వెళ్ళి పరీక్షలు చేయించుకుని గత డిసెంబరులో వాళ్ళిద్దరూ ఆస్పత్రిలో అడ్మిట్టయ్యారు. డాక్టర్లు కారెన్ అండాన్నీ, ఆల్సెనో వీర్యాన్నీ పాట్ గర్భంలోకి ప్రవేశపెట్టారు. నాలుగు అండాల్లో ఒకటి చెడిపోగా, మిగతా మూడు పిండాలు పాట్ కడుపులో భద్రంగా దినదిన ప్రవర్థమానమవుతున్నాయి. అలా ఆ అమ్మమ్మ సొంత మనవల్నే తను స్వయంగా కనబోతోంది. ప్రస్తుతం ఆమె ఆరునెలల గర్భిణి. పాతికేళ్ళ తర్వాత తనను తల్లిని చేయబోతున్న కూతురూ, అల్లుళ్ళ సమక్షంలో పాట్ హాయిగా రోజులు వెళ్ళదీస్తోంది. ముగ్గురు మనవల్ని కనబోతోంది.

## 72 గంటల్లో నవల

1977 నుండి కెనడాలో ఏటా రికార్డు బ్రేక్ పోటీలు నిర్వహిస్తున్నారు. ఆ ఏటనే ఎనిమిది మంది రచయితలు సమావేశమై వోల్టేర్ పద్దెనిమిదవ శతాబ్దంలో సృష్టించిన రికార్డును అధిగమించాలని నిర్ణయించుకున్నారు. వోల్టేర్ 'కాండిడీ' అనే సాహిత్య గ్రంథాన్ని మూడురోజుల్లో రాశాడుట. అందుకని ఈ ఎనిమిది మంది కెనెడియన్ రచయితలూ 72 గంటల్లోగా తాము ఓ మంచి నవల రాయాలని నిర్ణయించుకున్నారు. కానీ ఘోరంగా విఫలమయ్యారు. అప్పటినుండి ఈ వార్షిక పోటీల్లో 72 గంటల్లోగా సాహిత్యపు విలువలున్న ఓ మంచి నవల రాయమంటున్నారు. ఈ సంవత్సరం వేయిమంది పోటీలో పాల్గొన్నారు. వారు టైపు చేయొచ్చు, పెన్నుతో రాయవచ్చు లేదా వర్డ్‌ప్రాసెసర్ వాడుకోవచ్చు. ఈ పోటీల్లో నెగ్గిన వారు ఓల్టేర్ అవార్డు గెల్చుకుంటారు. కానీ అవార్డు గెల్చుకున్న నవల ఆనాటి మరపురాని 'కాండిడీ'కి సమం కాబోదు. 'ఓల్టేర్' సాహిత్యం చాలా ఉన్నతంగా వుంటుంది. దానితో ఈనాటి నవలలు తూగలేకపోయినా అతని పేర పోటీ నిర్వహించడం, సభ్యులు ఉత్సాహంగా పాల్గొనడం జరుగుతూనే వుంది. ★

# పేదరికపు కోరల్లో...

మనదేశంలో 70 శాతం గ్రామీణులే! వారిలో దాదాపు అందరూ నిరక్షరాస్యులే.

వాళ్లని చదువుకొమ్మంటే మందుబిళ్లలిమ్మంటారు. పోషకాహారం, పాలు తీసుకొమ్మంటే ఓ పూటకి తిండిగింజలులేవని వాపోతారు. తమని స్వార్థానికి సమిధలుగా సర్పంచులు వాడుకుంటే ప్రతిఘటించలేని అన్నార్తులు, అమాయకులు, అనాథలు. అతివృష్టికీ- అనావృష్టికీ నడుమ ఊయలలూగే అభాగ్యులు.

వాళ్ల అభివృద్ధికోసం నడుంకట్టిన యువతీయువకులు ఎలాంటి అనుభవాల నెదుర్కొన్నారు? గ్రామీణులు వారికెంతవరకు సహకరించారు?

నగ్నసత్యాలని కళ్లెదుట చిత్రించిన
అక్కినేని కుటుంబరావు నవల 'మోహనరాగం'

నవంబరు నెల

## చతుర

లో చదవండి.

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications Printed at Colorama Printers Private Limited, 7-1-19, Begumpet, Hyderabad-500 016, TEL: 229428
CHATURA Telugu Monthly, Eenadu Compound, Hyderabad-500 482.

సినీతారలతో

సితార చేస్తున్న

సరికొత్త ప్రయోగం!

ప్రేక్షకులకు ఏం కావాలో సినీతారలకు
తెలుసు!
పాఠకులకు ఏం కావాలో 'సితార'కు
తెలుసు!!
ఈ రెండు రంగాలవారూ కలిసి తమ
అనుభవాలను రంగరించి చేసిన సరికొత్త
నవలా ప్రయోగం!!!
ఇంతవరకూ ఏ పత్రికా అందించని
నవరసానుభూతి!
ఎంతో మంది సినీతారల సహకారంతో
ప్రముఖ రచయిత

**మైనంపాటి భాస్కర్**

రాసిన అత్యద్భుత సీ'రియల్' నవల

వారం వారం 'సితార' లో
చదువుతున్నారా?